# హరిభక్తి సుధామృతం

## (భాగవత సూక్తులు)

ఓం నమో నారాయణాయ!



కందుల నాగేశ్వరరావు



# హరిభక్తి సుధామృతం

# HARI BAKTHI SUDHAMRUTAM

First Edition:  APRIL 2O24

రచన: కందుల నాగేశ్వరరావు

KANDULA NAGESWARA RAO

Address: CHAMPAPET, HYDERABAD

(M) +91 7780685166

ప్రచురణ: Lakshmi Publications

అపర్ణ & ప్రవీణ

వెల: 'పరమాత్మ' పై నమ్మకం

Cost: Belief in GOD

# సమర్పణ

నా తల్లి తండ్రులు

కీర్తిశేషులు శ్రీ రామారావు శ్రీమతి అమ్మాజీ గార్లకు



"హరిభక్తి సుధామృతం"

అనే ఈ చిరుకానుకను భక్తితో సమర్పిస్తున్నాను

కందుల నాగేశ్వరరావు

(రచయిత)

# విషయసూచిక

# ముందుమాట

శ్రీ వ్యాసమహర్షి సంస్కృతంలో అష్టాదశ పురాణాలను రచించారు. ఇవి మన ప్రాచీన సంస్కృతి సాంప్రదాయాలకు ఆదర్శం లాంటివి. ప్రజలకు నీతిధర్మాలు బోధించడం వీటియొక్క పరమాశయంగా కనిపిస్తుంది. భాగవత రచనవల్ల వ్యాసభగవానునికి మనశ్శాంతి చేకూరింది అనడంలో ఈ భాగవతపురాణ ప్రభావం ఏమిటో మనకు అర్థమవుతుంది. పదునెనిమిది పురాణాలలో ప్రసిద్ధి వహించిన శ్రీమద్భాగవతాన్ని పరమ భాగవతోత్తముడు అయిన బమ్మెర పోతనామాత్యులు తన సహజ పాండిత్యముతో అంతులేని భక్తితో తెలుగులో స్వేచ్ఛానువాదం చేసారు. దేశభాషలలో వెలువడిన మిగిలిన భాగవతాలన్నీ, పోతనగారి తెలుగు భాగవతం తర్వాత వెలిసినవే.

*'చేతులారంగ శివుని బూజింపడేని, నోరు నొవ్వంగ హరికీర్తి నుడువడేని, దయయు సత్యంబు లోనుగా దలపడేని, గలుగ నేటికి దల్లుల కడుపు జేటు"* అని పోతనగారు తలిచారు.

*'పలికెడిది భాగవతమట పలికించెడివాడు రామభద్రుండట'* అని మనస్సులో అనుకొని వారు భాగవత గ్రంథ రచనకు పూనుకున్నారు.

*'పట్టు పీతాంబరాలు కట్టుకునేవాడు, బ్రహ్మాండ భాండాలను సృష్టించేవాడు, గోపికల గృహాలవైపు పయనించేవాడు, ఆదిశేషునిపై శయనించేవాడు"* అయిన ఆ శ్రీమహావిష్ణువుకు తను రచించిన భాగవత గ్రంథాన్ని భక్తితో సమర్పించారు.

భాగవతం శాఖానుశాఖలుగా విస్తరించిన కల్పవృక్షం లాంటిది. భాగవతంలోని ఇతివృత్తాలకు కేంద్రం అవతారమూర్తియైన శ్రీకృష్ణుడు, శ్రీకృష్ణుడి పూర్వ అవతారాలు.

భాగవతానికి అంతరాత్మ భక్తి. నవవిధ భక్తి మార్గాలు (శ్రవణం, కీర్తనం, విష్ణు స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనం) ఇందులో హృదయానికి హత్తుకొనేటట్లుగా వర్ణించబడ్డాయి. భాగవతులు ఒక్కొక్కరు ఒక్కొక్క మార్గాన్ని ఎంచుకొని మోక్షాన్ని సాధించారు. ఈ భాగవత పురాణాన్ని అచంచల భక్తితో పఠించే భక్తుల అంతరంగాలలో భగవంతుడు ఎల్లప్పుడూ నివసిస్తాడు. వ్యాసుడు రచించిన భాగవతాన్ని వ్యాసుడి కుమారుడైన శుకమహర్షి, మృత్యునిరీక్షలో ఉండి ముక్తిని పొందగోరిన పరీక్షిత్తుకు ఏడు రోజులలో ఉపదేశం చేశాడు.

విష్ణు కథలు కల్యాణాత్మకమైనవి. అంటే శుభాలు ప్రసాదించేవి. అవి ఎన్ని మారులు విన్నా, ఎప్పటి కప్పుడు క్రొత్తవిగానే ఉంటాయి. శ్రీహరి గుణ సంకీర్తనాలతో నిండిన సంభాషణలు, సకల పాపాలను హరించి, భక్త హృదయాలకు సంతోషాన్ని, నిత్యకల్యాణాన్ని కలిగిస్తాయి. పోతనగారి హస్తం నుండి తెలుగులో ఈ భాగవత భక్తికావ్యం అవతరించిన నాటి నుండి ఎందరో భక్తులకు, కవులకు మార్గదర్శకంగా అలరారుతోంది. భాగవత గ్రంథం లోని ప్రతీ పద్యం హృదయానికి హత్తుకుంటుంది.

తెలుగునాట పోతనగారి పద్యం ఒక్కటైనా నోటికిరాని పండితుడుగానీ పామరుడుగానీ లేడనేది అతిశయోక్తి కాదు.

భాగవత పురాణంలోని పాత్రల సంభాషణల ద్వారా ప్రభోదించిన భక్తిమార్గాలు; ధర్మసందేశాలు; విశ్వాత్మ, పరమాత్మ, సర్వాంతర్యామి అయిన శ్రీమహావిష్ణువు వర్ణనలు సేకరించి ఈ "హరిభక్తి సుధామృతం" (భాగవత సూక్తులు) లో పొందు పరచడం జరిగింది. ఈ "భాగవత సూక్తులు" మననం చేయడం ద్వారా జగన్నాథుడైన వాసుదేవునిపై భక్తిభావం అలవరుచుకొని ధర్మమార్గంలో ప్రయాణించి ఆ భగవంతుని కృపకు పాత్రులు కావచ్చు.

*ఓం శ్రీ వాసుదేవాయ నమః*
*ఓం శ్రీ ప్రద్యుమ్నాయ నమః*
*ఓం శ్రీ సంకర్షణాయ నమః*
*ఓం శ్రీ అనిరుద్ధాయ నమః*
*ఓం శ్రీ నారాయణాయ నమః*

కందుల నాగేశ్వరరావు
(రచయిత)

# ప్రథమ స్కంధము

శ్రీ పోతనామాత్యులు భాగవత రచన ప్రారంభిస్తూ మొదట శ్రీకృష్ణ పరమాత్మని ఈ విధంగా ప్రార్థించారు.

*శ్రీ కైవల్య పదంబు జేరుటకునై చింతించెదన్, లోక ర*
*క్షైకారంభకు, భక్త పాలన కళా సంరంభకున్, దానవో*
*ద్రేక స్తంభకు, గేళి లోల విలసద్దృగ్జాల సంభూత నా*
*నా కంజాత భవాండ కుంభకు, మహానందాంగనా డింభకున్.*

మోక్ష సంపదను ఆశించిన నేను ఆనంద స్వరూపిణియైన నందుని ఇల్లాలి ఒడిలో ముద్దుగా ఆడుకుంటున్న అందాల బాలుణ్ణి ధ్యానిస్తున్నాను. ఆ యశోదా పుత్రుడు సామాన్యుడు కాదు. ఎల్లప్పుడూ ఎల్ల లోకాలనూ చల్లగా పాలిస్తూ ఉంటాడు. రాక్షసులను నిర్మూలిస్తూ ఉంటాడు. ఆ చిన్ని కృష్ణుడు ఒక్కమాటు కన్నెత్తి చూస్తే చాలు, ఎన్నో బ్రహ్మాండభాండాలు తండోప తండాలుగా ఆ చూపుల్లో రూపు దిద్దుకుంటాయి.

తరువాత వరుసగా ఇష్టదేవతలైన పరమశివుని, బ్రహ్మదేవుణ్ణి, ఉమ, వాణి, దుర్గ, లక్ష్మీదేవిని ప్రార్థించారు.

*చేతులారంగ శివుని బూజింపడేని*
*నోరు నొవ్వంగ హరికీర్తి నుడువడేని*
*దయయు సత్యంబు లోనుగా దలపడేని*
*గలుగ నేటికి దల్లుల కడుపు జేటు.*

ఈ జగత్తులో జన్మించిన ప్రతీవారు చేతులారా శివుణ్ణి పూజించి, నోరారా కేశవుణ్ణి కీర్తించి, సత్యము, కరుణ మొదలైన సద్గుణాలను అలవర్చుకోవాలి. అలా చేయని నిర్భాగ్యుడు ఈలోకంలో పుట్టటం దేనికి? తల్లి కడుపు చెడకొట్టడం దేనికి?

***

శ్రీరామచంద్రుడు పోతనగారికి కలలో కనపడి తెలుగులో భాగవతాన్ని రచించమని చెప్పి అంతర్ధానమయ్యాడు. పోతనగారు తనలో తాను ఇలా అనుకుంటున్నారు:

*పలికెడిది భాగవతమట! పలికించెడి వాడు రామభద్రుండట! నే*
*పలికిన భవహర మగునట! పలికెద వేఱొండుగాథ పలుకగ నేలా?*

పలికేది పవిత్రమైన భాగవతమా! పలికించే ప్రభువు కరుణా సముద్రుడైన రామభద్రుడా? పలకడం వల్ల భవబంధాలు పరిహారమౌతాయా! అటువంటప్పుడు వేరొక కథ పలకడం దేనికి? భాగవతమే పలుకుతాను. అలా పలకడం నా అదృష్టం.

భాగవతం సాక్షాత్తూ కల్పవృక్షమే! భాగవతం కృష్ణుడే మూలాధారంగా కలది. పవిత్రమైన వ్యాసులవారిచే రచింప బడింది. శుకమహర్షిచే మనోహరంగా చెప్పబడింది. ఉజ్వలమైన ఇతివృత్తం గలది. కైవల్య మనే గొప్ప ప్రయోజనంతో కూడినది. అయితే కల్పవృక్షం స్వర్గంలో ఉంటుంది. భాగవతమనే కల్పవృక్షం ఈ భూలోకంలో ప్రకాశిస్తుంది.

**కథా ప్రారంభము:**

ఎవ్వనివల్ల ఈ విశ్వానికి సృష్టిస్థితిలయాలు ఏర్పడుతుంటాయో, ఎవడు సమస్తానికి రాజై విరాజిల్లుతుంటాడో, ఎవడు సంకల్పం మాత్రం చేతనే బ్రహ్మదేవునికి వేదాలు తెలియజేశాడో, ఎవనియందు ఈ సృష్టి అంతా అసత్యమై కూడా సత్యంగా కనిపిస్తూ ఉంటుందో, సత్యస్వరూపుడైన ఆ పరమాత్మను ప్రతినిత్యమూ స్తుతి చేస్తున్నాను.

ఈ భాగవత పురాణాన్ని భక్తితో పఠించే భక్తుల హృదయాలలో భగవంతుడు ఎల్లప్పుడూ నివసిస్తాడు. భాగవత శ్రవణం వల్ల *"తాపత్రయం" అనగా ఆధ్యాత్మికం, ఆదిభౌతికం, ఆది దైవికం* అనే మూడు విధాల తాపాలు నశించి వారికి తత్త్వజ్ఞానం తెలుసుకోవాలనే కోరిక కలుగుతుంది.

***

*శ్రీమన్నారాయణుడి సద్గుణాలను ఎప్పుడూ కీర్తించేవాడు, సమస్త పురాణాలను చక్కగా వివరించి చెప్పే నేర్పుగలవాడు, రోమహర్షుని కుమారుడు "ఉగ్రశ్రవుడు" అనే సూతుని, శౌనకాది మునులు ఇలా అడిగారు.*

మునీంద్రా! ఈ కలియుగంలో మానవులందరూ సోమరిపోతులు, మందబుద్ధులు, మందభాగ్యులు, అల్పాయుష్కులు, సత్కార్యము లేవీ చేయలేని అసమర్థులౌతున్నారు. అందువల్ల వారికి శాంతి కలిగే మార్గం ఉపదేశించు.

ఏ మహానుభావుని అవతారం ఈ జగత్తులోని సమస్తజీవులకూ ఆనందాన్ని, అభివృద్ధిని అందిస్తుందో; ఏ మహానుభావుని దివ్యనామాన్ని ఎల్లప్పుడూ ఉచ్చరించడంవలన భవబంధాలన్ని వదిలిపోతాయో, ఏ మహానుభావుని పవిత్ర చరిత్రాన్ని తలంచినంతమాత్రాన మృత్యుదేవత భయపడి పారిపోతుందో, ఏ మహానుభావుని పాదాలనుండి పుట్టిన నదీజలాలను త్రాగినంతమాత్రాన సమస్త పాపాలు నశించి పుణ్యం లభిస్తుందో అట్టి వాసుదేవుని పవిత్ర కథలన్నీ వినాలని ఎంతో ముచ్చట పడుతున్నాము. అవన్నీ మాకు వినిపించు.

భయంకర పాపాలను భస్మీభూతం చేయాలంటే, శ్రీహరి నామ సంకీర్తన చేయాలి. సంసార దుఃఖాలు పారద్రోలాలంటే, వాసుదేవ సందర్శనం కావాలి. అరిషడ్వర్గాలను పటాపంచలు చేయాలంటే, శ్రీమన్నారాయణ ధ్యానం కావాలి. సంసార సముద్రాన్ని దాటాలంటే, విష్ణుదేవుని భక్తి అనే నావ ఎక్కాలి. అందువల్ల మాకు శ్రీహరి మహాత్మ్యాన్ని తెలిపే విష్ణుదేవుని కథలు వినిపించండి.

***

*"ఉగ్రశ్రవసుడు"* అనే సూతుడు వ్యాసమహర్షికి, వ్యాసుని కుమారుడైన శుక మహర్షికి, నరనారాయణులకు, చదువుల తల్లి సరస్వతీదేవికి నమస్కరించి జనన మరణ బంధాలను పటాపంచలు చేసే పవిత్ర గ్రంథమైన భాగవత పురాణం చెప్పడం మొదలెట్టాడు.

ఈ అనంత విశ్వానికి అధిపతియైన పరమపురుషుడు ఒక్కడే. ఆయనే సత్త్వరజస్తమోగుణాలను స్వీకరించి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల రూపాలు ధరించి ఈ లోకాన్ని సృష్టిస్తూ, రక్షిస్తూ, అంతం చేస్తూ ఉంటాడు. అందులో అనంత గుణ సంపన్నుడైన శ్రీహరి చరాచర ప్రపంచానికి అంతులేని శుభాలను అనుగ్రహిస్తాడు

కొంతమంది సంసార సుఖాలను ఆశించి ఇతర దేవతలను ఆరాధిస్తారు. మోక్షాన్ని కోరినవారు మాత్రం ఇతర దేవతలను నిందించకుండా శాంతస్వభావులై శ్రీహరిని ఆశ్రయిస్తారు. వేదాలు, యాగాలు, జ్ఞానాలు, తపస్సులు, ధర్మాలు అన్నీ వాసుదేవ స్వరూపాలే.

అనంతుడైన ఆ భగవానుడు సమస్త లోకాలను సృష్టింపదలచి *మహత్తు, అహంకారం, శబ్ద, స్పర్శ, రస, గంధాలతో* కలిసి పదహారు కళలతో నిండినవాడై; *పృథివి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం* అనే పంచభూతాలతో ప్రకాశమానుడై; వేలకొలది ముఖాలతో, కన్నులతో, చెవులతో, భుజాలతో, ఊరువులతో, పాదాలతో సర్వేశ్వరుడై అలరారుతూ; బంగారు వస్త్రాలు, మణిమయ కిరీటాలు, హారాలు, భుజకీర్తులూ ధరించి యోగనిద్రలో మునిగి సముద్ర మధ్యంలో శయనించి ఉంటాడు. అదే అన్ని అవతారాలకు *"మూల విరాట్టు"* అయిన *'ఆదినారాయణుని దివ్యరూపం'.* శ్రీమన్నారాయణుని నాభి కమలం నుండి సృష్టికర్తయైన 'బ్రహ్మదేవుడు' ఉదయించాడు. సమస్తానికి జీవమై, పరమాత్మకు స్థానమై తొలి అవతారమైన *ఆ విరాట్ పురుషుని గర్భం నుండి భూతమయమైన ఈ సమస్త విశ్వం పుట్టింది.*

***

శ్రీమహావిష్ణువు ఏకవింశతి (21) అవతారములు:

బ్రహ్మ, యజ్ఞవరాహస్వామి, నారదుడు, నరనారాయణులు, కపిలుడు, దత్తాత్రేయుడు, యజ్ఞుడు, ఋషభుడు, పృథుచక్రవర్తి, మత్స్యావతారం, కూర్మావతారం, ధన్వంతరి, మోహిని, నరసింహస్వామి, వామనావతారం, పరశురాముడు, వేదవ్యాసుడు, శ్రీరాముడు, బలరామకృష్ణులు, బుద్ధుడు, కల్కి.

ఏయే సమయాలలో లోకాలు రాకాసిమూకల వల్ల చీకాకు పాలవుతాయో, ఆయా సమయాలలో శ్రీమన్నారాయణుడు లీలావతారుడై అవతరించి, దుష్టశిక్షణ శిష్టరక్షణ చేస్తుంటాడు.

అత్యంత రహస్యాలైన వాసుదేవుని అవతారగాథలు, ఏ మానవుడు ఉదయమూ సాయంకాలమూ నిత్యమూ అత్యంత శ్రద్ధాభక్తులతో పఠిస్తాడో, అతడు దుఃఖమయమైన సంసార బంధాలకు దూరంగా తొలగిపోయి ఆనందం అనుభవిస్తాడు.

శ్రీమన్నారాయణుడు ఈ సకల భువనజాలాన్నీ తన లీలావిలాసం చేత పుట్టిస్తుంటాడు; రక్షిస్తుంటాడు; అంతం చేస్తుంటాడు. తాను మాత్రం ఆ జన్మ మరణాలలో నిమగ్నం కాడు. సకల ప్రాణి సమూహమందు ఆత్మస్వరూపుడై విహరిస్తుంటాడు.

శ్రీమద్భాగవతం లోకేశ్వరుడైన శ్రీహరి చరిత్రం. ఈ మహాగ్రంథాన్ని పూర్వం లోకకల్యాణం కోసం భగవంతుడైన వ్యాసభట్టారకుడు అత్యంత పవిత్రంగా రచించాడు. అలా రచించిన

భాగవత గ్రంథాన్ని శుకయోగీంద్రుడు గంగానదీ మధ్యలో మునిగణ సహితుడై, అత్యంత విరక్తుడై, ప్రాయోపవేశం చేయడానికి పూనుకొన్న పరీక్షిన్మహారాజు అడుగగా వినిపించాడు.

శ్రీకృష్ణభగవానుడు తన అవతారాన్ని చాలించి వైకుంఠానికి వెళ్ళిపోయిన అనంతరం లోకంలో కలియుగం ప్రవేశించింది. కలికాల దోషాలవల్ల గాఢాంధకారంలో దిక్కు తెలియక చీకాకుపడుతున్న మానవులకు ఈ భాగవత పురాణం వెలుగు చూపుతుంది.

ఉత్తమమైన కీర్తిప్రతిష్ఠలు కల రాజోత్తములు తమ వ్యక్తిగత సుఖాన్ని మాత్రమే ఎప్పుడూ కోరుకోరు. వారు ఎల్లప్పుడూ ప్రజలకు అర్థసంపద, ఐశ్వర్యము, సౌఖ్యము, శ్రేయస్సు చేకూర్చాలని కాంక్షిస్తూ ఉంటారు.

***

*వ్యాసుడు వ్యాకులచిత్తుడై చింతిస్తున్న సమయంలో నారదమహర్షి ఉపదేశం చేయుట:*

ద్వాపరయుగం చివరిలో పరాశరుని కుమారుడూ, భూత భవిష్య వర్తమానాలు తెలిసినవాడూ అయిన వేదవ్యాసుడు ప్రజల క్షేమం కోసం ఒకటిగా ఉన్న వేదాన్ని ఋక్కు, యజస్సు, సామము, అథర్వము అనే నాలుగు వేదాలుగా విభజించాడు. సామాన్య ప్రజల కొరకు పంచమ వేదమైన మహాభారతాన్ని, పురాణాలను రచించాడు. అయినా సరే అతని హృదయంలో సంతుష్టి కలుగ లేదు.

అలా వ్యాకుల చిత్తుడైన వ్యాసమహర్షికి ఆ సమయంలో త్రిలోకసంచారి అయిన నారద మహర్షి ప్రత్యక్షమై *"వాసుదేవుని గుణాలను అందంగా వర్ణించి చెప్పాలి. నీవు నీ గ్రంథాలలో హరినామ సంకీర్తనం ప్రధానంగా చేయకపోవడమే నీ అసంతృప్తికి కారణం"* అని వ్యాసునికి ఉపదేశించాడు.

హరినామ సంకీర్తనంతో ప్రకాశించే కావ్యం శోభాయమానమైన మానససరోవరం లాగా విరాజిల్లుతుంది. హరినామ సంకీర్తన లేని కావ్యం ఎంత చిత్రవిచిత్రంగా ఉన్నా కాకులు మూగిన ఎంగిలాకుల బురదగుంటలాగా ఉంటుంది.

జ్ఞానవంతుడైనవాడు కోరికతో కూడిన కర్మలన్నిటిని పరిత్యజించి గోవిందుని గుణగణాలందు మాత్రమే మనస్సును నిలిపి హరి స్వరూపం తెలుసుకోవడానికి సమర్థవంతమైన ప్రయత్నం చేస్తాడు. అజ్ఞాని వివేకహీనుడై దేహాభిమానం, ధనాభిమానం, రూపాభిమానం కలవాడై సంచరిస్తూ ఉంటాడు.

ఎవడైతే తన కులధర్మాలను వదలిపెట్టి గోవింద పాదారవిందాలను శ్రద్ధాసక్తులతో సేవిస్తూ కృతార్థుడు కాకుండా మరణిస్తాడో అట్టివానికి నష్టమేమీ కలుగదు. అతడు ఆ జన్మలో కాకపోయినా మరుజన్మలోనైనా తన సేవకు తగిన ఫలితాన్ని తప్పక పొందుతాడు.

లోకంలో ఏ పదార్థం వల్ల ఏ రోగం ఉద్భవించిందో ఆ పదార్థం ఆ రోగాన్ని పోగొట్టలేదు. మరో పదార్థం చేత చికిత్స జరిగితే తప్ప ఆ రోగం శాంతించదు. కర్మలు ఈశ్వరార్పణ చేయడం వలన మాత్రమే మనిషిలో ఉండే తాపత్రయం అనే రోగం శాంతిస్తుంది. ఈశ్వరుడు సంతోషించి జ్ఞానాన్ని భక్తిని అనుగ్రహిస్తాడు. వ్యాసమహర్షీ! నీవు కూడా శ్రీహరిని సంకీర్తించు.

*ఓంకార పూర్వకంగా వాసుదేవ - ప్రద్యుమ్న - సంకర్షణ - అనిరుద్ధ నామాలు* భక్తితో ఉచ్చరించి, నమస్కరించి, చిన్మయ స్వరూపుడైన యజ్ఞేశ్వరుణ్ణి ఆరాధించే మానవుడు సమదృష్టి కలవాడౌతాడు. ఈ సంసార సముద్రంలో మునిగి తేలుతూ కోరికలతో సతమతమయ్యే వానికి గోవింద గుణకీర్తనం ఒడ్డుకు చేర్చే తెప్ప లాంటిది.

*యమము, నియమము, ప్రాణాయామము, ప్రత్యాహారము మొదలైన అష్టాంగముల* ద్వారా మనస్సును ఎంత కట్టుదిట్టం చేసుకొన్నప్పటికీ *కామము, రోషము* మొదలైన వానిచే అది మాటి మాటికీ రెచ్చిపోతూనే ఉంటుంది, కాని శాంతించదు. అట్టి శాంతి వాసుదేవుని సేవ వల్ల మాత్రమే క్రమంగా లభిస్తుంది.

***

*నారదమహర్షి మాటలు విన్న అనంతరం వ్యాసుడు సరస్వతీ నదీతీరాన యజ్ఞాలు చేసుకోవడానికి అనుకూలమైన బదరికాశ్రమానికి వెళ్ళి తన మనస్సులో భగవంతుని దర్శించాడు. తన బాధకు ఉపశమనం 'హరిభక్తి' అనే యోగం తప్ప మరొకటి లేదని నిశ్చయించాడు.*

"ఏ మహాగ్రంథాన్ని విన్నంత మాత్రం చేతనే సంసారబంధాలు సమసిపోయి జగన్నాథుడైన జనార్దనునిపై అచంచల భక్తి ఆవిర్భవిస్తుందో అటువంటి లోకకల్యాణకారకమైన, వేదస్వరూపమైన భాగవతాన్ని ఓర్పుతో నేర్పుతో రచించాడు. వ్యాసుని కుమారుడు పరమవిష్ణుభక్తుడు అయిన శుకమహర్షి విశ్వశ్రేయస్సును కాంక్షించి భాగవతాన్ని అధ్యయనం చేశాడు" అని శౌనకాది మునులకు సూతమహర్షి చెప్పాడు.

వేలకొద్దీ వేదాలు వల్లించినా మోక్షసౌభాగ్యాలు సంప్రాప్తించవు. భాగవతమనే ఆమ్నాయాన్ని అధ్యయనం చేస్తే తప్పక మోక్షం హస్తగతమవుతుంది.

***

*నిద్ర పోతున్న పాండవ కుమారులను చంపి పారిపోతున్న అశ్వత్థామను పట్టుకున్న అర్జునునితో శ్రీకృష్ణుడు:*

అర్జునా! వీడు దుర్మార్గుడు. అర్ధరాత్రి సమయంలో అసహాయస్థితిలో నిదురిస్తున్న పసిపాపలను ఈ పాపాత్ముడు పట్టి వధించాడు. ఇప్పుడు ప్రాణాలు కాపాడు కోవడం కోసం పారిపోతున్నాడు.

అయినా వీడిని కనికరించు. భయపడిన వాడినీ, దిగులుతో మతిభ్రమించిన వాడినీ, నిద్రపోయిన వాడినీ, మద్యపానంచేసి మైమరచిన వాడినీ, పరాజితుడై పారిపోయే వాడిని, రక్షించమని వేడిన వాడినీ, కదలక మెదలక పడి ఉన్న వాడినీ, ఆడువారినీ చంపడం ధర్మం కాదు.

***

*అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రంతో విలవిల్లాడుతున్న ఉత్తర శ్రీకృష్ణుని ఇలా వేడుకొంది:*

"దేవదేవా! ప్రళయ జ్వాలాగ్నితో కూడిన బాణం ఒకటి నా కడుపులోనున్న కసుగందును కాల్చివేయాలని చూస్తున్నది. విశ్వంభరా! నీ పాదాలను శరణువేడుతున్నాను. దయతో నన్ను రక్షించు. వందల కొద్ది బ్రహ్మాండాలను నీ కడుపులో దాచుకున్న నీకు ఒక ఆడదాని గర్భాన్ని రక్షించడం ఏమంత బ్రహ్మాండం".

***

*శ్రీకృష్ణుడు ఉత్తర గర్భంలో ఉన్న శిశువును రక్షించుట:*

సూక్ష్మాతి సూక్ష్మమైన రూపంతో సమస్త ప్రాణుల హృదయాంతరాళాల్లో జ్యోతిర్మూర్తియై ప్రకాశించే వాసుదేవుడు పాండవుల వంశాంకురాన్ని రక్షించడం కోసం చక్రాన్ని ధరించి, ఉత్తర గర్భాన్ని యోగమాయతో కప్పివేసి, అమోఘమైన వైష్ణవ తేజస్సుతో అశ్వత్థామ బ్రహ్మాస్త్రాన్ని అవలీలగా అణచివేశాడు.

***

*కుంతీదేవి శ్రీకృష్ణుని స్తుతించుట:*

కృష్ణా! నీవు పురాణ పురుషుడవు. దేవదేవుడవు. అనంతుడవు. విశాల విశ్వాన్ని నడిపే పరమేశ్వరుడవు. ప్రాణుల వెలుపల లోపల వెలుగొందేవాడవు. వాసుదేవా! దేవకీ నందనా! నందగోపకుమారా! గోవిందా! పద్మనాభా! నా ప్రణామాలు స్వీకరించు.

గొప్పవంశంలో జన్మించామనీ, భోగభాగ్యాలున్నాయనీ, ధనం సంపాదించామనీ, విద్యావంతులమనీ మదాంధులైన మానవులు నిన్ను ప్రస్తుతింప లేరు. నిష్కాములైన భక్తులకు మాత్రమే అది సాధ్యం అవుతుంది. నీవు భక్తులకు కొంగుబంగారానివి. మోక్షప్రదాతవు. నీకు అయినవారు కానివారు లేరు. నీవు అవతరించడం లోకం కోసమే కాని నిజానికి నీకు జన్మాదులు లేవు.

కర్తవ్యం విస్మరించి కార్యకర్తలలో మునిగితేలుతూ అజ్ఞానంలో కొట్టుమిట్టాడుతున్న ఆపన్నుల ఆర్తి పోగొట్టి, వారికి **శ్రవణం, చింతనం, వందనం, అర్చనం** మొదలైన భక్తిమార్గాలను ఉపదేశించడానికి నీవు శ్రీకృష్ణ పరమాత్మగా అవతరించావని నీ భక్తుల నమ్మకం.

శ్రీకృష్ణా! యదుకులభూషణా! శృంగారరసరత్నాకరా! జగదీశ్వరా! నీకు నమస్కరిస్తున్నాను. పరిపూర్ణ కరుణతో నా భవబంధాలు ఖండించు.

***

*కురుక్షేత్రంలో అంపశయ్యపై పడి ఉన్న భీష్ముడు పాండవులతో:*

ఆకాశంలోని మేఘాలు గాలికి ఎగిరి పరస్పరం కలుసుకొంటూ విడిపోతూ ఉన్నట్లు ఈ ప్రపంచంలోని ప్రాణికోటి సమస్తం కాలచక్రం వల్ల కూడుతూ, వీడుతూ ఉంటుంది. కాలమే అన్నిటికీ మూలం. కాలం చాలా విచిత్రమైనది. ఎంతటి వారైనా ఈ కాల ప్రవాహాన్ని దాటలేరు, ఆపలేరు.

ధర్మరాజంతవాడు రాజు. మహావీరుడైన అర్జునుడు యోద్ధ. శత్రుభయంకరమైన గాండీవం అతని ధనస్సు. సర్వసౌభాగ్య సంధాత శ్రీకృష్ణుడు హితుడు, రథసారథి. ప్రచండ గదాదండధారి అయిన భీమసేనుడు కొండంత అండ. అయినా పాండవులకు తప్పలేదు అరణ్యవాసాలు, అజ్ఞాతవాసాలు. ఎంత ఆశ్చర్యం!

లోకేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు ఎప్పుడు ఎవరికి ఏమి చేస్తాడో ఎవరు చెప్పగలరు? ఆ మహానుభావుని మాయలకు పెద్ద పెద్ద విద్వాంసులు సైతం దిక్కు తెలియనివారై, లోబడి అణిగ మణగి ఉంటారు.

ధర్మరాజా! నా భాగ్యం పండింది. నేను శరీరం చాలించే సమయానికి దేవదేవుడైన గోవిందుడు వికసిత వదనారవిందంతో నాలుగు చేతులతో, తామరపువ్వులవంటి కన్నులతో నా కన్నుల ముందు సాక్షాత్కరించాడు. ఈ మహానుభావుని కోసం పూర్వజన్మలో నేనెంత పుణ్యం చేశానో!

***

*భీష్ముడు శ్రీకృష్ణుని స్తుతించుట:*

రణరంగంలో బంధుమిత్రుల ప్రాణాలు తీయడానికి ఇష్టపడక వెనుకంజ వేస్తున్న ధనంజయునికి గీతోపదేశం చేసి సందేహాలు తీర్చి ముందడుగు వేయించిన ముకుందుని పాదభక్తి నా అంతరంగంలో ఎల్లప్పుడు నిలిచిపోవాలి.

ఒకే ఒక సూర్యుడు సకల జీవరాసులలో ఒక్కొక్కరికి ఒక్కొక్కడుగా కానవచ్చే విధంగా తాను సృష్టించిన నానావిధ ప్రాణి సమూహాల హృదయకమలాలలో నానావిధ రూపాలతో సర్వకాల సర్వావస్థల యందు తన లీలా విలాసంతో తనరారే భగవంతుణ్ణి పవిత్రహృదయంతో ప్రార్థిస్తున్నాను.

***

*హస్తినాపుర వీధుల్లో వెళ్తున్న శ్రీకృష్ణుని చూసి పౌరకాంతలు ఇలా స్తుతించారు:*

ఈ సచ్చరిత్రుడు జన్మించడం వల్లనే యాదవవంశం పునీతమైంది. ఈ పుణ్యమూర్తి నివసించడం వల్లనే మధురానగరం మహిమాన్వితమై పేరుపొందింది. ఈ పురుషోత్తముణ్ణి ఎల్లప్పుడూ చూస్తూ ఉండం వల్లనే ద్వారకలో ఉండే ప్రజలు ధన్యాత్ములయ్యారు. ఈ వీరాధివీరుడు క్రూరాత్ములను ఏరి పారేయడం వల్లనే ఈ విశాల విశ్వం ప్రశాంతంగా ఉంది. ఈ కమలాక్షుణ్ణి, కరుణా సముద్రుణ్ణి జీవితేశ్వరునిగా స్వీకరించి ఆనందంగా కాపురం చేస్తున్న రుక్మిణీ, సత్యభామా మొదలైన

సాధ్వీమణులు పూర్వజన్మలో ఎన్ని పుణ్యాలు చేసారో, ఏ నోములు నోచారో!

***

*హస్తిన నుండి తిరిగివచ్చిన కృష్ణునితో ద్వారకావాసులు ఇలా అన్నారు:*

కృష్ణా! నీ దయవల్ల క్షేమంగా ఉన్నాము. నీవు సంసార సముద్రాన్ని దాటించే నావవు. తండ్రులందరికీ తండ్రియైన బ్రహ్మదేవునికి తండ్రివి. మా అందరికీ తండ్రీవీ, తల్లివీ, గురువువీ, దైవానివీ, మిత్రుడవూ, సమస్తమూ నీవే. నీవు కనపడకుంటే, మేము కటిక చీకటిలో కొట్టుకుంటాము.

***

*ఉత్తర గర్భంలో పెరుగుతున్న శిశువు ఇలా ఆక్రోశించసాగాడు:*

తల్లి గర్భంలో తల్లడిల్లుతున్నాను. నేను అనుభవించే బాధను అర్థంచేసుకుని ఈ బాణాగ్నినుండి నన్ను ఆదుకొనే దయగల తండ్రి ఎక్కడున్నాడో. శ్రీహరి నన్ను రక్షిస్తాడని అమ్మ అనుదినం అందరితో అంటూ ఉంటుంది. అఖిల ప్రాణులలో అంతర్యామిగా ప్రకాశించే స్వామి నా కోసం రాడా! ఆ కరుణామయుడు నన్ను కరుణించి నా మొర వినడా!

***

*ఉత్తరాగర్భస్థ శిశువుకు శ్రీమహావిష్ణువు సాక్షాత్కారం:*

మేఘం మీద మెరుపుతీగలాగా, నల్లని దేహం మీద పచ్చని చేలం ధరించినవాడు, చెక్కిళ్లపై మణులు పొదిగిన మకరకుండలాల బంగారు కాంతులు ప్రసరించేవాడు, ఉదయించే సూర్యబింబాన్ని పోలిన

రత్నకచిత సువర్ణ కిరీటం తలపై ధరించినవాడు, కంకణాలతో, భుజకీర్తులతో, వనమాలతో విరాజిల్లేవాడు, బొటన వ్రేలంత దేహ పరిమాణంగల శ్రీమహావిష్ణువు గదాధరుడై, కన్నులపండువుగా గర్భంలోని శిశువుకు సాక్షాత్కరించాడు. శిశువును దశదిశలా గిరగిరా త్రిప్పుతూ బ్రహ్మాస్త్ర ప్రతాపాన్ని శాంతింపజేసాడు. పసికందు బాధను ఉపశమింపజేసి అపరిమితమైన ఆనందాన్ని కలుగజేసాడు.

***

*విదురుడు ధృతరాష్ట్రునికి విరక్తిమార్గాన్ని ఉపదేశించుట:*

ప్రపంచంలోకి మానవులు బంగారు భవనాలనూ, పుత్ర, మిత్ర, కళత్ర పరివారాలనూ ఎల్లప్పుడూ ఎదురుగుండ చూచుకొంటూ, ప్రాణాలమీద తీపిని పెంచుకొంటూ ఉంటారు. అయితే దుర్నివారకమైన ఆ కాలం వారిని చంపి తీరుతుంది. కాలాన్ని కాదని ఎదిరించే శక్తి ఎవరికీ లేదు. అక్కడ ఏ ఉపాయాలు పనిచేయవు. ఈ దేహం నిత్యం కాదన్న సత్యం తెలుసుకొని, దేహం మీద వ్యామోహం తెంచుకొని, యోగ్యమైన వైరాగ్యమార్గంలో ముందడుగు వేసేవాడే మోక్షలక్ష్మిని కైవసం చేసుకోగలుగుతాడు.

***

*ధృతరాష్ట్రుడు తన మందిరంలో కనపడక విచారిస్తున్న ధర్మరాజుతో నారదమహర్షి:*

ఈ విశ్వమంతా ఈశ్వర ఆధీనం. పరమేశ్వరుడే ప్రాణులను ఒకరితో ఒకరిని కలుపుతూ విడదీస్తూ ఉంటాడు. భగవంతుడు

కర్తవ్యాకర్తవ్యాలను బోధించి, వేదవాక్కులనే తాడు బిగించి దేవతలతో సహా అన్ని ప్రాణులను ఇష్టం వచ్చినట్లు త్రిప్పుతుంటాడు. భగవంతుని ఇచ్ఛానుసారంగా ప్రాణులకు సంయోగ వియోగాలు ప్రాప్తిస్తుంటాయి. ఈ విశ్వమంతా ఈశ్వర స్వరూపంగా భావించు, ఆయన కంటే వేరైనది ఇంకేమీ లేదు. అజ్ఞానమూలకమైన మమకారం పెంచుకొని అనవసరంగా మనస్సును బాధ పెట్టడం తగదు. ఎంత వాడైనా కాలప్రభావానికి తల వంచక తప్పదు.

***

*శ్రీకృష్ణుని అవతార సమాప్తి:*

ఒక కంటకంతో మరో కంటకాన్ని పెకిలించి, రెండు కంటకాలనూ దూరంగా పారవేసే వివేకవంతునిలాగా, పరమేశ్వరుడు యాదవ శరీరం ధరించి జగత్కంటకాలైన పరుల శరీరాలను అంతమొందించి తన శరీరాన్ని కూడా వదిలిపెట్టాడు. పరమేశ్వరుడికి సంహార విషయంలో స్వపరదేహాలనే భేదం లేదు. ఏనాడైతే శ్రీకృష్ణుడు అవతార సమాప్తి కావించాడో ఆనాడే అమంగళదాయకమైన కలియుగం ఆరంభమయింది. కాలగమనంలో ఎంత మార్పు వచ్చిందో! క్రోధం, లోభం, క్రౌర్యం, అసత్యం మితిమీరి ప్రజలు ప్రవర్తిస్తున్నారు. వ్యాపారంలో మోసం, స్నేహంలో ద్రోహం కనిపిస్తూ ఉంది. భార్యలు భర్తలను ద్వేషిస్తున్నారు, కొడుకులు కన్నతండ్రులపై కాలు దువ్వుతున్నారు, శిష్యులు గురువులను దూషిస్తున్నారు, విజ్ఞులు సైతం న్యాయమార్గాన్ని విడిచి పెట్టారు.

***

*శౌనకుడు సూతమహర్షితో:*

నందనందన పాదారవింద మకరంద పానంచేత పరవశులైన ఉత్తమ పురుషుల  పవిత్ర చరిత్రలు వినకుండా, దుర్జనుల చెడు చరిత్రలకు చెవులొగ్గి, సంసారబంధాలకు లోబడి, పరమార్థాన్ని విస్మరించి, వ్యర్థంగా కాలం గడపటం తెలివి తక్కువ పని.

మందబుద్ధులు, సోమరి పోతులు, అల్పాయుష్కులు ఐన మూర్ఖులు మాత్రమే పనికిమాలిన మార్గాలలో పడి కొట్టుకుంటూ ఉంటారు. అటువంటి వారికి హరిచరణకమల సుధాధారలు చవిచూడటానికి రాత్రింబవళ్ళు అవకాశం ఉండదు.

***

*గోరూపంలో ఉన్న భూదేవి వృషభాకారంలో ఉన్న ధర్మదేవుడుతో:*

సత్యం, శౌచం, దయ, క్షమ, త్యాగం, సంతోషం, ఆర్జవం, శమం, దమం, తపస్సు, సమభావం, తితిక్ష, ఉపరతి, శ్రుతం, జ్ఞానం, వైరాగ్యం, ఐశ్వర్యం, శౌర్యం, తేజస్సు, సామర్థ్యం, స్మృతి, స్వాతంత్ర్యం, కౌశలం, కాంతి, ధైర్యం, మార్దవం, ప్రతిభ, వినయం, శీలం, జ్ఞానేంద్రియ పటుత్వం, కర్మేంద్రియ పటుత్వం, మనోబలం, సౌభాగ్యం, గాంభీర్యం, స్థైర్యం, శ్రద్ధ, కీర్తి, గౌరవం, నిరహంకారం అనే గుణాలే కాకుండా వేదవిజ్ఞానం, శరణాగత రక్షణ మొదలైన అనంత గుణగణాలు శ్రీకృష్ణపరమాత్మ యందు అలరారుతుంటాయి. దేవాదిదేవుడైన వాసుదేవుని పద్మ, వజ్ర, అంకుశ, శంఖ, చక్ర, చాప, మీన, ధ్వజ రేఖలతో అలంకృతాలైన శ్రీచరణాలు నా మీద ఇక సోకవు కదా అని శోకిస్తున్నాను.

శ్రీమన్నారాయణుడు దుష్ట శిక్షణ కోసం, శిష్ట రక్షణ కోసం, సంసార సంతాపాన్ని శాంతింజేయడం కోసం, ధర్మస్వరూపుడైన ధర్మదేవతను నాలుగు పాదాలతో నడిపించటం కోసం, లీలామానుష దేహాన్ని ధరించాడు.

మాధవుని లీలలు మరిచిపోలేము. ఆ తీయతీయని మాటలు, ఆ నయగారాలు, ఆ చిరునవ్వులు, ఆ దయారసం, ఆ ముద్దు మురిపాలు, ఆ ప్రణయకలహాలు, ఆ సుందర మందగమనాలు, ఆ మధుర కటాక్షవీక్షణాలు దూరమైపోతాయే అనే విచారంతో అంగనలే కాదు సర్వసంగపరిత్యాగులైన యోగులు కూడా ఆ దయామయుని వియోగాన్ని సహించ లేరు.

***

*పరీక్షిన్మహారాజు కలి రాకతో విలపిస్తున్న భూదేవితో:*

నిరపరాధులైన సాధుజనులను బాధించి వేధించే దుర్మార్గులను రాజనేవాడు తప్పక శిక్షించాలి. అలా శిక్షించకుండా ఉపేక్షించిన రాజాధముని జీవితము, ఆయుస్సు, ఐశ్వర్యము, సర్వం వ్యర్థం. కనుక రాజైన నాకు ఆర్త రక్షణం అన్నది పరమ ధర్మం.

***

*ధర్మదేవుడు పరీక్షిత్తుతో:*

యోగులు ఆత్మయే సుఖదుఃఖాలు కల్పించే ప్రభువంటారు. దైవజ్ఞులు గ్రహాలకు, దేవతలకు ప్రభుత్వాన్ని ఆపాదిస్తారు. మీమాంసకులు కర్మానికే ప్రాధాన్యం అంగీకరిస్తారు. లోకాయతికులు

ప్రకృతికి ప్రాభవాన్ని కట్టబెడతారు. కాని వాటిలో దేనికీ సుఖదుఃఖాలను ఇచ్చే సామర్థ్యం లేదు. ఎవరి వల్లనో తమకు దుఃఖం ప్రాప్తించిందని, సుఖం ప్రాప్తించిందని అనుకోవడం పొరపాటు. బుద్ధికి మనస్సుకి అతీతుడైన పరమేశ్వరుడి వల్లనే సమస్తమూ జరుగుతుంది.

***

*సూతుడు శౌనకునితో:*

హరిలీలలు అర్థం చేసుకొనేవారూ, హరిచరిత్రలు ఆలకించేవారు, హరి చరణాలను స్మరణం చేసుకొనేవారు మరణ సమయంలో కూడా ఎటువంటి వేదన, ఆవేదన, తొందరపాటు, తొట్రుపాటు పొందరు.

కలియుగంలో ఒక విశేషముంది. చేస్తేనే గాని పాపాలు తమ ఫలితాన్నివ్వవు. కాని చేద్దాము అని అనుకుంటే చాలు పుణ్యాలు ఫలాన్ని ఇస్తాయి.

ఏ దేవుని గుణగణాలను గణించడానికి నాలుకలు చాలక దేవతలు 'అనంతగుణవంతు' డని అన్నారో, ముక్కోటి దేవతలనూ తిరస్కరించి శ్రీదేవి ఎవని పాదాలను స్వీకరించిందో, బ్రహ్మదేవుడు ఏ పాదాలను కడిగి ఆ పవిత్రగంగను అఖిల జగత్తుకు అనుగ్రహించాడో, 'భగవంతుడు' అనే పరమ పవిత్ర శబ్దానికి అర్థంగా ఏ దేవుని స్వరూపం విరాజిల్లుతుందో, ఎవరిని ఆశ్రయించి మునులు పరమహంస పదాన్ని అందుకున్నారో, ఆ వాసుదేవుని దివ్య గాథలు పూర్తిగా తెలుసుకొనడం ఎవరి తరమూ కాదు.

పక్షులు తమ శక్తి కొద్ది రెక్కలాడిస్తూ ఎంత పైకి ఎగిరినా ఆకాశం అంతు కనుక్కోలేవు. అదేవిధంగా వాసుదేవుని మహావైభవాన్ని తనకు తెలిసినమాత్రం తప్ప సమగ్రంగా వివరించి చెప్పగల సమర్థు డెవడున్నాడు?

***

*పరీక్షిత్తు అడవిలో దాహంతో శమీకమహర్షి ఆశ్రమానికి వెళ్తాడు. మహర్షిని ఎంత పిలిచినా పలుకకపోతే కోపంతో చచ్చిన పామును మెడలో వేసి వెళ్ళిపోతాడు. తండ్రి మెడలో చచ్చిన పామును చూసి దివ్యదృష్టితో జరిగింది గ్రహించిన శృంగి పరీక్షిత్తును 'పాము కాటుతో మరణిస్తావు' అని శపిస్తాడు. శమీకమహర్షి తన కుమారుడు శృంగితో:*

వాసుదేవుడు లేకపోవడం మూలాన లోకమంతా చీకాకుపాలైంది. దొంగలు దుండగులూ పెచ్చరిల్లారు. ఇటువంటి క్లిష్ట సమయంలో సమదృష్టితో పరిపాలిస్తున్న మన పరీక్షిన్మహరాజును చిన్న అపరాధానికి నీవు శపించావు. రాజు మరణిస్తే రాజ్యంలో అరాచకం చెలరేగుతుంది. జారచోరులు విజృంభిస్తారు. వైదిక ధర్మాలు నశిస్తాయి. ధర్మం నశించిపోతే లోకులు అర్థకామాల వెంటబడతారు.

***

# ద్వితీయ స్కంధం

*ప్రార్థన:*

భక్తులనే చకోరపక్షులకు చంద్రుడవు, వివేకముతో విలసిల్లువాడవు, దేవతల పొగడ్తగాంచిన సద్గుణ సముదాయము కలవాడవు, రాక్షసస్త్రీల పాపట బొట్టులు తొలగించిన వాడవు అయిన ఓ రఘువంశ లలామా! రామా! అవధరించు.

***

*శుకుడు పరీక్షిత్తుకు ముక్తి మార్గం తెలుపుట:*

సంసారంలో మునిగితేలుతున్న గృహస్థులకు ఆత్మతత్త్వం కొంచెం కూడా తెలియదు వాళ్ళకు స్త్రీ సంగంతోనూ, నిద్రతోనూ, రేయి గడచిపోతుంది. పగలంతా కుటుంబ వ్యవహారాలతో సరిపోతుంది. పశువులు, భార్యాబిడ్డలు, చుట్టాలు, స్నేహితులు, శరీరము ఇత్యాది పరివార మంతటినీ నిజమని నమ్ముకొని కాపురాలు సాగిస్తారు. అంత్యకాల దుర్దశ తెలిసినా తెలియనట్లే ఉండిపోతారు.

అందువలన మోక్షమార్గంలో ప్రయాణించాలని అనుకొనేవాడు సేవించడానికి, వర్ణించడానికి, ఆకర్షించడానికి తగినవాడు విష్ణుమూర్తి ఒక్కడే. మోక్షం కాంచించేవాడికి ముక్తి లభిస్తుంది. జన్మ జరా మరణాది సంసార భయాలన్నీ సమసిపోతాయి. వాసుదేవుని నామ సంకీర్తనలే యోగులకు ఉత్తమ వ్రతాలు.

విష్ణుదేవుని తెలుసుకోకుండా మత్తెక్కి సంసారంలో సంవత్సరాల తరబడి పొరలాడుతూ సతమత మవుతుండే అవివేకి ముక్తినెలా పొందగలడు? వాడు సంసారబంధం నుండి ఎన్నటికీ బయటపడలేడు. ఇది నిజం. ఒక్క క్షణమైనా హరినామం స్మరిస్తే చాలు. అది ముక్తిని ప్రసాదిస్తుంది.

పండితుడైనవాడు గాలిని అరికట్టి, దారాపుత్రాదులతోడి సంసర్గం వదలిపెట్టి, ఇంద్రియాలను జయించి బుద్ధిబలంతో మనస్సును విష్ణుదేవుని విశాలస్వరూపంలోనే స్థిరంగా నిలపాలి. దీనినే ధారణ అని యందురు.

విశ్వమంతా విష్ణుమయం. విష్ణువు విశ్వమయుడు. ఇందులో సందేహం లేదు. విష్ణుమయం కాని పదార్థం ఈ ప్రపంచంలో ఒక్క పరమాణువు కూడా లేదు.

జీవుడు కలలో ఉబలాటంతో పలు శరీరాలు ధరిస్తాడు. పలు పేర్లతో పిలువబడతాడు. ఇంద్రియాలద్వారా విశేషాలన్నీ గమనిస్తాడు. ఇలాగే అంతటికీ అంతరాత్మగా ఉన్న పరమేశ్వరుడు అన్ని ప్రాణుల హృదయాలలో ఉండి ప్రజ్ఞావంతుడై బుద్ధివ్యాపారాలన్నింటినీ పరిశీలిస్తుంటాడు. తానే అన్నింటికి ప్రభువు కాబట్టి దేనికీ బద్ధుడు కాదు. తాను సత్య స్వరూపుడు. ఆనందంతో నిండిన విజ్ఞానమూర్తి. ఆయనను సేవించడంవలననే మోక్షం సిద్ధిస్తుంది. ఇతరులను కొలిస్తే మోక్షం లభించదు. ఈ సంసార బంధం వదలదు.

పూర్వం బ్రహ్మ జగత్తును సృష్టించాలనుకొన్నాడు. పెక్కేండ్లు ప్రయత్నించాడు. కాని నేర్పరి కాలేక పోయాడు. అపుడు ఏకాగ్రచిత్తంతో శ్రీహరిని ప్రార్థించాడు. మహోన్నత బుద్ధి వికాసం పొందాడు. పిమ్మట ప్రాణికోట్ల పుట్టుకను నిర్ణయించి జగన్నిర్మాణదక్షుడై విహరించాడు.

*బుద్ధిమంతుడు ఈ విధంగా భావన చేస్తాడు:* పడుకోవటానికి చాలినంత చదునైన చక్కని నేల ఉండగా దూది పరుపులెందుకు? పుట్టుకతో వచ్చిన దోసిళ్ళు ఉండగా భుజించడానికి కంచాలు, గరిటలు ఎందుకు? కట్టుకోవడానికి నార చీరలు, జింక చర్మాలు, దర్భ చాపలు లేవా! పట్టుబట్టలెందుకు? నివసించడానికి గుహలున్నాయికదా, ఇక మిద్దెలు, మేడలు ఎందుకు? చెట్లు మనకి కావలిసిన పండ్లు ఇస్తున్నాయి కదా! నదులలో తియ్యటి నీటికి కొదవలేదు కదా! పుణ్యస్త్రీలు పుష్కలంగా భిక్షం పెడుతున్నారు కదా! ఇక తపోధనులైన వాళ్ళు, ధనమదంతో కన్నూ మిన్నూ కానని వాళ్ళని ఎందుకు సేవించాలి?

దిక్కులేని వారికి దిక్కై రక్షిస్తానంటూ చక్రధారియైన ఆ శ్రీహరి ఉండగా, ఆత్మజ్ఞులైనవారు అసమర్థుడైన ఒక మానవుణ్ణి రక్షింపమని ఎందుకు ప్రాధేయపడాలి?

భగవంతుని భజింపని మూర్ఖులను యమకింకరులు గదలతో మోదుతారు. వాళ్ళ శరీరాలను మంటలలో వేస్తారు. వాళ్ళ అవయవాలను పదునైన కత్తులతో ముక్కలు ముక్కలు చేస్తారు.

*శుకుడు పరీక్షిత్తునకు భక్తిమార్గమే ముఖ్యమని తెలుపుట:*

విష్ణుదేవుని నామ సంకీర్తనలు వినని చెవులు పర్వతగుహలు. చక్రధరుని మీద పద్యాలు చదువని నాలుకలు కప్పల నాలుకలు. శ్రీకాంతుని కనలేని కన్నులు నెమలి పింఛపు కన్నులే. రాజీవాక్షుని పూజకు ఉపకరించని చేతులు శవము చేతులు. శ్రీహరి చరణాల మీది తులసీదళ పరిమళం ఆఘ్రాణించని ముక్కు పందిముక్కు. గరుడధ్వజుని భజించడానికి కదలని కాళ్ళు చెట్ల వేళ్ళు.

శ్రీమన్నారాయణుని పవిత్ర నామ స్మరణంతో ద్రవించనివి మనస్సులు కావు, అవి కరకు బండలు; విష్ణుమూర్తి కథలకు ఆనందబాష్పాలు రాలగా పొంగి పులకించనిది శరీరం కాదు, అది వట్టి మొద్దు; పరమాత్మునకు ప్రణమిల్లని మూఢుని తలమీదది బంగారు కిరీటం కాదు, అది కట్టెల మోపు; భగవంతుడికి అర్పణంగాని మానవుని ఐశ్వర్యం, ఐశ్వర్యం కాదు అడవిగాసిన వెన్నెల; వాసుదేవుని సేవింపనివాడు ప్రాణవాయువు లోపల ఉండి కదిలే శవం; పద్మనాభుని పాదములు ఆశ్రయింపనివాని జీవితం నూలికాయలోని పురుగు జీవితం.

ప్రకృతికంటే జీవునికంటే వేరైనవాడు, ఈశ్వరుడు, గొప్పమహిమ కలవాడు, సృష్టిస్థితిలయాలను ఆటగా సాగించేవాడు, బ్రహ్మ విష్ణు మహేశ్వరులనే త్రిమూర్తుల శక్తి కలవాడు, అందరికీ అంతరాత్మగా వెలుగొందేవాడు, బ్రహ్మాదిదేవతలు అందుకోవడానికి వీలుకాని

దుస్తరమైన త్రోవలో ప్రకాశించేవాడు అయిన శ్రీహరికి తత్వాభిలాషతో నమస్కరిస్తున్నాను.

***

*శ్రీహరి ఈ జగత్తును ఎలా పుట్టించి, పోషించి సంహరిస్తున్నాడు?*

ఆ పరమాత్ముడు అణుస్వరూపుడా? లేక విశ్వమంతా వ్యాప్తించిన మహాస్వరూపుడా? దేశకాలాదులచేత అపరిచ్ఛిన్నుడా? లేక పరిచ్ఛిన్నుడా? ఆయన సగుణుడా? నిర్గుణుడా?- అని పండితులు తత్త్వాన్వేషణ చేసి చేసి చివరకు ఏ భగవంతుని పాదపద్మాలను అతిశయంగా భజించడం ద్వారా తత్త్వస్వరూపాన్ని గుర్తిస్తారో అట్టి సర్వవ్యాపకుడు, సర్వోత్కృష్టుడు, సర్వాత్మకుడు అయిన పరాత్పరుణ్ణి భజిస్తాను.

తాను పరిపూర్ణుడై ఉండికూడా భూమి మొదలైన పంచభూతాలనూ కలిపి శరీరాలను, పురాలను సృష్టించి వాటిలో పురుషుడనే పేరుతో ఎవడు సదా ప్రకాశిస్తూ ఉంటాడో; పంతభూతాలను, పదకొండు ఇంద్రియాలను కలిపి షోడశ కళాత్మకుడై ప్రాణం అనే విలాసం ప్రదర్శిస్తుంటాడో; అవ్యయుడు, అచ్యుతుడు అయిన వాడే ఆ పరమాత్మ.

విశ్వానికి ఆత్మ అయినవాడు, విశ్వానికి ప్రభువు, విశ్వరూపుడు, సమస్తానికీ నాయకుడు, పుట్టుక లేనివాడు అయిన విష్ణువు ఈ విశ్వంలో వుంటాడు. ఈ విశ్వం ఆయనలో ప్రకాశిస్తూ వుంటుంది.

*బ్రహ్మ దేవుడు నారదునకు సృష్టి విధానము తెలుపుట:*

పరమేశ్వరుడు నిర్గుణుడు ఐనా జగత్తులను సృష్టించడానికై నేర్పుతో ఆయన తన మాయా ప్రభావం వల్ల గుణసహితు డవుతున్నాడు. అందువల్లనే ఆయన "భగవంతుడు" అని చెప్పబడుతున్నాడు. పద్మనాభుడు, దేవదేవుడు, అచ్యుతుడు అయిన శ్రీహరి సృష్టిస్థితిలయాల కన్నిటికీ మూల కారణమై ఆ మూడు రకాల శక్తులలోనూ కూడి ఉంటాడు.

పుట్టుకలేని ఆ పరమాత్ముడు ప్రతి కల్పంలోనూ ఈ విశ్వాన్ని పుట్టిస్తాడు, పోషిస్తాడు, సంహరిస్తాడు. పాపరహితుడు, శాశ్వతుడు, జగమంతా నిండినవాడు, కేవలుడు, సాటిలేనివాడు, నిర్మలమైన జ్ఞానం కలవాడు, సర్వాంతర్యామి, తుదిమొదళ్ళు లేనివాడు, గుణరహితుడు, నిత్యుడు అయిన ఆ పరమేశ్వరుణ్ణి ప్రార్థించవలెను.

వేయి తలలు, వేయి నేత్రాలు, వేయి పాదాలు కలిగి ప్రకృతిని ప్రవర్తింపజేసే ఆదిపురుషుని రూపమే ఆ దేవదేవుని మొదటి అవతారం. ఆ అవతార స్వరూపం నుండి *కాలము, స్వభావము అనే రెండు శక్తులు* పుట్టాయి. అందులో నుండి కార్యకారణ రూపమైన *ప్రకృతి* పుట్టింది. దాని నుండి *అహంకార త్రయం (*సాత్త్విక, రాజస, తామస), *జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, తన్మాత్రలు* (శబ్ద, స్పర్శ, రస, రూప, గంధాలు), *పంచభూతాలు* (ఆకాశం, వాయువు, అగ్ని, జలం, భూమి)

ప్రభవించాయి. వీటన్నిటి చేరికవల్ల విశ్వస్వరూపుడైన విరాట్పురుషుడు ఉద్భవించాడు.

మేలిమి బంగారు కాంతి కలవాడు, వేదస్వరూపుడు, సర్వాంతర్యామి, సాటిలేని యజ్ఞపురుషుడు అయిన దేవదేవుడు *“హయగ్రీవుడు”* అన్న పేరుతో బ్రహ్మదేవుడు చేసిన యజ్ఞంలోనుండి జన్మించాడు. సర్వాన్ని పవిత్రంచేసే ఆ హయగ్రీవుని ముక్కుపుటాలలోని శ్వాసవాయువులనుండి వేదాలు ప్రాదుర్భవించాయి.

ప్రతి యుగంలో అల్పబుద్ధులు, అల్పాయుష్కులు, దుర్గతి పాలయ్యేవారు అయిన మానవులుంటారు. వాళ్ళకు భగవంతుడు నిర్మించినవి, శాశ్వతములు అయిన వేదాలు బోధపడవు. అలాంటి వాళ్ళను అనుగ్రహించాలనే బుద్ధితో శ్రీహరి సజ్జనస్తుతి పాత్రుడై పరాశర మహర్షి ప్రియపుత్రుడైన వ్యాసుడుగా ప్రభవించి ఆ వేదవృక్షాన్ని శాఖలు శాఖలుగా విభజించాడు.

అనేక శక్తులతో కూడిన ఆ భగవంతుడు సృష్ట్యాదిలో తపస్సుగా, బ్రహ్మగా, ఋషులుగా, ప్రజాపతులుగా అవతరించి లోకాన్ని సృష్టిస్తూ ఉంటాడు. *ధర్మము, విష్ణువు, యజ్ఞాలు, మనువులు, ఇంద్రుడు అనే రూపాలలో* అవతరించి లోకాలను రక్షిస్తూ ఉంటారు. అధర్మము, రుద్రుడు, భీకరసర్పాలు, రాకాసి మూకలుగా అవతరించి విశ్వాన్ని సంహరిస్తూ వుంటాడు. పరమేశ్వరుడు, సర్వస్వరూపుడు అయిన శ్రీహరి ఈ విశాల విశ్వం సృష్టికి స్థితికి లయానికి హేతువై ప్రకాశిస్తాడు.

ఎవరు ఇతర చింతలు మాని సదా శ్రీమన్నారాయణుణ్ణే దృఢంగా నమ్మి సేవిస్తారో వారిని పద్మనాభుడు మిక్కిలి దయగలిగి కల్లాకపటం లేని మనస్సుతో అనుగ్రహిస్తాడు. అలా భగవంతుని సేవించి ఆయన కృపకు పాత్రులైనవాళ్ళు మాత్రమే సాటిలేనిదీ, దాటరానిదీ, అయిన ఆ భగవంతుని మాయను నిరంతరం తరింప గలుగుతారు.

పరమాత్ముడు, మొదలు లేనివాడు, అంతం లేనివాడు అయిన శ్రీహరిని మనస్సులో స్థిరంగా భావించిన వాళ్ళు శోకం లేని  సుకస్థితి పొందుతారు. అలాంటి బుద్ధిమంతులు భగవంతుని స్మరణ తప్ప ఇతర కార్యాలు ఏమరుపాటున కూడా చేయరు. ఆలోచిస్తే అది అంతే! వర్షం కురిపించే దేవేంద్రుడు దప్పిగొని నీళ్ళకొరకై బావి త్రవ్వుతాడా?

ఆ భగవంతుడు అందరికీ అన్ని ఫలాలు ఇచ్చేవాడు. అందరికీ శరణు పొందదగినవాడు. అన్ని శక్తులూ గలవాడు. అన్ని లోకాలలోనూ ప్రసిద్ధి చెందినవాడు. అంతటా వ్యాపించినవాడు. సుదర్శనమనే చక్రం ధరించిన బ్రహ్మస్వరూపుడైన ఆ దేవుడు, తక్కిన ఈ సమస్త ప్రాణులూ చిక్కి స్రుక్కి శిథిలమై  అంతరించిపోయిన కల్పాంత కాలంలో గూడా ఆకాశంలాగా తానొక్కడూ చెక్కుచెదరకుండా నిర్వికారుడై నిలిచి వుంటాడు.

పద్మనేత్రుడు, లక్ష్మీకాంతుడు, పాపనాశకుడు, పరమేశ్వరుడు, చ్యుతిరహితుడు అయిన శ్రీహరిని నిర్మలభక్తి గలిగి ఆసక్తితో భజించాలి. అలాచేయకుండా *వ్రతాలు, శౌచాలు, యాగాలు, సంధ్యోపాసనలు,*

*అగ్నికార్యాలు, జపాలు, దానాలు, వేదాధ్యయనాలు* మొదలైన పనులెన్ని చేసినా మోక్షం లభింపదు.

పద్మనేత్రుని మహిమను ఎల్లవేళలా స్తుతించాలి. ఇతరులు స్తుతిస్తూ ఉంటే వినాలి. మనస్సులో ఆ మహిమను మననంచేస్తూ ఉండాలి. అలా చేసేవాళ్ళు మాయకు లోనుగారు.

వేసవి మండుటెండల తాపానికి పరితాపం చెందిన బాటసారి అలసి చివరకు ఇంటికి చేరుకుంటాడు. అక్కడ హాయిగా అలసట తీర్చుకుంటాడు. అక్కడ నుండి మళ్ళీ ఎక్కడకూ కదలడు. అలాగే రమాకాంతుని పాదపూజలో ఆనందం చవిచూచినవాడు మళ్ళీ దానిని వదలడు.

***

*శుకమహర్షి పరీక్షిత్తుకు భాగవత పురాణ కథ చెప్పుట:*

“భాగవత పురాణాన్ని పూర్వం సర్వేశ్వరుడు బ్రహ్మ కల్పంలో బ్రహ్మదేవునికి ఉపదేశించాడు. బ్రహ్మదేవుడు నారదుడికి ఉపదేశించాడు. నారదుడు ఆ భాగవత స్వరూపాన్నిమహాతేజస్వి అయిన వ్యాసమహర్షికి బోధించాడు. వ్యాసమహర్షి ప్రీతితో తన కుమారుడినైన నాకు బోధించాడు. నేను నీకు బోధిస్తున్నాను” అని శుకమహర్షి పరీక్షిత్తుకు చెప్పాడు.

సర్వానికి ప్రభువు అయిన గోవిందుడు తన శక్తులతో కూడినవాడై వైకుంఠంలో మెత్తని శేషశయ్యపై సుఖంగా యోగనిద్రలో ఉంటాడు. అప్పుడు సమస్త జీవులూ తమ శక్తిని కోల్పోతాయి. అదే ప్రళయం.

నారాయణుడి యోగమాయా ప్రభావం వల్ల జీవుడు పంచభూతాలతో కూడిన దేహంతో సంబంధం కలవాడవుతాడు. ఆ మాయాగుణం వల్లనే క్రమంగా *బాల్యం, కౌమారం, యౌవనం, వార్ధక్యం అనే దశలు* పొందుతాడు. *'నేను' అనే అహంకారాన్నీ, 'నాది' అనే మమకారాన్నీ* పెంచుకుంటాడు. *మాయకు* బద్ధుడవుతాడు. ప్రకృతికీ, పురుషుడికీ అతీతమైన బ్రహ్మస్వరూపాన్ని ఎప్పుడు ధ్యానిస్తాడో, అప్పుడు ఆ మోహం నుండి విడివడి సంసారం నుండి విముక్తుడై 'ముక్తి' ని పొందుతాడు.

జీవుడు భగవంతుని దయవల్ల శరీరధర్మాలై అనేక జన్మలనుండి పరంపరగా ప్రాప్తించిన జరామరణాలను తప్పించుకుంటాడు. అలాగే ఆత్మధర్మాలైన పుణ్యపాపాలనుండి కూడ విడివడుతాడు. భగవత్పరతంత్రమైన బుద్ధి గలిగి ప్రకాశిస్తాడు. దివ్యమాల్యాలతో, దివ్యానులేపాలతో, దివ్యగంధాలతో ఒప్పే దివ్యశరీరం కలవాడవుతాడు. ఈ విధంగా జీవుడు హరి స్వరూపం పొందడమే "ముక్తి" అంటారు.

వినోదం కొరకు జగత్తును సృష్టించాలని ఆ మహాత్ముడికి తలంపు కలిగింది. ఆ సంకల్పంతో ఆయన బ్రహ్మాండాన్ని సృష్టించాడు. తనకు సుఖస్థానం కోరి మొదట పవిత్రమైన నీళ్ళను సృష్టించాడు. తాను సృష్టించిన అపారమైన జలరాశిలో శయనించాడు. ***'నారము'*** అనగా నీళ్ళు. అందులో ఉండటం వలన ఆయనకు ***'నారాయణుడు'*** అని పేరు వచ్చింది. తాను ఒక్కడే అయిన ఆ పరమాత్ముడు యోగశయనంలో మేల్కొని ఉండి హిరణ్మయమైన తన శరీరాన్నే *అధిదైవం, ఆధ్యాత్మికం, అధిభూతం* అనే పేర్లతో మూడు విధాలుగా సృష్టించాడు.

ఆ పైన జగత్తును సృష్టించే విరాట్పురుషుని శరీరంలో త్వక్కు, చర్మం, మాంసం, రక్తం, మేదస్సు, మజ్జ, ఎముకలు అనే *ఏడు ధాతువులు;* పృథివీ జల తేజో రూపాలైన *ఏడు ప్రాణాలు;* ఆకాశ జల వాయువుల నుండి జనించిన గుణ స్వరూపాలపైన *ఇంద్రియాలు;* అహంకారాన్ని కలిగించే గుణాలు, అన్ని వికారాలూ స్వరూపంగా గల *మనస్సు;* విజ్ఞానరూపమైన *బుద్ధి* జనించాయి. ఇదంతా ఆ ఈశ్వరుని స్థూల స్వరూపమే. ఆ స్థూల విగ్రహం క్రమంగా *పృథివి, జలం, తేజం, వాయువు, గగనం, అహంకారం, మహత్తత్వం, అవ్యక్త్వం అనే ఎనిమిది ఆవరణాలతో* వ్యాప్తమై ఉంటుంది. సంపూర్ణ వైభవంతో ప్రకాశిస్తున్నది.

లక్ష్మీనాథుడు చతుర్ముఖుడై జగత్తును సృష్టిస్తాడు. విష్ణు స్వరూపుడై దానిని రక్షిస్తాడు. సంహార సమయంలో హరునికి అంతర్యామిగా ఉంటూ గాలి మబ్బులను హరించినట్లే సమస్త విశ్వాన్ని

సంహరిస్తాడు. శ్రీహరినుండి ఆకాశం పుట్టింది. ఆకాశం నుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి నీరు, నీటి నుండి భూమి, భూమి నుండి నానావిధ జీవ సంతతి పుట్టింది. ఇంతటికీ మూలమై ప్రకాశించేవాడు ఆ నారాయణుడే. ఆయన జ్ఞానానంద స్వరూపుడు, అవ్యయుడు, పుట్టుక లేనివాడు, ప్రభువు, ఆదిమధ్యాంత రహితుడు, జనన మరణాలు లేనివాడు.

*ఆయన నుండి జనించిన ఈసృష్టికి హేతువేమిటో, దాని స్వరూప మెలాంటిదో ఎంత పరిశీలించినా ఎంతటి మునీశ్వరులైనా తెలుసుకో లేకున్నా రు.*

***

# తృతీయ స్కంధము

*విదురుడు ధృతరాష్ట్రునితో:*

అన్ని లోకాలనూ తనలో అట్టిపెట్టినవాడు, మురుడు అనే రాక్షసుణ్ణి మట్టుపెట్టినవాడు, అందరి కంటే గొప్పవాడు అయిన శ్రీకృష్ణుడు చెలికాడై, వియ్యంకుడై, మిత్రుడై, ప్రభోధకుడై, ప్రభువై అత్యంత ప్రేమతో పాండవులను తోడ్పడుతూ ఉంటాడు. అటువంటివారిని ఎదిరించడం ఎవరికైనా సాధ్యమవుతుందా?

***

*విదురుడు తీర్థయాత్రల నుండి తిరిగివచ్చి, శ్రీకృష్ణుని ప్రియ భక్తుడైన ఉద్ధవుని కలిసి, అందరి క్షేమసమాచారాలు విచారిస్తాడు. శ్రీకృష్ణుని నిర్యాణం వల్ల దుఃఖిస్తున్న ఉద్ధవుడు విదురునితో యాదవ వంశం అంతరించి పోయిందనీ, తనకూ మైత్రేయమహర్షికీ తత్త్వబోధ చేసి శ్రీకృష్ణుడు అవతారం చాలించాడనీ చెప్పాడు.*

అఖిల ప్రాణులకూ అంతఃకరణాలైన *చిత్తం - అహంకారం- బుద్ధి-* మనస్సు అను నాలుగింటికి వరుసగా *వాసుదేవుడు - సంకర్షనుడు - ప్రద్యుమ్నుడు - అనిరుద్ధుడు* అధిష్టాన దైవాలు.

పుట్టుకలేని భగవంతుడు పుడుతున్నాడంటే, కేవలం శత్రువులను అంతం చేయడానికి మాత్రమే! కర్మలు లేని దేవుడు కర్మలు చేస్తున్నాడంటే చరాచర జీవకోటిని కర్మబద్ధుల్ని చేయడానికే! అంతేగాని రాక్షకాంతకుడైన కమలాక్షునకు కర్మలంటూ ఉన్నాయా!

యమధర్మరాజు అనే నల్లని నాగరాజు యదువంశాన్ని ఒడిసిపట్టి కాటువేశాడు. గోవిందుని చరణ స్పర్శతో సలక్షణంగా ప్రకాశించే భూదేవి ఇప్పుడు దౌర్భాగ్యలక్షణాలు కలది అయ్యింది. శ్రీకృష్ణుడు కనుమరుగు కావడంతో యాదవుల రాజవైభవం మాయమయింది. ధర్మమార్గం నశించింది. అధర్మం పెరిగిపోయింది.

గరుడ వాహనారూఢుఢు, సుదర్శన చక్రధారుడు అయిన శ్రీమన్నారాయణుని ఎందరో రాక్షసులు ఎన్నో పర్యాయాలు పరాక్రమంతో ఎదుర్కొని ఆయన నామాన్ని పలుకుతూ, ఆయన ముఖాన్ని చూస్తూ రణరంగంలో నేలకూలారు. ఆ రాక్షసు లందరూ మోక్షాన్ని సంపాదించి ఉన్నత స్థానాన్ని పొందారు.

శ్రీకృష్ణుడు సమస్త జగత్తుకు గురువు. అయినా శ్రద్ధగలవాడై షడంగాలతో కూడిన వేదాల్నీ, అరవై నాలుగు కళల్నీ "సాందీపని" అనే గురువుగారి సన్నిధిలో అభ్యసించాడు. నిజానికి జగద్గురువులకు ఇతరులు గురువులు అవుతారా? ఇవన్నీ ఆ పరాత్పరుడు లోకాచారం కోసం చేసే లీలలు కాక మరేమిటి?

***

*పరీక్షిత్తుతో శుకమహర్షి ఇలా అన్నాడు.*

పూర్వం బ్రహ్మ ప్రార్థింపగా విష్ణువు భూలోకంలో యదువంశంలో జన్మించాడు. దేవతలందరూ యాదవకులంలో జన్మించారు. అవతార సమాప్తి ముందు తన మనస్సులో ఆలోచించి ఒక నిశ్చయానికి వచ్చి

తన కులాన్నంతా అంతం చేసేశాడు. తన తర్వాత విజ్ఞానతత్త్వాన్ని అందుకొని లోకంలో ప్రజలకు తెలియజేయగల ప్రజ్ఞాశాలి, జితేంద్రుడు అయిన ఉద్ధవునికి తెలిపి అతనిని భూమిపై నిలిపాడు.

***

*శ్రీకృష్ణుడు తన అవసాన సమయంలో సమీపానికి వెళ్ళిన మైత్రేయమహర్షిని దగ్గరకు పిలిచి విజ్ఞానాన్నంతా బోధించాడు. దానిని విదురునికి చెప్పవలసిందిగా ఆదేశించాడు:*

ఈ విశ్వంలోగల సమస్త జీవుల దేహాలూ భగవంతుని స్వరూపాలు. సమస్తమైన ఆత్మలూ ఆయనే. అటువంటి భగవంతుడు తన మాయవల్ల తనలోనే లీనమైన ప్రపంచాన్ని, తన గర్భంలో ధరించి ఒక్కడుగా వెలుగుతూ ఉంటాడు. ఆ పరమాత్మ పుట్టుక లేనివాడు. వేరే మరేవస్తువూ లేకుండా తానే సర్వమూ అయినప్పుడు ద్రష్ట కాడు. కానీ మాయా ప్రధాన శక్తి కలవాడై తనకు తాను లేనివాడిగా మనస్సులో భావించుకొని, సృష్టికి ఉపక్రమించిన తర్వాత ద్రష్ట అవుతాడు.

*కాల చోదితము – అవ్యక్తము - ప్రకృతి* అనే పేర్లతో పిలువబడే తన మాయవల్ల మహత్తత్త్వాన్ని పుట్టించాడు. మహత్తత్త్వానికి కాలము మొదలైన గుణాలు ఉంటాయి. భగవంతునికి ప్రపంచాన్ని నిర్మించాలనే కోరిక కల్గడంతో అటువంటి మహత్తత్వంలో నుంచి క్రమంగా కారణం, కార్యం, కర్త అనే భేదాలు ఏర్పడ్డాయి. అవి వరుసగా పంచభూతాలు -

ఇంద్రియాలు - మనస్సు అను రూపములుగా గోచరించాయి. వీటితో సత్త్వరజస్తమో గుణాలతో కూడిన అహంకారం ఏర్పడింది.

ఆధ్యాత్మికం, ఆదిభూతం, ఆది దైవం అనబడే మూడు భేదాలు కలిగిన ఈ విరాట్ స్వరూపం జీవులకు తాను ఆత్మగా మెలగుతుంది. సమస్తానికి జీవమై పరమాత్మకు స్థానమై తొలి అవతారమైన ఆ విరాట్ పురుషుని గర్భం నుండి భూతమయమైన ఈ సమస్త విశ్వం పుట్టింది.

ఆ శ్రీహరి, పరమాత్ముడు, ఈశ్వరుడు, అజుడు, ఆధ్యుడు, అనంతుడు, అనంతమూర్తి, లక్ష్మీరమణుడు, నిర్వికారుడు, నిత్యమంగళ స్వరూపుడు, కరుణా సముద్రుడు, నిర్మల హృదయుడు, సమస్త శక్తిమంతుడు, కమలదళ నేత్రుడు, సకలబుధ సంస్తవనీయ చరిత్రుడు, పరమ పవిత్రుడు.

హరి నామస్మరణ పరాయణమైన సరసకథా సుధారసాన్ని ఆసక్తితో ఆస్వాదించి ఆనందించే సత్పురుషుడు రసహీనమైన అసత్కథలచే ఉప్పునీటిని త్రాగాలని కోరుకుంటాడా? మధురమైన మందార మకరందాన్ని త్రాగి మైమరచే తుమ్మెద చేదువాసనలు వెదజల్లే వేపచెట్లు వైపు వెళ్ళాలని వేగిరపెడుతుందా?

మనిషికి నిద్రపోయే సమయంలో ఏవేవో కలలు వస్తాయి. ఎన్నో సుఖాలు పొందుతున్నట్లూ, దుఃఖాలు కలిగినట్లు, తనను ఎవరో చంపినట్లూ రకరకాల కలలు కంటాడు. మెలకువ వచ్చిన తరువాత

అదంతా నిజంకాదని తెలుసుకుంటాడు. ఆ విధంగానే స్వప్నంలో ఉన్నంత కాలం జీవుడు పడే చిక్కులూ బాధలూ, జీవుడుగా నటించే దేవుడు కూడా అనుభవిస్తాడు. కాని ఈ కష్టసుఖాలేవీ ఆయనకు అంటవు.

జీవునకు మాత్రమే అజ్ఞాన ప్రభావం వల్ల కర్మబంధాలు కలుగుతున్నాయి. కాని సర్వభూతాలలోనూ అంతర్యామిగా ఉండే పరమాత్మకు ఈ బంధనాలు ప్రాప్తించవు.

మానవునకు తన శరీరం నుండి పుట్టిన గుణాలను పోగొట్టడానికి నారాయణుని పాదసరోజాలమీద విశేషించి విస్పష్టమైన భక్తి ఒకటే చాలు. అట్లే ఆపదలను బాపుకొనడానికి పంచేద్రియాలను భగవంతుని అధీనంచేసి మనస్సును చలించని ఉన్నతమైన ఏకాగ్రభావంతో నింపి ఆ సరోజాక్షుని సంకీర్తనం సలిపితే చాలు.

ఓ మాధవా! ఉత్తములైన యోగీంద్రులు తమతమ యోగ సాంప్రదాయాలతో తమతమ భావాలలో ఏ నీ మనోహరరూపాన్ని భావిస్తారో; ఏ నీ గుణగణాల్ని సంభావిస్తారో; వారిని అనుగ్రహించే నిమిత్తం ఆ రూపం ధరించి అటువంటి గుణగణాలతో వారికి సాక్షాత్కరిస్తావు. ఎంతో సంతోషంగా వారిని ఆదుకొంటావు.

సనకసనందాదుల ప్రార్థనలకు ప్రసన్నుడైన భగవంతుడు సమస్తవేద సారమైన ఈ భాగవతాన్ని బ్రహ్మదేవుడి కుమారుడైన

సనత్కుమారునికి ఉపదేశించాడు. ఆయన సాంఖ్యాయనునకు వెల్లడించాడు. ఆ సాంఖ్యాయనుడు మంచి మనస్సుతో పరాశరునికి ఉపదేశించాడు. పరాశరుడు దేవతలకు గురువైన బృహస్పతికి చెప్పాడు. బృహస్పతి మైత్రేయుడినైన నాకు చెప్పాడు. విదురా! ఇప్పుడు నేను నీకు వివరిస్తాను. సావధానంగా విను.

ఇట్లు భగవంతునిచే చెప్పబడినది, ఋషుల సాంప్రదాయాల ప్రకారం సమాగతనైనది, పుండరీకాక్షుని పొగడ్త కలది, పరమపావనమైనది, భవబంధాలు పోగొట్టేది అయిన భాగవతాన్ని నీకు విశదీకరిస్తాను అని మైత్రేయుడు విదురునకు చెప్పినట్లు శుకుడు పరీక్షిత్తుకు చెప్పాడు..

***

*యోగమహాత్యం వల్ల బ్రహ్మదేవుడు నారాయణుని దర్శించి ప్రార్థించుట:*

ఓ స్వామీ! నీవు సకల జీవుల హృదయాలలో అంతర్యామివై ఉంటావు. అందరిలో ఒకే ఒక రూపంతో వెలుగొందుతావు. ఆప్యాయతకు అనుగుణంగా ప్రకాశించే ధర్మస్వరూపుడవు. అచ్యుతా! ఇహపరాలకు నీవే అధీశ్వరుడవు. సజ్జనులకు సులభమూ, దుర్జనులకు దుర్లభమూ అయిన సర్వజీవకారుణ్యం వల్ల మాత్రమే జనులు నిన్ను దర్శింప గలుగుతారు.

ఓలక్ష్మీవల్లభా! నీ స్వరూపం శాశ్వతమైనది. అందలి చైతన్య మహాప్రభావంవల్ల సమస్తమైన భేదభావాలను, వ్యామోహాలను

రూపుమాపుతావు. అఖండ విజ్ఞానానికి ఆశ్రయమైన నీకు నమస్కరిస్తున్నాను.

పుట్టుట, వృద్ధిపొందుట, చనిపోవుట- అనే మూడింటికీ కారణమైనది నీ మాయ. అటువంటి మాయా నటనలతో, లీలా విలాసాలతో నిరంతరము క్రీడించే ఓ పవిత్ర స్వరూపా! నీ కివే నా కైమోడ్పులు.

పురుషోత్తమా! నీ పాదపద్మాలను పూజించడం అనే మంచి పనిలో మునిగి తన్మయత్వం చెందనివాడు పరమమూడుడు, పశువులాంటి వాడు, అధముడు. అటువంటి మానవునకు సర్వసమర్థమైన కాలం త్వరగా ముసలి తనాన్ని కల్గించి, వాని వినాశనానికి దారి తీస్తుంది. అటువంటి అనంతకాలానికి ఆత్మస్వరూపుడవయిన నీకు ఆనందంగా నమస్కరిస్తాను.

వేదాలచే వినుతింపబడే లక్ష్మీవల్లభా! స్వామీ! నీవు జగములలో అంతర్యామివై ఉంటూ ఈ విశ్వాని కంతటికీ నీ దివ్య విభూతిచే ఆనందానుభూతులను అందిస్తావు! రాక్షసులకు శత్రువైనవాడివి, లక్ష్మీదేవి హృదయాన్ని అపహరించినవాడివి, సంసారదుఃఖాలను దూరంచేసేవాడివి, భవభందాలనూ త్రెంచివేసేవాడివి, పాపాలను పటాపంచలు గావించేవాడివి అయిన నిన్ను మనస్సులో ధ్యానిస్తున్నాను.

పండితులకు వందనీయుడైన పద్మసంభవుడు, తన హృదయంలో రాక్షసులకు శత్రువైనవాడు, జలాల్లో విహరించేవాడు, అందమైన హారాలు ధరించేవాడు, సమస్త దేవతల చేత నమస్కరింప బడేవాడు, లక్ష్మీదేవి హృదయాన్ని అపహరించినవాడు, సంసార దుఃఖాలను దూరంచేసేవాడు, భవబందాలు త్రెంచేసేవాడు, విద్వాంసులు కీర్తించేవాడు, పాపాలను పటాపంచలు గావించేవాడు అయిన భగవంతుణ్ణి తన మనస్సులో ధ్యానించాడు.

***

*బ్రహ్మదేవుడు తన మానసపుత్రులైన రుద్రులతో:*

భగవంతుడు, పురుషోత్తముడు, కరుణాసముద్రుడు, లక్ష్మీవల్లభుడు, సద్గుణసంపన్నుడు, అచ్యుతుడు, పరమాత్ముడు, పరంజ్యోతి, సర్వేశ్వరుడు, సర్వాంతర్యామి, జగన్నాథుడు, ఆర్తజనరక్షా పరాయణుడు అయిన శ్రీమన్నారాయణుని సజ్జనులైనవారు తమ తపశ్శక్తి వల్ల దర్శింప గలుగుతారు.

***

*బ్రహ్మదేవుడు స్వాయంభువ మనువుతో:*

కన్నతండ్రి ఆజ్ఞను శిరసావహించి, తనకు తగినపని యని ఏపని చెపితే దానిని దక్షతతో తక్షణం చేయడం శ్రీహరి పాదసేవ చేయడమే అవుతుంది. తండ్రి ఆజ్ఞానుసారం ప్రజలను పాలించడం కూడా తనయుడు తన తండ్రికి సేవ చేయటం క్రిందకే వస్తుంది.

***

*యజ్ఞవరాహావతారం ధరించిన విష్ణుమూర్తి రసాతలంలో తనను ఎదిరించిన హిరణ్యాక్షుణ్ణి సంహరించి కోరల చివర భూదేవిని ధరించి సముద్రం నుండి బయటకు వచ్చాడు. అప్పుడు వరాహస్వామిని బ్రహ్మాది దేవతలు, మునులు ఇలా స్తుతించారు.*

దేవదేవా! జయం! జయం! పరమేశ్వరా! నీవు యజ్ఞాధిపతివి! వేదమూర్తివి! దుష్ట శిక్షణ శిష్ట రక్షణార్థం వరహావతారం ధరించిన నీకు పరమభక్తితో ప్రణమిల్లుతున్నాము. నీ యజ్ఞవరాహ స్వరూపాన్ని అజ్ఞులు దర్శించలేరు. పరమ కరుణామూర్తివి, పరమ పవిత్ర చరిత్రుడవు, పద్మదళాయత నేత్రుడవు, చిర మంగళాకారుడవు శ్రీరమా చిత్తచోరుడవూ అయిన నీకివే మా కైమోడ్పులు.

చతుర్వేద స్వరూపమైన శరీరాన్ని ధరించి ఉన్న ఓ యజ్ఞవరాహమూర్తీ! నీవు జ్ఞానవంతుల అంతరంగాలనే నీటిమడుగులలో క్రీడిస్తుంటావు. భూదేవికి శ్రీదేవికి మనోహరుడవు. దేవతలందరికీ అగ్రేసరుడవు. స్వామీ! నీ తెల్లని దంష్ట్రాచలాన తగులుకొన్న భూమి కొండల చక్రవర్తి వెండి శిఖరాగ్రాన విరాజిల్లుతుండే నీలమేఘంలా అందాలు చిందుతూ ఉంది.

ఓ లక్ష్మీవల్లభా! ఈ ప్రపంచం సృష్టించేదీ, రక్షించేదీ, లయంచేసేదీ నీవే! సమస్తము నీపై ఈ సమస్తలోకాలను మళ్ళీ మళ్ళీ సృష్టిస్తున్నావు. ఈశ్వరా! కేశవా! వేదమయా! దివ్యస్వరూపా! దేవ దేవా! అంతులేని నీ

వింత లీలలు "ఇంతటివి-అంతటివి" అని వర్ణించడానికి మాకు చేతనవుతుందా?

***

*సంతాన వాంచతో సాయంసమయంలో తన చెంతకు వచ్చిన తన భార్య దితితో కశ్యపుడు:*

ఇప్పుడు కామునికి శత్రువైన త్రినేత్రుడు వృషభేంద్ర వాహనంపై భూతగణాలతో కూడి విహరిస్తుంటాడు. కాబట్టి ఈ సమయం మంచిది కాదు. ఈ ఉగ్రవేళలో కలయిక నిషేధింపబడింది. ఎందుకు ధర్మాన్ని అతిక్రమించాలి. ఒక ముహూర్తకాలం ఆగు.

శివునికి మిత్రులు, శత్రులు, మాన్యులు, సామాన్యులు, నచ్చినవారు, నచ్చనివారూ అనే భేదం లేదు. రుద్రుడు సమబుద్ధి కలవాడు. అన్ని ప్రాణులలో తానే అంతర్యామిగా ఉంటాడు.

ఎవని అనుగ్రహం వల్ల బ్రహ్మ, ఇంద్రాది దిక్పాలకులు, తమ పదవులను అధిష్టించి అతి వైభవంగా ఉంటున్నారో, ఎవని ఆజ్ఞకు లోబడి ఈ సమస్త ప్రపంచానికీ రాణి అనదగిన మాయ ఎల్లప్పుడూ ప్రవర్తిస్తూ ఉంటుందో, ఎవరి గొప్పదనాన్ని "ఇటువంటిది-అటువంటిది" అని వేదాలు కూడా నిరూపించలేవో, ఎవనిని అందరూ సేవిస్తారో, ఎవడు తనతో సాటివారూ, తనకంటే మేటివారు లేనివాడో; అటువంటి దేవదేవుని, త్రిపురాసుర సంహారుని, హరుని, అస్థిమాలాధరుడని,

ఆదిబిక్షువని, బూడిద పూసుకునేవాడని, శ్మశానవాసి అనీ అపహాస్యం చేసేవారు పరమ నిర్భాగ్యులు.

కుక్కలకు నక్కలకు ఆహారం కాదగినదీ, ఇహపరాలకు దూరం అయినట్టిదీ అయిన శరీరాన్ని శాశ్వతమని నమ్ముకొని, దానిని వస్త్రాలతోను, పూలదండలతోను, ఆభరణాలతోను మూర్ఖులు అలంకరించుకొంటారు.

సజ్జనులకు అపకారంచేసే తమోగుణ ప్రవృత్తులైన మదోన్మత్తులకు తప్పకుండా ఆయువు, సంపదలు నశిస్తాయి. శత్రువుల చేతిలో వారికి మృత్యువు తప్పదు. ఇది ముమ్మాటికీ వాస్తవం.

***

*దితి గర్భంలో పెరుగుతున్న హిరణ్యాక్ష హిరణ్యకశిపుల వల్ల లోకమంతా చీకటి వ్యాపించింది. అప్పుడు దేవతలందరూ బ్రహ్మ సన్నిధికి వెళ్ళి ఇలా విన్నవించారు.*

నీవు చరాచర ప్రపంచానికి అధినాయకుడవు. సృష్టికర్తవు. సకలలోక పాలకులలో అగ్రగణ్యుడవు. పూజనీయుడవైన దేవదేవా! సరస్వతీ వల్లభా! ఈ బ్రహ్మాండంలో నీకు తెలియని దేమున్నది? ఆపదల పాలైనాము. నీ చరణాలనే శరణుపొందాము. మా కష్టాలను ఒక్కమాటు నీ మనస్సులో స్మరించు.

***

*సనకసనందాదుల వైకుంఠ సందర్శన:*

పాపము హరించువాడు, పరాత్పరుడు, కేశవుడు, అనంతుడు అయిన వాసుదేవుని సేవించడానికి ప్రధాన సాధనం భక్తి మాత్రమే. కేవలం ధర్మశాస్త్ర పరామర్శతో పండిన బుద్ధికౌశలం గల మానవులు, ఆ మహనీయునిచే మరింత మోహితులై ఆ పరంధాముని పాదపద్మాలను పరమభక్తితో భజించే పద్ధతిని తెలుసుకోలేరు. అందుచే వారు ఆ వైకుంఠ స్థానాన్ని అందుకోలేకపోతున్నారు.

ఆయన అఖిల మునీశ్వరులు అభివర్ణించే మందహాస సుందరమైన ప్రసన్న ముఖారవిందంతో అలరారేవాడు. పెల్లుబికిన ప్రేమ వెల్లివిరిసే చూపులతో తన భక్తుల హృదయాంతరాలలో పవ్వళించేవాడు. విశాలమైన నల్లని వక్షస్థలంమీద వైజయంతీమాలతో విరాజిల్లేవాడు, నమస్కరించే భక్తులను లాలించి పాలించడంలో దయామృత తరంగాలు పొంగిపొరలే కమలాల వంటి కన్నులు కలవాడు, సకల యోగిపుంగవులకూ సంసేవింపదగినవాడు, సాధుజనులను సంరక్షించడంలో సమర్థుడు. అత్యంత మహిమాన్వితమై అఖిలలోకాలకూ కలికితురాయివలె అలంకారమైన వైకుంఠపురానికి కూడా అలంకార మైనవాడు.

దేవా! నీవు దుర్జనుల హృదయాలలో కూడా ఉంటావు. అయితే వారి భావనలకు అందవు. పట్టుదలతో నీ దివ్యమంగళ విగ్రహాన్ని ఆశ్రయించి ఆరాధించేవారిని అపార కారుణ్యంతో చేరదీసి నీ వారినిగా

చేసుకుంటావు. వారికి సంతుష్టి కలిగించుతావు. కమలాక్షా! నిన్ను దర్శించాలనే అభిలాష కలగడంవల్లా మాటిమాటికి నిన్ను గూర్చి చెప్పుకొనడం వల్లా సుస్థిరమైన భక్తియోగం అవగత మవుతుంది. రాగద్వేషాలు తొలగినటువంటి యోగిజనుల మనః పద్మాలలో నీవు ఆసీనుడవై ఉంటావని ఆత్మవిధులైన వారు తెలుసుకొంటారు.

భయంకరమైన కుష్ఠురోగం దేహంలో ప్రవేశించినప్పుడు చర్మం చెడిపోయి రంగు మారినట్లుగా, సేవకులు తగని పని చేయడంవల్ల ప్రభువుల యశస్సు నశించి పేరు ప్రతిష్ఠలు దెబ్బతింటాయి. లోకంలో దుష్కీర్తి వ్యాపిస్తుంది.

కమల లోచనా! కలుషిత విమోచనా! నీ నుండి ఉద్భవించిన ధర్మం నీ అవతారాలవల్ల సురక్షితమై సుస్థిరమై విలసిల్లుతుంది. ఈశ్వరా! దయామయా! మార్పు పొందని సత్యస్వరూపంలో ఉన్న నిన్ను గమనిస్తే నీవే ఆ ధర్మానికి ఫలస్వరూపమనీ, నీవే ఆ ధర్మంలోని ప్రధాన రహస్యమనీ పెద్దలు అంటుంటారు.

***

*హిరణ్యాక్షవధ:*

సముద్రం మధ్య చేరిన హిరణ్యాక్షుడు తన ఎదుట ఆదివరాహరూపంలో ఉన్న విష్ణువును వీక్షించాడు. ఆ ఆదివరాహం దట్టమైన కోరలు కలిగి ఉన్నది. దివ్యమైన తేజస్సుతో విరాజిల్లుతున్నది. భూభారం మోయడానికి సమర్థమై ఉన్నది. యజ్ఞమయమై

ఒప్పుతున్నది. వర్షాకాలం మేఘంలాగా నల్లగా ఉన్నది. వరాహరూపంలోనున్న పరాత్పరుడు తన చూపులతోనే ఆ రాక్షసరాజు దేహకాంతిని హరించివేశాడు.

శ్రీమహావిష్ణువు భూమిని నేలపై నిలిపి దానికి ఆధారంగా అనంతమైన తన శక్తిని ప్రసరింపజేశాడు. అప్పుడు ఆదివరాహమూర్తి బంగారు కుండలాలు, భుజకీర్తులు, కంఠహారాలు, కంకణాలు మొదలైన ఆభరణాల కాంతలు ఆకాశమంతా వ్యాప్తించగా యుద్ధానికి సిద్ధమైనాడు.

హిరణ్యాక్షుని సంహరించడానికి విష్ణువు తన మనస్సులో సుదర్శన చక్రాన్ని సంస్మరించాడు. సుదర్శన చక్రం దైత్యుల వంశమనే మహారణ్యాన్ని దహించివేసే జాజ్వలమానమైన దావానలం. సర్వదా జయజయశబ్దాలతో ప్రతిధ్వనించే దిక్చక్రము కలది. అనుక్షణమూ, ఆశ్రయించే వారికి రక్షణ కలిగించేది. సమస్త మహీచక్రాన్ని పరిపాలించేది.

లింగశరీరాలను భంగం చేసుకోవడానికి మహాయోగి పుంగవులు యోగమార్గాలద్వారా ఏ మహానుభావుని తమ హృదయాలలో పదిల పరచుకుంటారో ఆ దేవదేవుని చేతి దెబ్బ తిని ఆయన ముఖారవిందాన్నే సందర్శిస్తూ ప్రాణాలు విడిచిన దైత్యవల్లభుడు (హిరణ్యాక్షుడు) ఎంతటి భాగ్యవంతుడో, ఎంతటి ఉత్తముడో!

***

*బ్రహ్మ దేవుని పుట్టుక:*

భగవంతుడు జీవులకు అగోచరుడు. ఆ పురుషోత్తముడు యోగమాయా సమేతుడు. కాలస్వరూపుడు. నిర్వికారుడు. ఆ జగన్నివాసుడు, ఆదికాలంలో లోకాలను ఎలా సృష్టించాలని ఆలోచించాడు. ఆ ఆలోచనా ఫలితంగా సత్త్వము, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలు పుట్టాయి. ఆ గుణత్రయంలో రజోగుణంనుండి మహత్తత్వం పుట్టింది. ఆ మహత్తత్వం నుండి మూడుగుణాల అంశలు కలదైన అహంకారం పుట్టింది. అహంకారం నుండి పంచన్మాత్రలు పుట్టాయి. వాటి నుండి పంచభూతాలు పుట్టాయి. అవన్నీ ఒక గుంపుగా కలిసి ఒక బంగారు గ్రుడ్డును సృష్టించాయి.

ఆ గ్రుడ్డు మహాజలాలలో తేలియాడుతూ వృద్ధి పొందుతూ ఉంది. విష్ణువు *'నారాయణుడు'* అనే పేరుతో వెయ్యి దివ్యసంవత్సరాలు హిరణ్మయమైన ఆ అండాన్ని అధిష్టించి ఉన్నాడు. శ్రీమన్నారాయణుని బొడ్డు నుండి ఒక పద్మం పుట్టింది. ఆ పద్మం లోనుండి చతుర్ముఖ బ్రహ్మ జన్మించాడు. స్వయంప్రకాశుడైన ఆ బ్రహ్మదేవుడు నామములు, రూపములు, గుణములు అనే సంకేతాలు కలవాడై సమస్త జగత్తునూ సృష్టించాడు.

***

*కర్దముడు తన తపస్సుకు మెచ్చి ప్రత్యక్ష మైన విష్ణువును ప్రార్థించుట:*

నీవు పాపాలను పారద్రోలే పరమాత్ముడవు. సర్వేశుడవు. నీవు ఒక్కడివే అయినా నీవు నిర్మించిన మాయవల్ల ఎన్నో శక్తులు పుడుతున్నవి. సాలీడు సాలెగూడు నిర్మించి మరల తనలో లీనం చేసుకున్నట్లు నీవు ఆ శక్తుల ద్వారా ఈ లోకాలు పుట్టడానికీ, వృద్ధి పొందటానికీ, నాశనం కావడానికీ కారణమైన మాయామహిమతో ప్రకాశిస్తూ ఉంటావు. అటువంటి నీ అపార లీలా విలాసమైన మహాసముద్రాన్ని దాటడానికి ఎటువంటి వారికీ సాధ్యం కాదు.

విష్ణువు సంతోషించి కర్దముణ్ణి కరుణా దృష్టితో చూచినప్పుడు ఆ ముని కన్నుల నుండి రాలిన ఆనంద బాష్ప బిందువులు నేలపై పడి, సరస్వతీ నదిని చుట్టుకొని ప్రవహించడం వలన ఆ ప్రదేశానికి 'బిందు సరోవరం' అనే పేరు వచ్చింది.

***

*కర్దమ మహర్షి తన భార్య దేవహూతితో:*

మాననీయమైన ధర్మమార్గం వల్ల మహిమ ప్రాప్తిస్తుంది. ఆ మహిమాతిశయం వల్ల గొప్ప తపస్సూ దాని వల్ల ఏకాగ్రత సిద్ధిస్తాయి. వాటి వల్ల ఆత్మజ్ఞానం కలుగుతుంది. దానివల్ల ఆత్మయోగం లభిస్తుంది. ఆ ఆత్మయోగం భగవత్కటాక్షాన్ని ప్రసాదిస్తుంది. ఆ విష్ణుకటాక్షం కారణంగా భవ్యములైన అవ్యయమైన దివ్యభోగాలు, అనంతములైన శుభాలు సమకూరుతాయి.

*శ్రీహరి అవతారమైన కపిలుడు తన తండ్రి కర్దమునితో:*

నీపై అనుగ్రహంతో నీ ఇంట పుట్టాను. ఈ ముని వేషం ధరించడం నాకోసం కాదు. మహాత్ములైన మునులకు పరమాత్మ సంబంధమైన, పరమ వివేకంతో కూడిన తత్త్వజ్ఞానాన్ని బోధించడం కోసం ఈ దేహం ధరించాను. మహిమతో విరాజిల్లే నీ బుద్ధిని నా యందు లగ్నం చెయ్యి.

పరమేశ్వరుడను, పరంజ్యోతిను, అనఘుడను, అనంతుడను, సమస్త ప్రాణుల హృదయాంతరాలలో నివసించేవాడను, దేవదేవుడను, ఆద్యుడను, ఆద్యంత రహితుడను, దురితదూరుడను అయిన నన్ను కదలకుండా నీహృదయ కమల మధ్యంలో పదిలంగా నిలిపి జితేంద్రియుడవై మనోనేత్రంతో సూటిగా దర్శించు.

***

*కపిలుడు తన తల్లి దేవహూతికి తత్త్వజ్ఞానం బోధించుట:*

గాఢమైన సంసారబంధానికీ మోక్షానికీ జీవుని చిత్తమే కారణము. అది సత్త్వరజస్తమో గుణాలతో సమ్మేళనం పొందినప్పుడు సంసారబంధానికి హేతువవుతుంది. ఆ చిత్తమే శ్రీమన్నారాయణుని మీద సంసక్తమైనప్పుడు మోక్షానికి హేతు వౌతుంది.

సర్వసముడనైన నేను స్నేహం వల్ల కుమారుని వలెనూ, విశ్వాసం వల్ల చెలికాని వలెనూ, హితం కూర్చడం వల్ల ఆత్మీయుని వలెనూ, మంత్రం ఉపదేశించడం వల్ల ఆచార్యుని వలెనూ ఉంటూ వారికి

నిత్యం పూజింపదగిన ఇష్టదైవాన్ని కాలచక్రం వల్ల భయం కలుగకుండా కాపాడుతూ ఉంటాను.

ఆత్మ దివికి భువికీ నడుమ పలుమారులు తిరుగుతానే ఉంటుంది. మానవుడు ధనం, పశువులు, పుత్రులు, మిత్రులు, మగువలు మొదలైన తగులాలపై వ్యామోహం విడిచిపెట్టి పాపాలను పరిహరించేవాడనూ, ప్రపంచమంతట వ్యాపించిన వాడనూ అయిన నన్ను ఏకాగ్రచిత్తంతో ఆరాధించినట్లైతే, వానిని మృత్యుమయమైన సంసార సముద్రం నుండి దరిజేరుస్తాను.

ప్రధానమైన మూలప్రకృతికి పురుషునకు అధీశ్వరుడను, భగవంతుడను, జగదీశ్వరుడను అయిన నన్ను గాక ఇతరులను ఎన్నుకొన్నవారు సంసారభయంలో పడిపోతారు. నా ఆజ్ఞ జవదాటలేక భయంతో గాలి వీస్తుంది. అగ్ని మండుతుంది. సూర్యుడు ఎండ కాస్తాడు. ఇంద్రుడు వర్షిస్తాడు. మృత్యువు భయపడి పారిపోతాడు. అందువల్ల ఈ సృష్టి విజ్ఞానంతోపాటు వైరాగ్యంతో కూడిన భక్తి యోగంతో యోగివరులైనవారు వైకుంఠాన్ని ఆశించి నా చరణకమలాలను సంస్మరిస్తూ ఏ భయమూ లేకుండా ఉంటారు.

మోక్షంపై ఆసక్తి కలవాడు అఖండమైన భక్తియోగం అవలంబించాలి. విషయసుఖాల మీద విరక్తులు కావాలి. యమం నియమం లాంటి యోగమార్గాలను అభ్యసించి మనస్సును వశపరచుకోవాలి.

మోక్షాసక్తుడు చలించని శ్రద్ధాసక్తులతో నా సత్యస్వరూపాన్ని తెలుసు కోవాలి. నా పాదాలు సేవించాలి. నా కథలను ఆకర్ణించాలి. సర్వ జీవులయందూ సమబుద్ధితో వర్తించాలి. ఎవ్వరితోనూ వైరం లేకుండా ఉండాలి. మౌనం మొదలైన ఆత్మధర్మాలను అవలంబించాలి. సంతతమూ సంతోషంగా ఉండాలి. ఏకాంతంగా ఉండాలి. మననశీలుడై ఉండాలి. మాత్సర్యాన్ని దూరం చేసుకోవాలి. మైత్రి, కరుణ అభ్యసించాలి. ఆత్మజ్ఞానం అలవరుచు కోవాలి. తన శరీరం మీదా, ఆత్మీయులైన వారిమీదా ఆసక్తి తగ్గించుకోవాలి.

*హలం, వజ్రం, అంకుశం, కమలం, ధ్వజం, చిత్రం* మొదలైన మంగళకరమైన రేఖలు కలవీ, వెన్నెలవంటి గోళ్ళకాంతులతో మనస్సులలోని అజ్ఞానాంధకారాన్నిదూరం చేసేవి, భక్తుల పాపాలను పటాపంచలు చేసేవి, దాసుల కోర్కెలు తీర్చేవీ, యోగుల హృదపద్మాలలో విహరించేవీ అయిన హరి చరణ సరోజాలను నిరంతరం, హృదయంలో స్మరిస్తూ ఉండాలి.

బ్రహ్మదేవునకు తల్లియై, దేవతలకందరికీ ఆరాధ్యురాలైన లక్ష్మీదేవి తన హృదయేశ్వరుడైన శ్రీహరి మోకాళ్ళను ఎంతో భక్తితో ఒడిలో చేర్చుకొని ఒత్తుతూ ఉన్న మనోహర దృశ్యాన్ని మనస్సులో మననం చేసుకోవాలి. సొగసైన గరుత్మంతుడి భుజాలమీద కాంతి సంపదలతో పెంపొందుతూ, కన్నులకు విందు చేసే గోవిందుని అందమైన

ఊరుయుగ్మాన్ని మునులైనవారు అచంచలమైన భక్తితో భావిస్తూ తమ మనస్సులో నిల్పుకోవాలి.

మొలనూలు మువ్వల సవ్వడి నివ్వటిల్లే కమలాక్షుని కటిప్రదేశాన్ని భక్తితో భజించాలి. బ్రహ్మ పుట్టుకకు హేతుభూతమైన సరోజాతంతో విరాజిల్లే సరోవరం వంటి నాభి మండలాన్ని సంస్మరించాలి. లక్ష్మీదేవికి నివాసమైన వనజాక్షుని వక్షస్థలాన్ని ఆత్మలో భావిస్తూ ఉండాలి. వైకుంఠవాసుని కంఠాన్ని చిత్తంలో చింతించాలి.

లక్ష్మీవల్లభుడూ, సర్వాంతర్యామీ అయిన ఆ స్వామి గుణగణాలను మనస్సులో ధ్యానించాలి. ధగధగ ప్రకాశించే రత్నాల భుజకీర్తులు కలిగి లోకపాలకులకు అండదండలైన విష్ణుదేవుని బాహుదండాలను సంస్మరించాలి. ఆధ్యాత్మికం, ఆధిదైవికం, ఆధిభౌతికం అనే తాపత్రయాలను పోగొట్టే కమలాక్షుని కరుణాకటాక్ష వీక్షణాలను స్మరణం చేయాలి.

భక్తియోగాన్ని అనుసరించేవారు కమనీయ కాంతులు ప్రసరించే స్వామి ముసిముసినవ్వులలోని ప్రసన్నతను మననంచేసుకోవాలి. మన్మధునికి సైతం మరులు రేకెత్తించే మాధవుని భ్రూమండలాన్ని, మందహాసాన్నీ, పెదవులనూ, పలువరుసనూ తలపోయాలి. ఈ విధంగా అన్ని అవయవాలను వేర్వేరుగా మనస్సులో నిలిపి ధ్యానం చేసుకోవాలి.

ఇతరులను హింసపెడుతూ ఆడంబరం, అసూయ, రోషం, అజ్ఞానం, భేదబుద్ధి కలిగి నన్ను భజించేవాడు తామసుడు. అట్టి వానికి తామసభక్తి. ఆడంబరముతో కూడిన పూజాద్రవ్యాలతో ఐశ్వర్యాలకోసం, పేరుప్రతిష్ఠలకోసం, పూజనీయుడనైన నన్ను పూజించుట రాజసభక్తి అవుతుంది. తెలియక చేసిన పాపాలను పరిహారం చేసేది భగవద్భక్తి ఒక్కటే అనే విశ్వాసంతో '*భజింపదగిన పవిత్ర చరిత్రుడు భగవంతుడే*' అని మనస్సులో భావిస్తూ, సమస్త కార్యాలూ భగవదంకితంగా ఆచరిస్తూ, లోకులకు మేలు చేకూర్చే పనులు చేస్తూ ఉండటం సాత్త్వికభక్తి.

నా గుణాలను ఆలకించిన మాత్రాన ప్రాప్తమైన భక్తితో ఉదాత్తచిత్తులైన కొందరు సముద్రాన్ని సంగమించిన గంగానది మాదిరిగా అనంతకల్యాణ గుణసహితుడనూ, పరమేశ్వరుడనూ అయిన నన్ను ఆశ్రయిస్తారు. అటువంటి ఉత్తముల మనోభావాలు చక్కగా సఫల మౌతాయి.

కల్యాణకరాలైన హరిగుణాలను కీర్తించుతూ ఉండాలి. చిత్తశుద్ధితో అనురక్తితో భగవద్భక్తులను సేవిస్తుండాలి. అహంకారం లేకుండా నిశ్చల హృదయంతో జీవించాలి.

అఖిల జీవుల హృదయాలలో అంతర్యామినై నేను ఉన్నాను. అటువంటి సర్వేశ్వరుడనైన నన్ను అలక్ష్యం చేసి కేవలం నా విగ్రహాలను మాత్రమే ఆడంబరంగా పూజిస్తూ లోకాన్ని మోసగించేవాడు మూర్ఖుడు.

అచంచలమైన భక్తితో నన్ను ఆరాధింపని వాని పూజలు బూడిదలో పోసిన హోమద్రవ్యాలవలె నిరర్థకాలు.

ఆ శ్రీమన్నారాయణుడు సమస్త శాస్త్రాలను చక్కగా చదివినందువల్లను; అనుష్టానాలు, యజ్ఞాలు, తీర్థయాత్రలు, జపతపాలు ఆచరించడము వల్లనూ కనిపించడు. వేదాలు అధ్యయనం చేయడం వల్లను, యోగాభ్యాసాలవల్లను; దానాలు, వ్రతాలు, చేసినందువల్లను భగవంతుడు గోచరించడు. చంచలమైన మనస్సును లోగొని చెలరేగిన ఇంద్రియాలను జయించి, కర్మ లన్నింటినీ భగవదర్పితం చేసి, ఆత్మస్వరూపాన్ని గుర్తించి, తరగని వైరాగ్యంతో ఫలితాలను ఆపేక్షించకుండా ప్రవర్తించే పురుషుడు మాత్రమే దుర్గుణాలను దూరం చేసుకొని పాపాలను పటాపంచలు గావించి అనంత కల్యాణ గుణ విశిష్టుడైన ఆ ఆ పరమాత్మను చేరగలుగుతాడు.

గాలిలో ఎగిరే మేఘానికి గాలిశక్తిని తెలుసుకొనే శక్తి ఉండదు. అదే విధంగా సకల లోకేశ్వరుడైన భగవంతుని శక్తిని గుర్తించే శక్తి ఎవ్వరికీ ఉండదు.

దుష్టబుద్ధుడైన మానవుడు అశాశ్వతములైన ఇల్లు, పొలం, పశువులు, ధనం, సంతానం, భార్య, బంధువులు మొదలైన వస్తువులే శాశ్వతం అని నమ్ముతాడు. అటువంటి మూర్ఖుడు అనేక ప్రాణుల శరీరాలను పొందుతూ వివిధ యోనుల్లో జన్మిస్తూ ఉంటాడు. అయినా వాటిపట్ల విరక్తి చెందడు. నరకం అనుభవించిన తర్వాత కూడా దేహి తన

దేహాన్ని వదలలేడు. అదే ఎంతో సుఖమైందిగా భావించి దానినే అంటిపెట్టుకొని ఉంటాడు. అంతేకాకుండా అతడు దేవుని మాయకు లొంగిపోయిన వాడౌతాడు.

మనిషి అలా లొంగిపోయి కుమారులు, భార్య, పశువులు, ధనం,ఇల్లు వీనిని రక్షించుకొనే ఆలోచనలతో అహోరాత్రాలూ వేగిపోతూ క్రాగిపోయిన దేహంతో క్రుంగి కృశిస్తాడు. అతడు తెలివిలేనివాడై, పాపకార్యాలు ఆచరిస్తాడు. ఇల్లాలి సరససల్లాపాలలోనూ, పిల్లల జిలిబిలి పలుకులతోనూ మురిసిపోతూ ఉంటాడు.

ఈశ్వరుడు శాశ్వతంగా ప్రకాశించేవాడు, సర్వమయుడు, అన్నిటిని సంఘటిత పరిచేవాడు కాబట్టి, జీవుడు తన పూర్వకర్మలను అనుసరించి మళ్ళీ దేహాన్ని పొందగోరుతాడు. జీవుడు పురుషుని వీర్యబిందు సంబంధంతో స్త్రీ గర్భంలో ప్రవేశిస్తాడు. పదవ దినానికి రేగుపండంతయై అనంతరం మాంసపిండమై గ్రుడ్డు ఆకారం పొందుతాడు.

భగవంతుడు మూడు కాలాల్లో, చరాచర ప్రపంచంలోని సమస్త జీవరాసుల్లో అంతర్యామిగా ఉంటాడు. అందుచేత బ్రతుకుతెరువున పయనించేవారు తాపత్రయాలు తప్పించుకోవడానికి ఆ భగవంతుణ్ణి ఆరాధిస్తారు.

జీవుడు తల్లి గర్భంలో క్రిములతో నిండిన మలముత్రాల నెత్తురు గుంటలో మునుగుతూ, ఆకలి మంటలతో దినదినం తపింపబడే దేహం కలవాడు అవుతాడు.

దైన్యంతో నిండిన ముఖం కలవాడై, ఆ గర్భనరకంనుండి బయటపడాలని భావిస్తూ, గడచిన నెలలు లెక్కించుకుంటాడు. నన్ను ఈ గర్భంనుండి వెలువరించే వాళ్ళు ఎవరైనా ఉన్నారా? అని తలపోస్తూ ఉంటాడు. ఇటువంటి గర్భవాసాలు ఇంకా ఎన్ని భరించవలసి ఉన్నదో! ఈ ఆపదను పోగొట్టడానికై కమలనాభుని పాదాలను ఆశ్రయిస్తాను. అవి సంసార సాగరాన్ని తప్పక తరింపజేస్తాయి.

జీవుడు ఆకాశానికి ఎగిరిపోయినా, భూమిలో దూరినా, దిక్కులకు పారిపోయినా, ఎచ్చట దాగినా కర్మఫలాన్ని అనుభవించక తప్పదు. సంసారానికి కట్టుబడిన గృహస్థులు ధర్మార్థకామాలపై ప్రీతికలిగి, వాటిని సాధించడంలోనే మునిగి తేలుతూ ఉంటారు. దేవగణాలను నిత్యం ఆరాధిస్తారు. అయినా కోర్కెలు నిండిన చిత్తం కలవారు మోక్షాన్ని అందుకోలేరు.

అత్యంత నిర్మలమైన ఆదిశేషుని పానుపుమీద శ్రీమన్నారాయణుడు యోగనిద్రలో ఉన్న సమయంలో సమస్తలోకాలూ ప్రళయాన్ని పొందుతాయి. బుద్ధిమంతులైనవారు అటువంటి సర్వేశ్వరుణ్ణి ధ్యానిస్తారు.

వారు అచంచలమైన భక్తితో *"నేను" అనే అహంకారం గానీ, "నాది" అనే మమకారంగానీ* లేకుండా ఉంటారు. మళ్ళీ జన్మలేని దివ్యధామాన్ని చేరుకుంటారు. అనంతకల్యాణ విశిష్టుడయిన త్రివిక్రముని భజిస్తూ ఆయన మహిమలను మననం చేస్తూ ఆయన మధుర కథాసుధను తనివితీరా త్రాగడం ఉత్తమ లక్షణం.

అందువల్ల జననీ! *సర్వశ్రేష్ఠుడు, పాపరహితుడు, అనంతుడు, అధీశ్వరుడు, పురుషోత్తముడు* అయిన పరమేశ్వరుణ్ణి సద్బుద్ధితో సేవించు. అలాచేస్తే పునర్జన్మ లేని కైవల్యం నీకు లభిస్తుంది – అని కపిలుడు తల్లి దేవహూతికి ఉపదేశించాడు.

***

*దేవహూతికి బ్రహ్మజ్ఞాన ప్రాప్తి:*

కపిలమహర్షి ఉపదేశం ఆలకించిన దేవహూతికి మోహం తొలగిపోయింది. అప్పుడు ఆమె కపిల మహర్షిని ఉద్దేశించి ఇలా అంది. "మహాప్రళయ సమయంలో సమస్త భువన సముదాయాన్నీ నీ ఉదరంలో పదిలంగా దాచుకొని మహాసాగర మధ్యంలో మర్రిఆకు మీద మాయా శిశువుపై ఒంటరిగా శయనిస్తూ ఉంటావు. మహానుభావా! అలా *వటపత్రశాయివైన* నువ్వు లీలగా నీ కాలి బొటన వ్రేలును నోటిలో నుంచుకొని అందలి అమృతాన్ని ఆస్వాదిస్తూ ఉంటావు. అటువంటి

ఆదినారాయణమూర్తి పైన నీవు నా పూర్వ పుణ్య విశేషం వల్ల నా కడుపున పుట్టావు. నా జన్మ తరించింది.

పరమాత్మ స్వరూపుడవైన నీవు అవతారాల మీద ముచ్చటపడి రఘురామచంద్రునిగా, శ్రీకృష్ణ ప్రభువుగా, వరాహస్వామిగా, నరసింహమూర్తిగా ఆకారాలు ధరించి దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తావు. ఉత్తమ ధర్మమునందు ప్రవృత్తమైన చిత్తం గల భక్తులకు జ్ఞానదృష్టిని ప్రసాదించడం కోసం *వాసుదేవ సంకర్షణ అనిరుద్ధ* ప్రద్యుమ్న వ్యూహాలను అవలంభించి ప్రవర్తిస్తావు. అనఘుడవు, అనంతకల్యాణగుణ సంపన్నుడవు అయిన నీ మహత్త్వాన్ని అభివర్ణించడం చతుర్ముఖునకూ, చతుర్వేదాలకూ కూడా సాధ్యం కాదు. నేనెంత దాన్ని? వెయ్యి మాట లెందుకు? నిన్ను తెలుసుకొని సన్నుతించడం నాకు శక్యం గాని పని. అందువల్ల పరబ్రహ్మవూ, పరమపురుషుడవూ, సకలజీవుల పాపాలను పటాపంచలుచేసేవాడవూ అయిన నీకు నమస్కరిస్తున్నాను.

ఈ విధంగా దేవహూతి స్తుతించగా మాతృప్రేమ నిండిన కపిలుడు కన్నతల్లితో ఇట్లా అన్నాడు. తల్లీ ! సుఖస్వరూపము, మోక్షప్రదము అయిన ఈ యోగమార్గాన్ని నీకు తేటతెల్లంగా వెల్లడించాను. దీనిని నీవు దృఢమైన భక్తితో అనుష్ఠించు.

***

కపిలాచార్యుడు కన్నతల్లి అయిన దేవహూతికి ఆత్మతత్త్వాన్ని ఉపదేశించాడు. సాంఖ్యాశాస్త్రంలో తాను ప్రవచించిన యోగమార్గాన్ని అవలంబించాడు. ముల్లోకాలకు శాంతిని ప్రసాదించాడు.

కపిలుడు వెళ్ళిపోయిన అనంతరం దేవహూతి తన పుత్రుడి ఉపదేశం వల్ల జ్ఞానోదయం కలిగినా, మొదట తన పతి కర్దమప్రజాపతి, ఇప్పుడు తన కుమారుడు కపిలుడు కూడా తనను విడిచి పోయినందున తల్లడిల్లి పోయింది. కర్దముడు తన తపఃప్రభావం వల్ల కల్పించిన అందమైన భవనాలను, ఉధ్యానవనాలను, సకలసంపదలనూ వదలిపెట్టి ముందుకు సాగింది. కర్దమ ఆశ్రమాన్ని వదలిపెట్టి తపోదీక్ష వహించింది.

దేవహూతి తన కడుపున కపిలమూర్తియై అవతరించిన శ్రీమన్నారాయణుని ఏకాగ్రచిత్తంతో అనేక విధాలుగా ధ్యానం చేయడం మొదలెట్టింది. ఆమె ఎదలో అఖండమైన వైరాగ్యం కుదురుకొంది. పరిశుద్ధ మనస్కురాలైన దేవహూతికి సుయోగ్యమైన అనుష్ఠానంతో బ్రహ్మజ్ఞానం ప్రాప్తించింది. నిరంతర నిష్టతో ఆమెకు నిర్మలమైన తత్త్వజ్ఞానం అలవడింది. దైవభావం కలిగింది. పరబ్రహ్మతో సమాధి సిద్ధించింది. దేవహూతి తన అస్తిత్వాన్ని మరచిపోయింది. అఖండ యోగప్రభావం వల్ల ఆమె మనస్సు ఆకాశానికి ఎగసి పరమ కరుణా మయుడైన వాసుదేవుని చరణకమలాలలో విలీనమయింది.

ఆ సతీమతల్లి మోక్షాన్ని అందుకున్న పవిత్రక్షేత్రం 'సిద్ధిపదం' అనే పేరుతో ప్రసిద్ధి వహించింది.

***

*ఫలశ్రుతి:*

ఈ "కపిల దేవహూతి సంవాదం" అతి పవిత్రమైనది. దీనినే 'కపిలప్రోక్తమైన యోగశాస్త్రం' అంటారు. ఎవరైతే ఈ కపిల దేవహూతి సంవాదాన్ని అత్యంతభక్తితో పఠిస్తారో, ఎవరైతే శ్రద్ధగా వింటారో – అటువంటి వారి పాపాలు పూర్తిగా నశించి పుణ్యాత్ములవుతారు. వారు గరుడధ్వజుడైన కమలాక్షుని శ్రీపాద కమలాలను చేరుకుంటారు.

***

# చతుర్థ స్కంధము

*అత్రి అనసూయా దంపతులకు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల అంశలతో ముగ్గురు కుమారులు జన్మించారు.*

సరస్వతి లక్ష్మీ గౌరీ వల్లభులైన త్రిమూర్తులు అత్రి మహర్షి తపస్సుకు మెచ్చి ఆయన ఎదుట నిలిచారు. బ్రహ్మ మేలిమి బంగారు వలె పసుపుపచ్చగా ఉన్నాడు. విష్ణువు మేఘం వలె నల్లగా ఉన్నాడు. శివుడు వెన్నెల వలె తెల్లగా ఉన్నాడు. బ్రహ్మ హంసను, హరి గరుత్మంతుని, మరియు శివుడు వృషభాన్ని అధిరోహించారు. బ్రహ్మ కమండలం ధరించాడు. విష్ణువు చేతిలో చక్రం ఉన్నది. శివుని చేతిలో త్రిశూలం ఉన్నది.

“మేము లెక్కకు ముగ్గురుం అయినా వాస్తవానికి ఒక్కరిమే. అందుకే నీవు ఒక్కరిని పిల్చినా మేము ముగ్గురమూ వచ్చాము. మా ముగ్గురు అంశతో నీకు ముగ్గురు కుమారులు జన్మిస్తారు. వారి వలన నీ కీర్తి మూడులోకాలలో వ్యాప్తిస్తుంది”.

త్రిమూర్తుల వరం వలన వారికి *బ్రహ్మదేవుడి అంశతో చంద్రుడు, విష్ణుదేవుని అంశ వల్ల దత్తుడు, శివుని అంశ వల్ల దర్వాసుడు* కలిగారు.

***

*నరనారాయణులు:*

ధర్ముడు, దక్షప్రజాపతి కుమార్తె మూర్తి దంపతులకు నరనారాయణులు ఉద్భవించారు.

ఆ శుభసమయంలో వాయువు చల్లగా వీచింది. నాలుగు దిక్కులు ప్రకాశించాయి. అఖిల లోకాలు ఆనందం పొందాయి. ఆకాశంలో దేవ దుందుభులు మ్రోగాయి. సముద్రాలు ప్రశాంతంగా ఉన్నాయి. నదులు వేగంగా ప్రవహించాయి. గంధర్వులు గానం చేసారు. అప్సరలు నాట్యం చేసారు. దేవతలు పూలవాన కురిపించారు. మునులు స్తుతించారు. ప్రపంచమంతా మంగళకరంగా విలసిల్లింది. ఆ నరనారాయణులే భూభారాన్ని తగ్గించడం కోసం అర్జునుడు, కృష్ణుడు అనే పేర్లతో కురు, యదు వంశాలలో సత్త్వగుణ సంపన్నులై జన్మించారు.

***

*సతీదేవి దక్షప్రజాపతి కుమార్తె. పరమశివుని భార్య. శివునిపై పగబూనిన తన తండ్రిపై కోపించి యోగమార్గంలో తన శరీరాన్ని త్యజించింది.*

కుటిల బుద్ధిగల దుర్మార్గుల గృహాలకు మంచివారు వెళ్ళరు. అలా వెళ్ళినట్లయితే ఆ పాపాత్ములు కనుబొమలు చిట్లించి ద్వేషంతో ఉరిమి ఉరిమి చూస్తారు.  లోకంలో బంధువులతో గౌరవం పొందకుండా అవమానం పొందడం మరణంతో సమానం.

బలవంతుడైన శత్రువు ప్రయోగించిన బాణాల చేత శరీరం తూట్లుపడినా ఆ బాధను భరించి ఏ వ్యక్తైనా వాటిని భరించి నిద్రపోగలడేమోకాని, దగ్గర చుట్టాల దురహంకారంతో కూడిన దుర్భాషలు ఏ వ్యక్తిని నిద్ర పోనివ్వవు. గుండెల్లో లోతుగా గ్రుచ్చుకొని మాటి మాటికీ బాధ కలిగిస్తాయి.

మంచివారికి అహంకారము లాంటి చెడుగుణాలు లేకపోవడం వలన గొప్ప కీర్తి లభిస్తుంది. అసమర్థులు అట్టి కీర్తి తమకు కూడా లభించాలని ఎంత కోరుతున్నా వారికి ఆ కీర్తి రాదు. అందుచేత వారు మనస్సులో కుతకుత ఉడికిపోతారు. కారణం లేకుండానే, దేవతలపై రాక్షసులు పగ పెంచుకున్నట్లుగా, వారు మంచివారిపై అసూయ పెంచుకుంటారు.

సతీదేవి వెనుక మణిమంతుడు మొదలైన వేలకొలది ప్రమథులూ, యక్షులూ బయలుదేరారు. నందీశ్వరుడు వారి ముందు నడుస్తున్నాడు. సతీదేవిని వృషభవాహనంపై కూర్చుండబెట్టి శంఖాలు, నగారాలు, పిల్లనగ్రోవులూ మ్రోగిస్తూ యజ్ఞం జరిగే ప్రదేశానికి ప్రయాణం సాగించారు.

పరమేశ్వరుడు లోకంలోని ప్రాణులందరికీ ఎంతో ఇష్టమైనవాడు. ఆ మహాదేవునికి ఇష్టమైనవారు గాని, ఇష్టం లేనివారు గాని ఎవరూ లేరు. ఈ విశ్వంలో ఆయన కంటే అధికులు లేరు. సకల విశ్వాలకు

కారణం ఈశ్వరుడే. ఆయనకు ఎవరి యందూ ద్వేషం లేదు. అలాంటి దేవదేవుని దక్షుడు తప్ప లోకంలో ఇంకెవ్వరూ ద్వేషించరు.

'శివ' అను రెండు అక్షరాలను ఆసక్తితో నోటితో పలికినా, మనస్సులో తలచినా సమస్త ప్రాణుల సర్వ పాపాలు నశిస్తాయి. పరమేశ్వరుడి పాదాలను కొలిచేవారి కోరికలు నెరవేరుతాయి. అందుకనే విజ్ఞానులైనవారు మంగళకరుడైన పరమశివుని పాదారవిందాలను ధ్యానిస్తూ భక్తి పారవశ్యంతో ధన్యులౌతారు. శ్మశానంలో వసించినా, ఎముకలను బూడిదను కపాలాలను ధరించినా, భూతాలతో కలిసి చరించినా శివుడు మంగళస్వరూపుడే.

దేవతలకు ఆకాశగమనము, మానవులకు భూగమనము సహజమైనట్లు సంసారులకు, విరక్తులైన సన్యాసులకు వేరు వేరు ధర్మాలు సహజం. ఒకరి ధర్మాన్ని ఇంకొకరు నిందించ కూడదు. శివుడు బ్రహ్మస్వరూపుడు కావున ఆయన అన్ని కర్మలకు అతీతుడు. అందువలన క్రియాశూన్యుడని సదాశివుని నిందించడం పాపం.

"ఇకముందు నందివాహనుడు భగవంతుడు అయిన పరమేశ్వరుడు ఆదరంగానో, పరిహాసంగానో "దాక్షాయణీ" అని నన్ను పిలిచి నప్పుడు నేను దుఃఖంతో కుమిలిపోతాను. కాని పూర్వం లాగ ఆనందించలేను. చిరునవ్వులు చిందించలేను. చనిపోవడమే మంచిది" అని తండ్రి దక్షునితో చెప్పి సతీదేవి యోగమార్గం ద్వారా శరీరాన్ని విడిచిపెట్టాలని నిశ్చయించుకొన్నది.

పరమేశ్వరుడు త్రెంచివేసిన జడనుండి సకల లోకాలకు భయం కలిగిస్తూ, రెండవ రుద్రునివలె వీరభద్రుడు ఉదయించాడు. ఆయన ఎత్తైన నల్లని దేహం ఆకాశాన్నంటే మేఘంలా ఉంది. ఆయన బాహువుల్లో అసంఖ్యాకమైన ఆయుధాలు మెరుస్తున్నాయి. ఆయన కోరలు రంపాలలాగ కఠినంగా భయంకరంగా ఉన్నాయి. మెడ నిండా కపాలమాలలు వ్రేలాడుతున్నాయి.

పరమశివుడు ప్రళయకాలంలో తన త్రిశూలంతో ఎనిమిది దిక్కులను పట్టి ఉంచుతాడు. ఉరుము ఉరిమినట్లు గంభీరంగా అట్టహాసం చేస్తాడు. నక్షత్రమండలాలన్నీ జలజల రాలుస్తాడు. నానావిధాలైన ఆయుధాలను ధరించి విలయ తాండవం చేస్తూ సర్వమూ సంహరిస్తాడు.

దేవాది దేవుడైన ఆ మహాదేవుడు ఒక్కమాటు కోపంతో కనుబొమలు ముడిస్తే చాలు, లోకపాలకులు నశిస్తారు  లోకాలూ నశిస్తాయి. ఆ మహానుభావుడిని  నిండు మనసుతో, నిర్మల భక్తితో ఆశ్రయించి శరణు వేడితే దయతలచి మీ కోర్కెలు నెరవేర్చుతాడు.

శివుడు శాంతమూర్తి. లోకాలకు శుభం కలిగించేవాడు. విశ్వానికి చుట్టము. ఎదురులేని శక్తి సామర్థ్యాలు కలవాడు. విద్య, తపస్సు,  యోగం అన్నిటితో కలిసి ఉన్నవాడు. జడలో చంద్రరేఖను అలంకరించుకొన్నవాడు. విభూతిని, జడలను,   గజచర్మమును ధరించినవాడు.

తపోధనుల కోర్కెలు తీర్చేవాడు. భక్తులను అనుగ్రహించేవాడు. దేవతలు, రాక్షసులు, యక్షులు, మునులు అందరిచే పూజింపబడేవాడు.

***

*శివుని చూచి విరించి ఇలా అన్నాడు:*

"ఓ మహేశ్వరా! లోకాల కన్నింటికీ ఉత్పత్తి స్థానమైన శక్తివి నీవే. జగత్తుల కన్నింటికీ బీజమైన శివుడు నీవే. నీవు నిర్వికార పరబ్రహ్మవు. నిన్ను విశ్వనాథునిలా నా మనస్సులో తెలుసుకున్నాను. నీ అంశలైన శక్తిశివ స్వరూపాలతో క్రీడిస్తావు. సాలెపురుగువలె విశ్వసృష్టికీ, వృద్ధికీ వినాశనానికీ నీవే హేతువు అవుతుంటావు.

హరిమాయను తప్పించుకోవడం ఎవరికీ చేతకాదు. విష్ణుమాయకు చిక్కినవారు భేద దృష్టితో ప్రవర్తిస్తారు. అటువంటివారు తప్పుచేసినట్లయితే సత్పురుషుడు అది దైవకృతంగా భావిస్తాడు. వారి మీద జాలిపడతాడు. అంతేగాని వారిని హింసింపడు. శివుడు సర్వజ్ఞుడు. విష్ణుమాయకు అతీతుడు. కర్మలు చేసేవారెవరైనా విష్ణుమాయకు వశులై అపరాధం చేసినట్లయితే వారిని క్షమించి కాపాడుతాడు.

***

*దక్షయజ్ఞం తిరిగి పూర్తిచేయించమని దేవతలు విష్ణువును స్తుతించుట:*

దేవా! నీ నిజరూపంలో ఉన్నప్పుడు నీకు రాగద్వేషాలు ఏమీ ఉండవు. ఒకసారి మాయను నిరసిస్తావు. మరొకసారి దానిని అనుసరిస్తావు. నీవు సర్వస్వతంత్రుడవు అయినా మాయకు లొంగి రాగాదులు ఉన్నవాడివలె రాముడు, కృష్ణుడు మొదలైన అవతారాలను ధరించి దర్శనమిస్తావు. ఈ విశ్వానికి హేతువులైన శివుడు, బ్రహ్మ, దిక్పాలకులు, సనక చరాచర జీవకోటి అన్నీ నీవే. నీకంటె వేరయినది ఈ లోకంలో ఏదీ లేదు.

తన ఇంద్రియాలతో ఎదురుగా నున్న పదార్థాలను మాత్రమే గ్రహించగల మానవుడు నీ మాయారూపాన్ని మాత్రమే చూడగలడు. సంపూర్ణమైన జ్ఞానానికి, సత్యం మొదలైన గుణాలకు నిలయమై, అసత్తులకంటె వేరైన నీ రూపాన్ని జీవులు చూడలేరు. నీవు సర్వేశ్వరుడవు. విశ్వవిధాతవు. భవభంధాలను పటాపంచలు చేసే వాడివి.

విశ్వస్వరూపా! ఈవిశ్వంలోని జీవులను నీకంటె వేరుగా చూడనివాడు నీకు యిష్టుడు. నీవు లోకాల సృష్టి, స్థితి, లయాలకోసం బ్రహ్మ,విష్ణు, మహేశ్వరుల రూపాలను ధరిస్తావు. వేరు వేరు గుణాలతో కూడిన నీ మాయవల్ల యిలా చేస్తూ స్వస్వరూపాన్ని ధరిస్తూ ఉంటావు. ఎల్లప్పుడు భక్తితో నిన్ను సేవించే మమ్ములను కాపాడు.

***

*విష్ణుమూర్తి దక్షునితో:*

నేను, బ్రహ్మ, శివుడు ముప్పురం ఈ లోకాలకు హేతుభూతులం. నేను త్రిగుణాత్మకమైన నా మాయతో సృష్టి స్థితి లయ కార్యాలను నిర్వహిస్తూ ఆ యా పనులకు తగిన నామాలను పొందుతాను. నా కంటె వేరయిన పరబ్రహ్మ రూపం లేదు. బుద్ధిహీనుడు మాత్రమే వారిని, మిగతా జీవులను, నా కంటె వేరుగా చూస్తాడు. హరిహర బ్రహ్మలమైన మా ముగ్గురను వేరుగా చూడని వాడు ధన్యుడు.

***

*ధృవుడు తండ్రి ఉత్తానపాదుని తొడలపై కూర్చోవాలని ఉబలాట పడ్డాడు. సవతి తల్లి సురుచి మాటలతో విచారించిన ధృవుడు తల్లి అనుజ్ఞతో ఇల్లు వదిలాడు. నారదుడు ధృవునికి ఇలా ఉపదేశం చేశాడు.*

ఆ నారాయణుని పాదపద్మాలను ఆరాధించి బ్రహ్మదేవుడు బ్రహ్మపదాన్ని అందుకున్నాడు. మీ తాత స్వాయంభువు ఆ దేవదేవుని సేవించి ఇహపరలోక సుఖాలన్నీ అనుభవించిన తర్వాత పరమపదం పొందాడు. బ్రహ్మదేవుడు మొదలయిన దేవతలు ఎంత వెదికినా కనిపించని లక్ష్మీదేవి ఆ కమలాక్షుని కోసం కమలాన్ని ధరించి వెదుకుతూ ఉంటుంది. యోగీంద్రులు ఆయన పాదాలు అన్వేషించి ఆరాధిస్తారు. ఆయనను ఆశ్రయించు. తప్పక నీ కోరిక నెరవేరుతుంది.

మానవులకు సుఖదుఃఖాలు, పూర్వం తాము చేసిన కర్మలను బట్టి కలుగుతూ ఉంటాయి. వారు వాటిని తప్పక అనుభవించక తప్పదు.

కాబట్టి తెలివిగలవాడు తనకు కలిగిన సుఖదుఃఖాలు దైవసంకల్పం వలన కలిగినవే అని భావిస్తాడు. దైవం ఇచ్చిన దానితోనే తృప్తిచెందుతాడు.

గుణవంతులను చూసి సంతోషించాలి. గుణహీనులను చూసి జాలిపడాలి. తనతో సమానుడైన వానితో స్నేహం చేయాలి. ఇలా ప్రవర్తించే వాని దగ్గరకు ఏ తాపత్రయాలు చేరవు.

ధర్మార్థ కామ మోక్షాలు అనే నాలుగు విధాలైన పురుషార్థాలు పొందాలి అనుకునేవాడు హరి పాదపద్మాలను సేవించాలి. అంతే తప్ప మరొక మార్గం లేదు. శ్రీహరి ఆశ్రితులందు అపారమైన కృపారసం చూపేవాడు. చల్లని చూపులు కలవాడు. దయాసముద్రుడు. నమస్కరించేవారికి ఆశ్రయమిచ్చేవాడు. సర్వలోక రక్షకుడు. ఉత్తమ లక్షణాలు గల పురుషోత్తముడు. ఇంద్రనీల మణులవలె ప్రకాశించే మేను కలవాడు. శ్రీవత్సం అనే పుట్టుమచ్చ కలవాడు. నీలమేఘశ్యాముడు.

త్రికరణశుద్ధిగా భక్తితో పూజించేవారు విష్ణుమాయకు లోబడరు. వారు ఓంకారంతో నిండిన *"ఓం నమో భగవతే వాసుదేవాయ"* అనే వాసుదేవ మంత్రాన్ని నిత్యం జపిస్తే ఆ వాసుదేవుని కరుణ లభ్యమవుతుంది. విరక్తితో ముక్తిని కోరి భక్తితో ధ్యానించే వారికి మోక్షం లభిస్తుంది.

***

*నారదుని వల్ల వాసుదేవ మంత్రాన్ని ఉపదేశం పొందిన ధ్రువుడు మధువనం చేరుకున్నాడు.*

ఆ మధువనం మునులు, దేవతలు, యోగులు మొదలైనవారిచే పొగడబడినది. సంసారం అనే మబ్బును చెదరగొట్టగలది. సమస్త పుణ్యాలకూ ఉనికి పట్టైనది. ధ్రువుడు అక్కడ పరమాత్మను భజించుతూ ఒంటి కాలిపై నిలిచి తపస్సు చేశాడు. ఆ తపస్సుకు మెచ్చి సాక్షాత్కరించిన శ్రీహరికి ధ్రువుడు సాష్టాంగ నమస్కారంచేసి ఇలా అన్నాడు:

దేవా! నీవు అఖిల శక్తి సంపన్నుడవు. పరమ పురుషుడవైన నీవు ఒక్కడివే అయినప్పటికీ నీ మాయాశక్తి చేత ఈ సమస్త లోకాన్ని సృష్టిస్తావు. ఈ లోకంలో ప్రవేశిస్తావు. ఇంద్రియములలో నివసిస్తావు. అగ్ని ఒక్కటే అయినప్పటికీ పెక్కు చోట్ల ప్రకాశించునట్లు నీవు ఆయా దేవతా రూపాలలో ప్రవేశించి ప్రకాశిస్తావు. నిద్ర నుండి మేల్కొన్నవాడు మరల ప్రపంచాన్ని చూస్తాడు. అలాగే బ్రహ్మదేవుడు నిన్ను శరణుపొంది నీవు ప్రసాదించిన జ్ఞానంచేత ఈ సమస్త ప్రపంచాన్నీ సందర్శించాడు. మోక్షం కోరుకొనేవాడు నీ చరణాలను ఆశ్రయించి తీరవలసిందే. అటువంటప్పుడు కృతజ్ఞుడైన బుద్ధిమంతుడు నీ చరణాలను ఎలా మరచిపోగలడు.

పేదవాడు మహారాజును సమీపించి ఊకతో కూడిన నూకలను కోరినట్లు మోక్షప్రదాత అయిన శ్రీమహావిష్ణువు సాక్షాత్కరింపగా నేను

మోక్షాన్ని కోరకుండా సంసారాన్ని కోరుకున్నాను. నావంటి తెలివితక్కువవారు ఈ లోకంలో మరెవ్వరూ ఉండరు అని ధ్రువుడు విచారించాడు.

నీళ్ళు పల్లానికి ప్రవహించిన విధంగా భగవంతుని దయకు పాత్రుడైన వాని వద్దకు తమంత తాము అందరూ అనుకూల భావంతో చేరుకొంటారు. విష్ణు భక్తులు పరమపవిత్రులు. వారికి శత్రువులంటూ ఎవరూ ఉండరు. వారిపై ఎవ్వరూ కోపించరు.

దేహం మీద అభిమానంతో పశువు వలె ప్రాణహింస చేయడం శ్రీహరి భక్తులైన సజ్జనులకు తగదు. తనకంటె గొప్పవారి యందు సహనభావం, తనతో సమానుల యందు స్నేహభావం, తనకంటె తక్కువ వారియందు దయ, మిగిలిన సమస్త ప్రాణులందు సమభావం కలిగి వర్తించే వానిని సర్వాంతర్యామి అయిన భగవంతుడు కరుణిస్తాడు. భగవంతుడు కరుణిస్తే మానవుడు ప్రాకృత గుణాలనుండి విముక్తుడై లింగ శరీరాన్ని విడిచి బ్రహ్మానందాన్ని పొందుతాడు.

భగవంతునకు స్వపర భేదం లేదు. కర్మలకు లోబడి జీవులు స్వతంత్రత లేనివారై ధూళికణాలు గాలిని అనుసరించిన విధంగా భగవంతుని అనుసరిస్తారు. సర్వేశ్వరుడు కర్మసాక్షి. ఆయనను *కొందరు 'స్వభావం' అంటారు. కొందరు 'కర్మం' అంటారు. కొందరు 'కాలం' అంటారు. మరి కొందరు 'దైవం' అంటారు.*

***

*ధ్రువుడు చేరిన విష్ణుపదం తన కాంతిచేత మూడులోకాలను వెలిగిస్తున్నది. శాంత స్వభావులు, సమదర్శనులు, పవిత్రులు, సర్వ జీవులను సంతోషపరిచేవారు, విష్ణుభక్తులు ఆ స్థానాన్ని పొందగలుగుతారు.*

చెడ్డ కొడుకువల్ల జనులకు అపకీర్తి, అధర్మం, అందరితో విరోధం, మనోవ్యథ కలుగుతాయి. అటువంటి పుత్రుడిపై వ్యామోహం విడువలేని వాని యిల్లు దుఃఖానికి నెలవవుతుంది. శోకం కలిగించే పుత్రునివల్ల అనేక కష్టాలు సంభవిస్తాయి. అప్పుడు కన్నతండ్రి గృహాన్ని కూడా విడిచిపెట్టి పోతాడు.

పురుషులు త్రికరణ శుద్ధిగా ఆచరించే ధర్మం లోకాల దుఃఖాన్ని తొలగిస్తుంది. నిష్కాములైనవారికి మోక్షాన్ని ఇస్తుంది. అలాంటి ధర్మం ప్రజలకు మేలు కలిగిస్తుంది. ధర్మం నశించినట్లయితే సంపదలు రాజుని విడిచి పెడతాయి. ఏ రాజు దేశంలో తగిన ధర్మాలను నిర్వర్తించే ప్రజలచేత పూజింపబడతాడో ఆరాజుకు సర్వ సుఖాలు కలుగుతాయి.

సుప్రసిద్ధులైనా గొప్పవారు నిర్మల మనస్సు, లజ్జాభిమానాలు కలిగి ఉంటారు. ఉదాత్త చిత్తులైనవారు ఆత్మస్తుతిని, పరనిందలనూ అసహ్యించుకుంటారు.

భగవంతుని మహిమోపేతమైన మాయచేత మోహం పొందిన మనస్సుగల సామాన్యులకు హరిభక్తుల చర్యలు తెలుసుకోవటం సాధ్యం కాదు. అటువంటప్పుడు వారు శ్రీహరి చర్యలను ఎలా తెలుసుకొన గలరు. పువ్వులు కందిపోకుండా లోపల తేనెను మృదువుగా త్రాగే తుమ్మెదలాగ పండితుడైన మానవుడు దేనిని నొప్పించకుండా అన్నిటి నుండి సారాంశాన్ని నేర్పుగా గ్రహిస్తాడు.

***

*పృథుచక్రవర్తి తనకు దర్శన మిచ్చిన శ్రీహరితో ఇలా అన్నాడు:*

సర్వజగదీశ్వరి అయిన ఇందిరాదేవి కల్యాణకరమైన నీ సత్కీర్తిని వరించింది. ఓ పరమపురుషా నిన్ను నేను లక్ష్మీదేవివలె సేవిస్తాను. లక్ష్మీదేవి, నేనూ ఒకే విషయం కోరి పోటీపడుతున్నాం. మాకు కలహం కలిగినా కలగనీ. సంతోషమే. జగన్మాత అయిన లక్ష్మీదేవితో నాకు వివాదం తప్పదు. నీవు దయామయుడవు, దీనవత్సలుడవు, భక్తరంజనుడవు. కాబట్టి నన్ను తప్పక లక్ష్మీదేవి కంటే ఎక్కువగా ఆదరిస్తావు.

ప్రజలను రక్షించడం రాజులకు పరమ ధర్మం. ప్రజలు చేయు పుణ్యంలో రాజులకు ఆరో వంతు లభిస్తుంది. ప్రజలను రక్షింపని రాజుల పుణ్యాన్ని ప్రజలు అపహరిస్తారు. ఆ ప్రజల పాపాన్ని రాజు అనుభవిస్తాడు. ప్రజలను ధర్మమార్గాన పరిపాలించక అర్థకాంక్షతో ప్రజల నుండి పన్నులు గుంజుకొనే రాజునకు ప్రజల పాపం సంక్రమిస్తుంది.

అందుచేత ఆ రాజు తేజోవిహీనుడై నశిస్తాడు. కాబట్టి ప్రజలు రాజు మేలు కొరకూ, తమ మేలు కొరకూ అసూయను వదలిపెట్టి ధర్మాన్ని ఎల్లప్పుడూ ఆచరించాలి.

*మనువు, ధ్రువుడు, ప్రహ్లాదుడు, బలి చక్రవర్తి* మొదలైన భాగవతులకు వాసుదేవుడు ప్రత్యక్షమై కోరిన వరాలను ప్రసాదించాడు. పుణ్యలోకాలనూ, పరమపదమైన మోక్షాన్నీ అనుగ్రహించాడు. ఇటువంటి పెద్దల అనుభవాలనుబట్టి చూస్తే భగవంతుడు లేడనడం నిజం కాదు.

గొప్ప తపస్సంపన్నులైన మహర్షులను పూజించడం వల్ల ప్రాప్తించిన శ్రీహరి పాదసేవ ఆయన పాదపద్మాల నుండి పుట్టిన పవిత్ర గంగానది వలె జన్మ జన్మాంతరాలలో చేసిన పాపాలనూ, సంసార తాపాలను పూర్తిగా పోగొడుతుంది. మనస్సులోని చెడు ఆలోచనలను తుడిచి పెడుతుంది.

***

*భక్తితో భగవంతుడైన నారాయణుడి పాదపద్మాలను ఎల్లప్పుడూ ఆశ్రయించుకొన్నవానికి సమస్త దోషాలు తొలగిపోతాయి. గొప్ప వైరాగ్యం ప్రాప్తిస్తుంది. జ్ఞానము, ధైర్యము, శక్తి లభిస్తాయి. అటువంటివాడు సంసార దుఃఖాన్ని పొందడు.*

ఈ జగత్తు అనే కారణానికి విష్ణువు కారణం. ఆయన భగవంతుడు, పరమేశ్వరుడు. అందువలన ప్రతి ఒక్కరు తమతమ శక్తికి

తగినట్లుగా త్రికరణశుద్ధి, నిష్కపటమైన బుద్ధి కలవారై ఆ దేవదేవుని పాదపద్మాలను సేవించ వలెను.

అద్దంలో ప్రతిబింబించే ఆభరణముల వలె ఈ విశ్వమంతా వేదాలలో ప్రకాశిస్తుంది. సనాతనమైనది, కళంకం లేనిది, నాశనం లేనిది అయిన ఈ వేదాలను అధ్యయనం చేసే వేద పండితులను గౌరవించేవారి సర్వపాపాలు నశిస్తాయి. సమస్త సద్గుణాలు లభిస్తాయి.

హిరణ్యకశిపుడు శ్రీహరిని నిందించి నరకాన్ని పొందడానికి అర్హుడయ్యాడు. కాని విష్ణుభక్తుడు, సుగుణయుక్తుడు అయిన కొడుకు ప్రహ్లాదుని ప్రభావం చేత పాపాలన్నీ తొలగి నరకానికి పోకుండా మిక్కిలి యశస్సును పొందాడు.

లోకంలో శివుడు, విష్ణువు, వారి భక్తులైన సజ్జనులూ ఎవరిని అనుగ్రహిస్తారో వారికి భూలోకంలో కాని, స్వర్గలోకంలో కాని సాధింపరాని కార్యాలు ఉండవు.

ఎవని గృహములోని ధాన్యము, జలము, స్థలము, సేవకులు పూజ్యులైన వారి సేవకు ఉపయోగ పడతాయో ఆ గృహస్థు పేదవాడు అయినప్పటికీ పరమ ధన్యుడైన భాగ్యవంతుడే.

పరమ పవిత్రులైన భగవద్భక్తుల పాదజలం సోకనివాని గృహం ఎంతటి సిరిసంపదలు తులతూగుతున్నా అది పాములు చుట్టుకున్న చెట్టువలె భయం కలిగిస్తుంది అని పండితులు చెబుతారు.

సూర్యుడు భూమినుంచి నీటిని గ్రహించి అవసర మైనప్పుడు వర్షించు విధంగా పృథుచక్రవర్తి ప్రజలనుండి పన్నులు గ్రహిస్తూ, అవసర మైనప్పుడు తిరిగి ప్రజలకు దానరూపంలో పంచి ఇచ్చేవాడు.

***

*పృథుచక్రవర్తి:*

శ్రీహరివలె జితేంద్రియుడు. రుద్రునివలె ప్రతాపం కలవాడు. అగ్నివలె తేజస్సు కలవాడు. భూమివలె ఓర్పు కలవాడు. సముద్రంవలె గంభీరుడు. మేరుపర్వతంవలె ధీరుడు. యమునివలె శాసించేవాడు. కుబేరునివలె ధనవంతుడు. వాయువువలె బలము కలవాడు. మన్మథునివలె సుందరుడు. బ్రాహ్మణులయందు భక్తి గలవాడు. పరోపకారపాయణుడు. ఈ విధంగా సకల లోకపాలకుల సుగుణాలను తన వశం చేసుకున్నాడు.

***

*ప్రచేతనులు రుద్రుని చూశారు:*

శంకరుడు దేవతలలో అగ్రగణ్యుడు. కారుణ్య సముద్రుడు. మేలిమి బంగారుఛాయ గలవాడు. నుదుట కన్నుగలవాడు. ప్రసన్నవదనం కలవాడు. సనకాది యోగివర్యులచే స్తుతింపబడు తున్నవాడు. ఎల్లపుడు భక్తులను వెంబడించువాడు. సజ్జనులకు సంపదలు అనుగ్రహించేవాడు. శంకరుడు భగవంతుడు. సకల ధర్మములు ఎరిగినవాడు. భక్తులయందు వాత్సల్యము కలవాడు.

దయామయుడు. దర్శనమాత్రంతో అన్నిపాపాలనూ తొలగించువాడు. శ్రీహరి పాదపద్మాలను సేవించేవారు శివునికి మిక్కిలి ఇష్టులు.

పెక్కు జన్మలలో స్వధర్మాన్ని ఆచరించిన పుణ్యంచేత పురుషుడు బ్రహ్మత్వం పొందుతాడు. అంతకంటె ఎక్కువ పుణ్యం చేసినవాడు నన్ను పొందుతాడు. బ్రహ్మాది దేవతలు అధికారాంతంలో పొందే విష్ణుపదాన్ని హరిభక్తుడు తనంత తానే పొందగలడు.

***

*బ్రహ్మదేవుడు తన పుత్రులు సనకసనందాదులు వింటుండగా శ్రీహరిని ఇలా స్తుతించాడు:*

నీవు విశ్వమంతటా నిండినవాడవు. నిర్వికారుడవు. కర్మముల నుండి దాటించువాడవు. వేద సంరక్షకుడవు. స్వయంగా ప్రకాశిస్తావు. స్వర్గాన్ని, మోక్షాన్ని పొందడానికి నీవే సాధనం. ధర్మరక్షకుడవు. మంచివారికి హితమైన ఫలాలను ప్రసాదిస్తావు. నీవు శిష్టరక్షకుడవు దుష్టశిక్షకుడవు. నీవు సర్వధర్మ స్వరూపుడవు. నీకు నమస్కారం.

ప్రభూ! ఆత్మ పరిశుద్ధిని కోరేవారికి నీ దివ్యమూర్తి ధ్యానింపదగినది. స్వర్గాధిపతికి కూడా నీవు కోరదగినవాడవే. నీవు భక్తులకు సులభుడవు. దుష్టులకు దుర్లభుడవు. ఆత్మ దర్శకులు నిన్ను తప్పక పొందగలరు. నిన్ను పూజించువాడు నిన్ను వదలలేడు. భక్తియోగంచేత నీ పాదపద్మాలను ఆశ్రయించినవాడు యముడికి కూడా భయపడడు. మరచిపోయి కూడా మరొక్కటి కోరుకోనడు.

ప్రాణులయందు దయగలవారూ, రాగద్వేషాలు లేని మనస్సు కలవారూ, కపటం లేనివారూ అయిన సద్భక్తుల సహవాసాన్ని కలుగచేసి మమ్ములను అనుగ్రహించు. సత్పురుష స్నేహం వలన కలిగిన భక్తియోగంచేత పరిశుద్ధుడయినవాని మనస్సు అస్థిరమైన బాహ్య విషయాలలో చిక్కుకొనదు.

దేని లోపల ఈ విశ్వం ప్రకాశిస్తుందో, ఈ విశ్వం లోపల ఏది ప్రకాశిస్తుందో అటువంటి స్వయంప్రకాశము, శాశ్వతము అయిన ఆత్మతత్త్వమే పరబ్రహ్మం. ఆ పరబ్రహ్మం వికారం లేనిది.

***

*పురంజనుడు:*

ప్రేమమూర్తి అయిన తల్లిగాని, అనుకూలవతి అయిన భార్యగాని లేని యింటిలో నివసించడం చక్రాలు లేని రథంపై కూర్చోవటం వంటిది.

| | |
|---|---|
| పంచారామములు | - శబ్దం, స్పర్శం, రూపం, రసం, గంధం అనే పంచేద్రియార్థములు |
| నవ ద్వారాలు | - ముక్కు మొదలైన తొమ్మిది రంధ్రాలు |
| ఏకపాలము | - ప్రాణము |
| త్రికోష్ఠాలు | - భూమి, నీరు, అగ్ని |
| షట్కులములు | - నాలుక, కన్ను, చెవి, ముక్కు, చర్మం, మనస్సు అనే జ్ఞానేంద్రియాలు |

విపణములు - వాక్కు, హస్తము, పాదము, పాయువు, ఉపస్థ అనే కర్మేంద్రియాలు

పంచ ప్రకృతి - పృథివి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం అనే పంచభూతాలు

కామిని - బుద్ధి

***

పురుషుడు తాను స్వయంప్రకాశుడని, ప్రకృతి కంటె వేరైన పరమాత్ముడని తెలుసుకోలేక ప్రకృతి గుణాలలో ఆసక్తుడయితే, కర్మవశుడై త్రిగుణాలకు సంబంధించిన కర్మలలో మునిగిన తేలుతూ ఉంటాడు. సాత్విక కర్మలవల్ల ప్రకాశ భూయిష్ఠముల్లైన లోకాలను, రాజస కర్మలవల్ల దుఃఖ భూయిష్టముల్లైన లోకాలను, తామస కర్మలవల్ల శోక మోహ భూయిష్టముల్లైన లోకాలను పొందుతాడు. ఈ విధంగా కామాసక్తుడైన పురుషుడు పుట్టుతూ, చస్తూ, మళ్ళీ పుట్టుతూ ఉన్నత స్థానాలను, నీచ స్థానాలను పొందుతూ ఉంటాడు.

బరువు మోసే నిరుపేదవాడు తలమీద బరువును భుజం మీదకు మార్చుకున్నప్పటికీ దాన్ని మోయటం వల్ల కలిగే దుఃఖాన్ని తప్పించుకోలేడు. అలాగే జీవుడు దైవికంగా ప్రాప్తించిన దుఃఖాలను మూడు లోకాల్లోను తప్పించుకోలేడు.

***

*నారదుడు ప్రాచీనబర్హికి చేసిన తత్త్వబోధ:*

భగవంతుని గుణాలను కీర్తించడంచేత, వినటంచేత పరిశుద్ధమైన మనస్సు కలిగిన భక్తుల సభలకు వెళ్ళి అక్కడ హరికథామృత ప్రవాహాన్ని చెవులనే దోసిళ్ళతో తనివితీరా త్రాగేవారికి ఆకలి, దాహము, భయము, శోకము, విమోహము సోకవు.

భగవంతుడిపై బుద్ధిని నిలుపగలిగేదే విద్య. హరియే దేహులకు ఆత్మ. హరియే పరమాత్మ. భద్రతను కోరేవారికి హరిపాదములే శరణము. హరిని పరమ ప్రియునిగా భావించి కొలిచే వారికి అవంతయైనా దుఃఖం కలుగదు. భగవంతుని నిజ స్వరూపాన్ని తెలుసుకున్నవాడే విద్వాంసుడు. అతడే గురువు. అతడే హరి.

శుద్ధ సత్త్వగుణం కలిగి వాసుదేవుని ఉత్తమ గుణాలను ధ్యానించడంలో నిమగ్నమైన మనస్సులో గ్రహణం నాడు చంద్రమండలంలో రాహువు కన్పించినట్లు ప్రపంచం సర్వమూ కనిపిస్తుంది.

లింగశరీరాన్ని ఆశ్రయించి చైతన్యాన్ని కలిగించే పురుషుడు జీవుడు అని చెప్పబడతాడు. పురుషుడు ఆ లింగశరీరంచేత ఒక దేహాన్ని విడిచి, మరొక దేహాన్ని పొందుతూ, తిరిగి దానిని విడిచిపెడుతూ సుఖ, దుఃఖ, భయ, మోహ, శోకాలను ఈ లింగశరీరం చేతనే అనుభవిస్తాడు.

జీవుడు కొంతకాలం బ్రతికి చనిపోతూ, మరొక దేహం పొందిన తరువాతనే పూర్వదేహాన్ని విడిచిపెడతాడు. మనస్సు జన్మకు హేతువు. ఈ జగమంతా వాసుదేవాత్మకమని తలపోసి ఈశ్వరుడైన వాసుదేవుని సేవిస్తే లింగశరీరం నుండి ముక్తి లభిస్తుంది.

***

*ప్రచేతసులకు శ్రీహరి ప్రత్యక్షం:*

శ్రీహరి మేరుపర్వత శిఖరంపై నల్లని మేఘం వలె గరుడుని మూపుపై కూర్చున్నాడు. తన శరీరకాంతులతో నలు దిక్కుల వ్యాపించిన చీకటిని తొలగిస్తున్నాడు. నవరత్నమయమైన కిరీటాన్ని ధరించాడు. కౌస్తుభమణి కంఠంలో వేలాడుతున్నది, బంగారు వలువలు కట్టుకున్నాడు. ముత్యాల హారాలు, భుజకీర్తులు, కడియాలు, అందెలు ధరించాడు. దేవతలు, మునీశ్వరులు, అష్టాయుధములు సేవకులై కొలుస్తున్నారు.

కమలనాభా! నీవు సంసార దుఃఖాన్ని హరిస్తావు. నీవు సర్వానికి నాథుడవు. పసుపు పచ్చని రంగుగల బంగారు రంగు వస్త్రాన్ని ధరిస్తావు. నీవు సృష్టికర్తవు. నీవు సుగుణవంతుడవు. రాక్షసులను సంహరిస్తావు. నీకు నమస్కారం.

నీ మాయకు చిక్కి మేము కర్మ మార్గంలో ఎంత కాలం తిరుగుతూ ఉంటామో, అది ఎన్ని జన్మలు అయినా సరే, అంతవరకూ మాకు నీ భక్తులతో సహవాసాన్ని తప్పక సమకూర్చు.

స్వామీ! నీవు అందరియందు సముడవు. ఆదిపురుషుడవు. రాగద్వేషాలు లేని పరిశుద్ధుడవు. వాసుదేవుడవు. సత్యమూర్తివి. భగవంతుడవు. నీవు జగన్మోహనాకారుడవు. సర్వ లోకాలకు మేలు చేసేవాడవు. సాటిలేని సుగుణాలతో ఒప్పేవాడవు. స్వచ్ఛమైన ఆనందాన్ని అందించేవాడవు. భయంకరమైన రాక్షసులను సంహరించిన వాడవు. నీకు నమస్కారం.

దేవదేవుడైన గోవిందుని సేవించెడి జన్మయే జన్మ. అదే కర్మ. అదే ఆయుస్సు. అదే మనస్సు. అదే వాక్కు. హరిని సేవించని జన్మ, దీర్ఘాయువు వృథా. ఉపనయనం మొదలైన సంస్కారాలు, వేద కర్మలు ఆచరించడము వలన ప్రయోజనం లేదు. జపం, తపం, పాండిత్యం మొదలైనవి అన్నీ నిష్ఫలములు.

చెట్టు మొదలులో నీళ్ళు పోస్తే కొమ్మలకూ, రెమ్మలకూ, పత్ర పుష్పములకూ పుష్టి కలుగుతుంది. అలాగే శ్రీహరిని పూజిస్తే సర్వేంద్రియాలకూ తృప్తి కలుగుతుంది. శ్రీహరిని సేవిస్తే సర్వభూతాలనూ సేవించినట్లే. వర్షాకాలంలో మేఘాల నుండి కురిసిన నీరు తిరిగి గ్రీష్మ కాలంలో సూర్యుడి కిరణాలవల్ల ఆవిరై సూర్యుడిలో లయమైనట్లు, పుడమి యందు జన్మించిన చరాచర భూతాలు తిరిగి పుడమి యందే అణగి పోయినట్లు, శ్రీహరి నుండి పుట్టిన మహా విశ్వం తిరిగి శ్రీహరి లోనే లయమవుతుంది.

# పంచమ స్కంధము

*ప్రార్థన:*

సంపదలను ప్రసాదించేవాడవు, దయకు సముద్రంవంటి వాడవు, లక్ష్మీదేవిని గృహలక్ష్మిగా కలవాడవు, పవిత్రమైన చరిత్ర కలవాడవు, అన్ని సద్గుణాలకు ఆశ్రయం అయినవాడవు, ఆలమందలను విస్తరింపచేసేవాడవు, నందగోపుని కుమారుడవు అయిన కృష్ణా! నీకు ప్రణామములు.

***

*శుకయోగి పరీక్షిత్తుతో:*

విష్ణుమూర్తి పాదపద్మాలలోని మకరందరస పానంలో లీనమై పరవశించిన మనసు కలిగిన మనుష్యుడు, ఒకవేళ ఆటంకాలు అడ్డుతగిలినా పూర్వ మార్గాన్ని సుతరామూ వదిలి పెట్టడు.

***

*బ్రహ్మ దేవుడు స్వాయంభువ మనువు కుమారుడు ప్రియవ్రతునితో:*

శ్రీహరి ఆజ్ఞానుసారం జీవుడు తపస్సు చేయడం, విద్యలు నేర్చుకోవడం, శౌర్యాన్ని ప్రదర్శించడం, జ్ఞానాన్ని ఆర్జించడం, ఆర్థిక వనరులు సమకూర్చుకోవడం, ధర్మం పాటించడం వంటి కర్మలు చేస్తాడు. ఆ కర్మాదులకు కర్త దేవుడు అంతేగాని జీవుడు కాదు. అలాంటప్పుడు వీటి నుండి ఎవడైనా తప్పుకోవడంగానీ, వేరేవాడిని తప్పించడంగానీ శక్యంగాని పని. పుట్టడానికి, చావడానికి, భయానికి,

సుఖానికి, దుఃఖానికి, అన్నింటికీ కర్త ఈశ్వరుడు, జీవుడు కానే కాదు. శ్రీహరి వాక్కులే వేదాలు.

***

*నాభి మేరుదేవి దంపతుల కుమారుడు, శ్రీహరి అవతారము అయిన 'ఋషభుడు' తన పుత్రులకు చేసిన ధర్మబోధ:*

"స్వామీ! నువ్వు మా అందరిపట్ల అనుగ్రహం చూపుతున్నావు. కాలు జారినప్పుడు, కింద పడ్డప్పుడు, తుమ్మినప్పుడు, ఆవులించినప్పుడు, జ్వరంతో భాధపడుతున్నప్పుడు, చావుకు దగ్గరయినప్పుడు మా మీద మాకే అధికారం తప్పినపుడు మా పాపాలను పోగొట్టే నీ దివ్యనామాలు మా నోటివెంట వెడలునట్లు అనుగ్రహించు!"

వీడు విరోధి, వీడు స్నేహితుడు – అనే భేధభావం లేకుండా సమదృష్టికలవారు, శాంతస్వభావులు, ఏమాత్రం కోపం లేనివారు, సమస్త జీవులపట్ల పరమకారుణ్యస్వభావం కలవారు, కపటం లేనివారు, మహాత్ములని పిలువబడతారు. అలాంటి మహానుభావులకు భగవంతునియందు పరిపూర్ణ విశ్వాసం ఉంటుంది.

ఇంద్రియ సుఖాలకు లోనయినవాడు పనికిరాని పాడుపనులు చేస్తుంటాడు. చెడ్డపనులు చేసేవాడు పాపం కొని తెచ్చుకుంటాడు. దుఃఖకారణమయిన దేహాన్ని మోస్తుంటాడు. అందువల్ల మీరు పాపాలకు మూలమయిన కోరికలను కోరకండి. యథార్థ జ్ఞానం ప్రాప్తించనంత వరకూ మీకు ఆత్మతత్త్వం బోధపడదు.

సంసారికి ఇల్లన్నా, పొలాలన్నా, కొడుకులన్నా, ఆప్తులన్నా, ధనమన్నా, నేను-నాది అనే వ్యామోహం పెరుగుతుంది. స్త్రీ పురుషుల కలయిక వల్ల సంతానం కలుగుతుంది. ఆ సంతానం కోసం ఇల్లు కట్టడమో, పొలాలు కొనడమో, ధనం సంపాదించడమో జరుగుతుంది. వాటిపైన వ్యామోహం పెంచుకోవడంతో వానికి మోక్షమార్గం దూరమవుతుంది. సంసారికి ఎప్పుడు మోక్షాసక్తి కలుగుతుందో అపుడు సంసారం మీద మోహం వదలి పెడతాడు.

పరమేశ్వరుడనైన నా మీద భక్తి కలిగి ఉండడం, కోరికలు లేకపోవడం, సుఖ దుఃఖాలలో సహనం, సమస్త జీవులపట్ల సానుభూతి కలిగి ఉండడం, నన్నే దైవంగా భావించి నా గుణాలను పొగడడం, ఎవరితోనూ విరోధాభావం లేకుండడం, సమబుద్ధిని కలిగి ఉండడం, శాంతితో జీవించడం అనేవి ముక్తి మార్గాలు. యోగంతో, సాత్త్విక ప్రవృత్తితో లింగదేహాన్ని జయించి మానవుడు శాశ్వత సుఖం సంపాదించాలి.

అజ్ఞానం నుండి పుట్టిన 'హృదయ బంధన' మనే తీగను 'యోగం' అనే చురకత్తితో ధైర్యంగా తెంపివేయాలి. యోగాన్ని అనుష్ఠించే వ్యక్తి గురువైతే శిష్యులను, తండ్రి అయితే బిడ్డలను, రాజయితే ప్రజలను తాను నేర్చిన యోగ మార్గంలో పెట్టవలెనే గాని కర్మఫలాలపై ఆసక్తులను చేయకూడదు.

ప్రజలందరూ ఏవో ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకుని పనిచేస్తుంటారు. ఎల్లప్పుడూ ఐహిక ఫలాలను కోరుకుంటారు. అల్పసౌఖ్యం కోసం ఒకరిపై ఒకరు వైరం పెంచుకుంటారు. అంతులేని దుఃఖంలో మునిగిపోతారు. గురువు అనేవాడు ముందు నడిచి, అజ్ఞానులకు బోధించి, మోక్షానికి మార్గం చూపాలి.

మనస్సు చాలా చిత్రమైనది. చాలా కాలం శ్రమపడి సాధించుతున్న తపస్సునయినా అది హరిస్తుంది. అందుచేత పెద్దలు దానిని నమ్మరు. విటులను ఆకర్షించే జారిణిలాగా మనస్సు నిలకడ కోల్పోయి కామక్రోదాదులను ఆహ్వానిస్తుంది. అరిషడ్వర్గాలకు, కర్మబంధాలకు మనస్సే మూలకారణం.

కలియుగంలో అధములైన మానవులు దేవమాయవల్ల మోహితులవుతారు. శాస్త్రాలలో ప్రవచించిన ఆచారాలను వదిలిపెడతారు. ఇష్టం వచ్చినట్లు దేవతలను పరిహసిస్తారు. వేదాలను, యజ్ఞపురుషులను అనరాని మాటలంటారు. తమ అభిప్రాయాలకు తామే తెగ మురిసిపోతారు. చివరకు పతనమవుతారు.

***

*ఋషభుని కుమారుడు భరతుడు:*

పరమేశ్వరా! జీవులకు కర్మఫలాలను ప్రసాదించేవాడవు. కేవలం సంకల్ప మాత్రంతో ఈ లోకాలను సృష్టించావు. నీవే ఈ లోకాలకు అంతర్యామిగా ఉన్నావు. సమస్తలోకాలలో నిండి ప్రకృతికి అందకుండా ప్రకాశిస్తున్నావు.

ఎటువంటివారికైనా విధిని దాటడం ఏమాత్రం సాధ్యం కాదు. మహర్షులకైనా కర్మబంధం తప్పుకోవడం సాధ్యం కాదు. అటువంటప్పుడు సామాన్యుల సంగతి చెప్పేదేముంది.

అగ్ని జ్వాలలో కుండ కాలుతుంది. కాలిన కుండ కారణంగా అందులో పోసిన నీరు వేడెక్కుతుంది. ఆ నీటిలో వేసిన బియ్యపు గింజలు బాగా ఉడికి పక్వమై అన్నం సిద్ధమవుతుంది. అలాగే దేహాన్నీ ఇంద్రియాలనూ ఆశ్రయించుకొని జీవుడున్నాడు. దేహంలోనే ప్రాణం ఉంది. అందువల్ల దేహేంద్రియాలకు సంబంధించిన పాపపుణ్యాలన్నీ జీవునకు సంక్రమిస్తాయి.

మనస్సుకు ఒక సంస్కారం ఉంటుంది. ఆ సంస్కారం ధర్మ, అధర్మాల రూపంలో ఉంటుంది. ఇంద్రియ వ్యసనాలపట్ల అనురక్తి కలిగి ఉంటుంది. ఆ సంస్కారాన్ని బట్టి జీవుడు దేవతలు, జంతువులు, మానవులు అనే రూపాలను ధరిస్తాడు. దేహంలోకి మనస్సు ఆయా కాలాలలో ప్రాప్తించే సుఖ దుఃఖ ఫలాలను అనుభవిస్తూ స్థూలసూక్ష్మ రూపాల్లో ఉంటుంది. మనస్సు గుణరహితమైనప్పుడు కలుగు

అనుభవమే ముక్తి. గుణాలు, కర్మలు అసలు లేకపోతే మనస్సు అనేదే ఉండదు. కేవలం పరతత్త్వంగా మిగులుతుంది.

పూర్వజన్మలలో చేసిన కర్మలను బట్టే ఫలితాలు కలుగుతుంటాయి. ఆ ఫలితాలను మానవుడు తన శక్తి యుక్తుల వల్ల కలిగాయని భావిస్తుంటాడు. మనస్సు సంసారబంధంలో చిక్కుకొని ఉన్నంతవరకు తత్త్వయోగం నిత్యమైనది అని తెలుసుకోలేరు. మాయవల్ల సంసార బంధాలలో బంధింపబడిన జీవుడు ప్రయోజనం ఆశించిన వర్తకుని లాగా లాభాన్ని ఆశించి కర్మలు చేస్తూ ఉంటాడు.

సంసారం పెద్ద అడవి లాంటిది. ఆ అడవిలో కామం, లోభం అనే దొంగలు తిరుగుతూ ఉంటారు. ఆ దొంగలు ఇంద్రియాలను జయించలేని మనిషిని పట్టుకొని, వాడు దాచుకున్న ధర్మమనే ధనాన్ని దోచుకుంటారు. అందువలన సంసారం పట్ల కోరికలు పెంచుకోకూడదు. సంసారం అనే ఆ అడవిలో భార్య, పిల్లలు, స్నేహితులు అందరూ తోడేళ్ల వలె పురుషుణ్ణి పీక్కుతింటారు.

గృహస్థాశ్రమంలో ఉన్నవాడు ఇంద్రియ సుఖాలకు అలవాటు పడతాడు. వాడికి విశ్వమంతట ఒక గంధర్వనగరంలా కనపడుతుంది. ఆ సుఖాలన్నీ శాశ్వతమని అనుకుంటూ సంతోషపడతుంటాడు. అడవిలో రాత్రిపూట కొరివి దయ్యాన్ని చూసి ఏదో నిప్పు అని భ్రాంతితో దాని కోసం వెంట బడి తిరిగినట్లు ధనం కోసం భాగ్యవంతుల ఇళ్ళ చుట్టూ ఊరకే రాకపోకలు చేస్తూ నరుడు వ్యథలకు లోనవుతాడు. పెరుగుతున్న

కుటుంబాన్ని పోషించుకోవడం కోసం ధనం సంపాదించానే ఆరాటంలో ఎండమావుల వెంటబడి పరుగెత్తే మృగంలాగ నరుడు పరుగులు పెడుతూ తిరుగుతుంటాడు. అడవిలో పోతున్నవాడు ఒకచోట మైమరచి ఆగిపోయి, సుడిగాలివల్ల రేగిన దుమ్ము కనుల నిండాపడి చూపు తప్పి దిక్కు తెలియక మరొక దిక్కుకు పోయిన విధంగా సంసారంలో త్రోవతప్పి అక్కడక్కడే తిరుగుతుంటాడు.

కొంత ధనం సంపాదించుకున్నవాడు తాను సంపాదించుకున్న ఇల్లువాకిలితో సంతోషపడక ఇతరుల ఆస్తి కాజేయాలని ప్రయత్నం చేస్తాడు. ఈ చెడు పని వలన వాడు చివరకు చీవాట్లు తిని అవమానం పొంది ఎంతో దుఃఖాన్ని కొని తెచ్చుకొంటాడు. అంతేకాని మోక్షమంటూ ఉందనీ ఆ ముక్తి వల్ల కలిగే ఆనందం శాశ్వతమనీ తెలుసుకోలేరు.

***

*శుకమహర్షి విష్ణుమూర్తి మహిమను స్తుతించుట:*

ముల్లోకాలకు శుభం కలిగించేవాడవూ, భక్తుల హృదయాలలో నివసించేవాడవూ, వైకుంఠం నివాసంగా కలవాడవూ, భువనమోహిని అయిన లక్ష్మీదేవితో విహరించేవాడవూ, భూదేవికి ప్రియమైనవాడవూ, గోపికల హృదయాలను అపహరించిన కృష్ణా! నీకు నమస్కారం.

***

# షష్టమ అధ్యాయం

*ప్రార్థన:*

పరమహంస స్వరూపుడు, సత్త్వగుణ సంపూర్ణుడు, తాను అందరికీ ఆశ్రయమైనవాడు, సర్వాంతర్యామి, మంచిని గ్రహించేవాడు, పుణ్యలోకాలకు నాయకుడు అయిన నారాయణుడికి నమస్కారం.

సగుణ స్వరూపుడు, భక్తుల పాపాలు పోగొట్టేవాడు, సజ్జనుల హృదయాలలో నివసించేవాడు, ఆశ్రితులకు కోరిన కోరికలు తీర్చేవాడు, ఆదిశేషును పాన్పుగా చేసుకున్నవాడు, నరసింహ స్వరూపుడు, గజేంద్రుడిని కాపాడినవాడు, కొనగోటితో గోవర్ధన పర్వతం ఎత్తినవాడు, ఆదివరాహావతారుడూ అయిన శ్రీకృష్ణునికి నమస్కరిస్తున్నాను.

***

*శుకయోగీంద్రుడు పరీక్షిత్తుకు మానవుడు నరకంలో పడిపోకుండా సుఖంగా జీవించే మార్గం విశదీకరించాడు.*

*మనస్సు, వాక్కు, శరీరం* అనే *మూడింటినీ త్రికరణములు* అంటారు. ఈ మూడూ సమైక్యంగా కలిసి పనిచేయాలి. అటువంటి త్రికరణశుద్ధి లేని మానవుడు ఎన్నో పాపకర్మలు చేస్తాడు. ఆ పాపాలకు ప్రాయశ్చిత్తం చెయ్యకుండా చనిపోయిన మూర్ఖుడు నరకకూపాలలో పడి నానాబాధలు అనుభవిస్తాడు. యమకింకరుల భయంకర స్వరూపాలు కంటిముందు కన్పించక ముందే, చచ్చిపోతామనే భయం మనస్సులోనికి రాకముందే, ప్రాణశక్తి ఆరిపోకముందే,

దేహం పటుత్వాన్ని కోల్పోకముందే నిర్మలమైన మనస్సుతో పాపాలను పరిహారం చేసుకొనే మార్గం అవలంబించాలి.

తెలివైన వైద్యుడు రోగాలకు మూలకారణం కనిపెట్టి, ఆ రోగాన్ని పోగొట్టడానికి సరియైన చికిత్స చేసి, వ్యాధిని పోగొట్టిన విధంగా మానవుడు తన పాపాలకు కారణం తెలుసుకొని వీలయినంత తొందరలో ఆ పాపాన్ని పోగొట్టుకోవాలి. ఒక కర్మం మరొక కర్మం చేసినందువల్ల నిర్మూలం కాదు. తెలిసి చేసిన దుష్కర్మ దోషం తరువాత చేసిన సత్కర్మ వల్ల పరిహారం కాదు. చేసిన దుష్కర్మ ఫలం దానికి తగిన ప్రాయశ్చిత్తం చేసి నప్పుడు మాత్రమే నశిస్తుంది. అంటే ఒక కర్మం మరొక కర్మం చేయడం వల్ల నాశనం కాదు.

పెద్దల ఉపదేశానుసారం సత్కర్మలు ఆచరించినవాడు నిర్మల హృదయం కలిగి, పాపాలన్నింటినీ పటాపంచలు చేసి, ప్రశాంత జీవనం గడుపుతాడు. శ్రీహరిపై భక్తి పాపాత్ముడి పాపాలను పారద్రోలి అతడికి మోక్షాన్ని ప్రసాదిస్తుంది. విష్ణుభక్తి వల్ల సంప్రాప్తించే సుస్థిరమైన కైవల్యపదం తపస్సుల వల్లగాని, నియమాల వల్లగాని, ఇంద్రియ నిగ్రహం వల్లగాని, సత్యపరిపాలన వల్లగాని, దానధర్మాల వల్లగాని, యజ్ఞాలు చేయడం వల్లగాని లభింపదు. ఎన్ని పుణ్యాలు చేసినా హరిభక్తి లేకుంటే ఉపయోగం లేదు. ఎన్ని నదులు కలిసినా మద్యపాత్రను పవిత్రం చేయలేనట్లు, ఎన్ని పుణ్యాలు చేసినా హరిభక్తి లేని పాపాత్ముడైన నరుణ్ణి పవిత్రుణ్ణి చేయలేవు.

*యమదూతలు విష్ణుదూతలకు పుణ్యలక్షణాలు పాప స్వరూపాన్ని వివరించుట:*

వేదాలలో ఏది కర్తవ్యమని చెప్పబడిందో అదే అందరికీ ఆమోద్యయోగ్యమైన ధర్మం. అంతకంటే వేరైనది అధర్మం. వేదం సాక్షాత్తూ నారాయణ స్వరూపం.

ఎవని వలన సత్త్వరజస్తమో గుణములైన జీవులు ఏర్పడుతున్నారో; ఎవని వలన ఈ జీవులు తమకు అనుగుణమైన గుణాలను, నామాలను, ప్రవర్తనలను, ఆకారాలను పొందుతున్నారో; ఎవని వలన ఈ విషయం తెలియబడుతున్నదో ఆ నారాయణు డంతర్యామియై సర్వప్రాణులందూ నిండి ఉన్నాడు. *సూర్యుడు, అగ్ని, ఆకాశం, వాయువు, భూమి, చంద్రుడు, సంధ్యలు, పగళ్ళు, రాత్రుళ్ళు, కాలం ఇవన్నీ జీవుల సర్వకర్మలకు సాక్షులు.*

దేహి అయిన ప్రతీ జీవీ కర్మ చేయకుండా ఉండలేడు. విధివిహితములైన కర్మలు తప్పక చేయవలసినదే కాని చేయవలసిన కర్మలు కాకుండా, కావలెనని కోరి మరికొన్ని కర్మలను చేస్తారు. జీవుడు ఈ జన్మలో ప్రస్తుతం తాను ఎంత సుకృతం చేస్తాడో, ఎంత దుష్కృతం చేస్తాడో ఆ పుణ్యపాపాల పరిమాణాన్ని అనుసరించే భవిష్యత్తులో ఫలితాలు ప్రాప్తిస్తాయి. ఆ జన్మలో ఆ ఫలితాలను ఆ జీవుడు తప్పనిసరిగా అనుభవిస్తాడు.

ఈ లోకంలో ప్రాణులు గుణత్రయ సంబంధం చేత శాంతస్వభావులు, ఘోరస్వభావులు, మూఢస్వభావులు అని మూడు విధాలుగా ఉంటారు. శాంతస్వభావులు ధర్మమార్గంలో ప్రవర్తిస్తూ సుఖపడతారు. ఘోరస్వభావులు కూడని మార్గాల్లో నడిచి నానా కష్టాల పాలవుతారు. మూడస్వభావులు కొంత మంచిగా, కొంత చెడుగా ప్రవర్తించి సుఖ దుఃఖాలను కొని తెచ్చుకుంటారు. వారి ప్రవర్తనలకు అనుగుణంగానే వారికి రాబోవు జన్మలు ప్రాప్తిస్తాయి.

ధర్మస్వరూపుడైన యముడు సమస్తజీవులలో అంతర్యామిగా ఉంటాడు. విశేష దృష్టితో గమనిస్తూ వాటికి అనురూపమైన మార్గాలను కల్పిస్తాడు. పట్టుపురుగు తన నోటిలో నుండి వచ్చిన దారంతోనే తన చుట్టూ గూడు అల్లుకొని దానిలో నుండి బయటపడే మార్గం లేక నశించినట్లే జీవుడు తను స్వయంగా ఏర్పరచుకొన్న కర్మబంధాలలో చిక్కి స్రుక్కి సురిగి పోతున్నాడు. సంసార కారణమైన ప్రకృతి నుండి తప్పించుకోవాలంటే పరమేశ్వరుడి సేవ తప్ప మరో మార్గం లేదు.

***

*విష్ణుదూతలు యమదూతలతో:*

స్నేహభావంతో వచ్చి, హృదయం ఇచ్చి, తనకు బాగా నచ్చి, తనను మెచ్చి నమ్ముకున్న వ్యక్తికి దయాదాక్షిణ్యాలు గల బుద్ధిమంతుడు ఏమాత్రం ఆలోచించకుండా అపకారం చేస్తాడా?

హరినామ కీర్తనలు మహాపాప రూపమైన చీకట్లను పోగొట్టే సూర్యకిరణాలు. దేవతలకు కూడా దొరకని మోక్షసామ్రాజ్య విలాసాలు. వాసుదేవుని నామం కంటే వాంఛనీయమైనది మరేమున్నది? అది అన్ని పుణ్యమార్గాలకూ నిలయం. అఖిల మునీంద్రుల అంతరంగాలనే సరోవరాలే దానికి ఆలయం. అటువంటి పరమ పురుషుని నామం స్మరించేవాని గొప్పతనం చెప్పతరమా?

ఈ అజామిళుడు చనిపోయే ముందు 'నారాయణ' నామాన్ని ఉచ్చరించాడు. భగవంతుని పేరును ఏ విధంగా పలికినప్పటికీ వాసుదేవుడు రక్షకుడై అందులో ఉండనే ఉంటాడు.

నేల మీద తూలి కూలి పడినప్పుడు గాని, దెబ్బలు తిని దుఃఖ పడినప్పుడు గాని, భయంకరమైన జ్వరాలతో బాధ పడుతున్నప్పుడు గాని, పాము మొదలైన విషజంతువుల బారిని పడ్డపుడు గాని, ఆర్తితో అలమటించినపుడు గాని 'అమ్మో! బాబో!' అనకుండా ఆ వాసుదేవుని నామం ఒక్కసారి ఉచ్చరించితే చాలు, అటువంటి వారికి ఎటువంటి యమబాధలూ ఉండవు. సంసార దుఃఖాలు దరిజేరవు.

మహానుభావులైన మునులు  చిన్న పెద్ద పాపాలకు రకరకాల ప్రాయశ్చిత్తాలు నిర్ణయించారు. కాని ఆ ప్రాయశ్చిత్తాలవల్ల ఆ పాపాలు తాత్కాలికంగా ఉపశమిస్తాయి తప్ప పూర్తిగా పరిహారం కావు. భగవంతుని సేవ ఒక్కటే పాపాలన్నింటినీ పూర్తిగా పటాపంచలు చేసి మనస్సును పరిశుద్ధం చేస్తుంది.

సారవంతమైన ఔషదం తెలియకుండా సేవించినా దాని గుణం వృథాగా పోదు. దాని ప్రభావం చూపించి రోగాన్ని పోగొడుతుంది. అదే విధంగా భగవంతుని నామం తెలియక పలికినా, విరోధభావంతో పలికినా దాని ప్రభావం ఊరకే పోదు.

అంత్యకాలం సమీపించి ధైర్యం సన్నగిల్లినప్పుడు ఏదో పూర్వజన్మ విశేషం ఉంటేనేగాని పరాత్పరుడు మనస్సులోకి రాడు. మరణకాలంలో మతి తప్పినప్పుడు పురాకృత సుకృతం ఉంటేనేగాని నారాయణ నామస్మరణన చేసే భాగ్యం ప్రాప్తించదు.

హరిభక్తులతో మాట్లాడే మాటలు ఎన్నటికీ చెడని పుణ్యధనాల మూటలు, మోక్షలక్ష్మి విహరించే పూలతోటలు, ఆరుగురు శత్రువర్గాలకు ప్రవేశింపరాని అద్భుతమైన కోటలు.

***

*దక్ష ప్రజాపతి చేసిన యజ్ఞానికి మెచ్చి శ్రీహరి ప్రత్యక్షమై ఇలా అన్నాడు:*

నీవు సృష్టి చేయాలనే కోరికతో నన్ను గురించి తపస్సు చేశావు. ప్రజాపతీ, విను. బ్రహ్మదేవుడు, శివుడు, ప్రజాపతులు, మనువులు, ఇంద్రులు మొదలైన సమస్త భూతజాలాలు నా వల్ల జన్మించిన వారే. ఇంద్రియ నిగ్రహం, నియమం, సంధ్యావందనం మొదలైన వాటితో కూడిన తపస్సు నా హృదయం. యజ్ఞాలు నా అవయవాలు. ధర్మమే నా ఆత్మ. వేదమే నా స్వరూపం. 'అసక్ని' అనే పేరుగల ఈ కన్యను నీకు ఇస్తున్నాను. నీవు ఈమెన భార్యగా స్వీకరించు. ప్రజలను సృష్టించు.

ప్రజలందరూ నా మాయచే మోహితులై ధాంపత్య ధర్మాన్ని అవలంభించి ప్రజావృద్ధి కావించి నన్ను సేవింపగలరు.

***

*నారదుని ప్రభోదవాక్యాలు విని దక్షప్రజాపతి కుమారులు హర్యశ్వులు ఇలా తర్కించుకుంటారు.*

ఈ సమస్త లోకాలకూ మూలకారణమైన భగవంతుడు ఒకడున్నాడు. ఆయన సర్వేశ్వరుడు. పుట్టుక లేనివాడు. ఆత్మాశ్రయుడు. పురుషోత్తముడు. అటువంటి అంతర్యామి అయిన స్వామిని దర్శింప లేనిచో బ్రహ్మదేవునికైనా మోక్షం లభించదు.

ఈ లోకంలో జీవుడు సంసారమనే పాతాళ కూపంలో కూరుకొని పోయి గిలగిలలాడుతున్నాడు. ఈ సంసార బంధం నుండి బయట పడకుండా అతడు పరబ్రహ్మ స్వరూపాన్ని ఎట్లా గుర్తించ గలుగుతాడు? కర్మలు ఆచరించడం వల్ల స్వర్గఫలాలు ప్రాప్తిస్తాయి. కాని కైవల్యం చేకూరదు.

సంసారబంధంలో చిక్కుకున్న వారికి మోక్షాన్ని అనుసంధానం చేసేది అధ్యాత్మిక విధ్య. అటువంటి పరతత్త్వ విద్యను పరిత్యజించి కర్మకలాపంలో పడిన జ్ఞానవిహీనుడైన అభాగ్యునికి శుభం కలుగదు.

కాలచక్రం చాలా శక్తివంతమైనది. ఈ సమస్త జగత్తునూ చుట్టచుట్టి పట్టుకొని సున్న చుట్టి మటుమాయం చేయగల కిటుకులు

దానికి తెలుసు. అటువంటి కాలస్వరూపం తెలుసుకోకుండా ఊరకే కర్మలు చేస్తూ కూర్చుంటే వానికి అక్షయమైన మోక్షపదం దొరకదు.

***

*బృహస్పతి దేవేంద్రునిపై కోపించి వెళ్ళిపోవడంతో దేవతలు తమకు పౌరోహిత్యం వహించమని విశ్వరూపుని ప్రార్థిస్తారు.*

గురువు పరమాత్మ స్వరూపుడు. తండ్రి బ్రహ్మ స్వరూపుడు. అన్న దేవేంద్ర స్వరూపుడు. తల్లి భూదేవి స్వరూపం. సోదరి దయాస్వరూపిణి. అభ్యాగతుడు అగ్ని స్వరూపం. సర్వప్రాణులూ భగవంతుని స్వరూపం. నీ తపోమహిమతో పితృజనులమైన మమ్ములను కాపాడు. బ్రహ్మనిష్ఠుడవైన నిన్ను మా గురువుగా స్వీకరిస్తున్నాము.

***

*మునిశ్రేష్ఠుడైన విశ్వరూపుడు దేవతలతో:*

మీ ప్రార్థన ధర్మ విరుద్ధం. ఒక తపస్విని పౌరోహిత్యం వహించమని మీ వంటి పెద్దలు తీయని పలుకులతో పొగడడం సరికాదు. గురువులకు వేరుగా ధనాన్ని కూడబెట్టవలసిన అవుసరం దేనికి? గురువు దగ్గర శిక్షణ పొంది మంత్రకోవిదులై ధర్మనిరతులైన శిష్యులే వారికి కూడబెట్టిన ధనం. దానికి మించిన ధనం గురువులకు వేరే ఏముంటుంది? స్వార్థం, వంచన లేకుండా మీకు మేలు చేకూరుస్తాను అని దేవతలను ఓదార్చి ఆచార్యత్వాన్ని అంగీకరించాడు.

*శత్రువుల నుండి సంరక్షించే వజ్రకవచము, ఆశ్రయించినవారిని ఆదుకొనే రక్షాకవచము అయిన నారాయణ కవచాన్ని విశ్వరూపుడు దేవేంద్రునకు ఉపదేశించాడు.*

*"ఓం నమో నారాయణాయ"* అనే ప్రణవపూర్వకమైన అష్టాక్షరీ మంత్రంలోకి ఎనిమిది అక్షరాలనూ పాదాలు, జానువులు, ఊరువులు, ఉదరం, హృదయం, వక్షఃస్థలం, ముఖం, శిరస్సు అనే అష్టాంగాలందూ విన్యాసం చెయ్యాలి. "ఓం నమో భగవతే వాసుదేవాయ" అనే ద్వాదశాక్షరీ మంత్రంతో కరన్యాసం చెయ్యాలి. "ఓం విష్ణవే నమః" మంత్రాన్ని హృదయం గ్రహించాలి.

గరుత్మంతుని భుజాలపై రెండు పాదాలు ఉంచి కూర్చున్నవాడూ, తన ఎనిమిది చేతులయందు శంఖం, చక్రం, కవచం, ధనస్సు, ఖడ్గం, బాణం, పాశం, గద అనే ఆయుధాలు ధరించినవాడూ అయిన భగవంతుడు కరుణార్ద్ర దృష్టితో నన్ను కాపాడుగాక.

ప్రణయకాలంలో తాను ఒక్కడే మిగిలి అనుపమాన కీర్తితో ప్రకాశించే మత్యావతారమూర్తి, భూదేవిని ఉద్ధరించిన ఆదివరాహమూర్తి, కూర్మమూర్తి, మాయావటుడై నటించి బలిచక్రవర్తి సంపదను అపహరించిన త్రివిక్రమదేవుడు, రాక్షసులను శిక్షించినవాడు ఊహింప శక్యంగాని మహిమ కలవాడూ అయిన నృసింహదేవుడూ, క్షత్రియకుల విరాముడు పరశురాముడు, శివుని విల్లు విరిచి రావణుని సంహరించిన

శ్రీరామచంద్రుడు, శ్రీకృష్ణదేవుడు నన్ను రక్షించుగాక. ధర్మరక్షణ పరాయణుడైన శ్రీమన్నారాయణుని అవతారాలు నన్ను రక్షించు గాక.

అన్ని వేళలలో గదాది ఆయుధాలను ధరించిన *కేశవుడు, నారాయణుడు, గోవిందుడు, విష్ణువు, మధుసూదనుడు, త్రివిక్రముడు, వామనుడు, హృషీకేశుడు, శ్రీవత్సధాముడు, సర్వేశ్వరుడు, జనార్ధనుడు, విశ్వేశ్వరుడు, కాలమూర్తి* అనే నామాలుగల భగవంతుడు నన్ను రక్షించును గాక. సుదర్శన చక్రం, కౌమోదకీ గదాదండం, పాంచజన్య శంఖరాజం, నందక మహాఖడ్గం, ధర్మస్వరూపమైన డాలు నన్ను రక్షించుగాక. భగవంతుని నామాలు, రూపాలు, దివ్యాయుధాలు, వాహనాలు నన్ను రక్షించును గాక.

***

*వృత్తాసురుని చేతిలో ఓడిపోయిన దేవతలు పాలసముద్రంలో ఉన్న శ్వేతద్వీపాన్ని చేరి వైకుంఠంలో నివసించే వాసుదేవుణ్ణి ప్రార్థించారు. భక్తవత్సలుడైన భగవంతుడు ప్రసన్నుడై దర్శనమిచ్చాడు.*

స్వామి శంఖము, చక్రము, గదా ధరించి ఉన్నారు. శిరస్సున రమణీయమైన రత్నకిరీటం విరాజిల్లుతున్నది. ఉరోభాగాన శ్రీవత్సము కౌస్తుభము శోభిస్తున్నాయి. లక్ష్మీదేవి వక్షఃస్థలాన విలసిల్లు తున్నది. చేతులందు భుజకీర్తులు, చెవులందు మకరకుండలాలు ప్రకాశిస్తున్నాయి. స్వామి ధరించిన దివ్యమైన ఆభరణాలు, బంగారు పట్టు పీతాంబరాలు వెలుగులు వెదజల్లుతున్నాయి. కన్నుల్లో

సోయగాలు, మందహాసంలో మధుర సుధారసాలు పొంగి పొరలుతున్నాయి.

***

*దేవతలు శ్రీహరిని ఇలా స్తుతించారు.*

దిక్కులకు అధినాథులమైన మాకు ఈనాడు దిక్కు లేకుండా పోయింది. దిక్కులేని దీనులకు నీవే దిక్కు. నీ దిక్కుచూచి నీవే దిక్కని మొక్కని వారికి ఈ ప్రపంచంలో ఏ దిక్కూ లేదు. ఇహపరాలలో కూడా వారు దిక్కుమాలినవారే. ఓ కమలనాభా! లోకంలో సురక్షితంగా ఉండి సుఖపడాలనుకొనేవారికి నీ దిక్కు సరియైన దిక్కు.

***

*వృత్తాసురుడు ఇంద్రునితో:*

ఈ ప్రపంచంలో పుట్టిన ప్రతి ఒక్కడు మరణించక తప్పదు. కాని రెండు విధాలైన చావులే ఉత్తమ మైనవి. ఒకటి రణరంగంలోను, రెండవది యోగమార్గంలోను.

జీవుడు *ఆయుర్దాయం, సంపద, యశస్సు, ఐశ్వర్యం* మొదలైన వాటిని ఎంతవరకూ ప్రాప్తమో అంత వరకూ అనుభవిస్తాడు. ప్రాప్తం తీరిపోగానే జీవుడితో పాటు అవి కూడా అంతరిస్తాయి. జనన మరణాల మధ్య ఉన్నదే జీవితం. ఆ జీవితం ఉన్నంత వరకే సంపదలూ సౌఖ్యాలూ. అది తీరిపోయాక అన్నీ అదృశ్యమైపోతాయి.

***

నదిలో ప్రవాహ వేగానికి ఇసుక రేణువులు కొట్టుకుని పోతుంటాయి. అవి అక్కడక్కడ కుప్పలుగా కలుస్తుంటాయి, మరల చెదిరి అవుతాయి. అదే విధంగా ప్రాణులు కాలప్రవాహంలో కలుస్తూ విడిపోతూ ఉంటారు. పుడుతూ చస్తూ పుడుతూ ఉంటారు. ఇదే సృష్టి రహస్యం.

ఈ లోకంలో భార్యలు, పిల్లలు, మిత్రులు, గృహాలు, సంపదలు, భోగ భాగ్యాలు, పొలం, ధనం, మొదలైన సంబంధాలన్నీ అశాశ్వతాలు. ఇవన్నీ మోహాన్ని, *శోకాన్ని, భయాన్ని* కలిగిస్తాయి తప్ప సుఖాన్ని చేకూర్చవు. కలలో కనిపించే వస్తువుల్లాగా ఈ సంబంధాలన్నీ మాయమవుతాయి.

జీవునికి ప్రతీజన్మలోను చుట్టాలుగా, దాయాదులుగా, కుమారులుగా, మిత్రులుగా, శత్రువులుగా, తటస్థులుగా అనేకులతో అనేక సంబంధాలు కలుగుతాయి. వాస్తవానికి జీవునికి వీరెవ్వరితోను ఎటువంటి సంబంధం లేదు.

***

*చిత్రకేతుడు శ్రీమన్నారాయణుని అనుగ్రహం చేత విద్యాధర పదవిని పొంది మనోవేగంగల విమానంలో సంచరిస్తూ ఆదిశేషుణ్ణి దర్శించి స్తుతించాడు.*

పద్మనాభుని పాదపీఠమైన ఆదిశేషుడు నక్షత్రాలవలె, ముత్యాలహారాలవలె, చందనంవలె, తెల్లని దేహం కలిగి ఉన్నాడు.

సుందరమైన నల్లని వస్త్రాలు ధరించాడు. రత్నకిరీటాలతో అతని శిరస్సులు విరాజిల్లుతున్నాయి. చేతులకు కంకణాలు కేయూరాలు అలంకరించుకున్నాడు. తళతళలాడే మొలనూలు ధరించాడు. ఆయన ముఖాలు ప్రసన్నంగాను, నేత్రాలు కాంతితోను మెరుస్తున్నాయి.

ఓ అనంతా! లోకాలు పుట్టడం, పెరగటం, నశించడం అనేవి నీ లీలావిలాసాలు మాత్రమే. పృథ్వి, జలం, తేజస్సు, వాయువు, ఆకాశం అనే పంచభూతాలూ, మహత్తు, అహంకారము అనే ఏడున్ను ఒకదానికంటె ఒకటి పది రెట్లు పెద్దవిగా కూర్చబడి ఉంటాయి. దీనినే అండకోశం లేక బ్రహ్మాండం అంటారు. ఇటువంటి  బ్రహ్మాండాలు నీలో లెక్కలేనన్ని అణువులుగా ఏర్పడి ఉన్నాయి. అందువలన నీవు అంతు తెలియరాని అనంతుడవు.

***

*అనంతుడు చిత్రకేతునితో:*

ఈ జగత్తులోని సమస్తజీవులూ నా రూపాలే. బ్రహ్మమూ, శబ్దబ్రహ్మమూ రెండు శాశ్వతమైన నా దేహాలు. ఆత్మ స్వరూపుడనైన నేను అన్ని లోకములందు వ్యాపించి ఉన్నాను. ఈ సమస్త జగత్తులు నాలో ఇమిడి ఉన్నాయి.

జీవుడు నిదురించే సమయంలో గుణాలకు అతీతంగా ఉంటాడు. జీవుడు స్వప్నంలో ఎక్కడెక్కడో వాడి ఇష్టం వచ్చినట్లూ తిరుగుతాడు. నిద్ర లేచిన అనంతరం తాను చూచిన వాటిని గుర్తు చేసుకుంటాడు.

రెండు అవస్థలను ఒకటిగా అర్థం చేసుకుంటాడు. ఇలా సమన్వయించుకొని ఒకటిగా గ్రహించడమే ఉత్తమ జ్ఞానం. అటువంటి జ్ఞానమే నేనుగా గుర్తించు.

లోకంలో నరజన్మ పరమదుర్లభం. అటువంటి ఉత్తమజన్మనెత్తి కూడా ఆత్మస్వరూపం తెలుసుకోకుండా తప్పుమార్గంలో పడినవానికి సుఖం ఉండదు. మానవులు సుఖప్రాప్తి కోసం దుఃఖనివృత్తి కోసం ప్రయత్నిస్తుంటారు. ప్రవృత్తిమార్గాన్ని, నివృత్తి మార్గాన్నీ అవలంభిస్తారు. కాని వారి సంకల్పం కోరికతో కూడినందువల్ల వారికి సుఖం లభింపదు. దుఃఖం తొలగిపోదు. దుఃఖ కారణమైన బంధాలలో చిక్కుకున్నవారికి మోక్షం ఎలా లభిస్తుంది! నా భక్తుడైనవాడు యోగవిద్యలో నైపుణ్యం సంపాదించి ఆత్మను దర్శిస్తాడు. ఆ ఆత్మానుభూతితో పరమాత్మను సందర్శిస్తాడు.

***

# సప్తమ స్కంధం

శ్రీమహావిష్ణువు చరిత్రలు కేవలం చిత్రాలు మాత్రమే కావు. ముల్లోకాలకూ పరమ పవిత్రాలు. అఖిల జీవరాశికి ఆప్తమిత్రాలు. మునిజనాలకు అత్యంత ప్రీతిపాత్రాలు. అవి సంసార బంధాలను అవలీలగా ఛేదించే మార్గాలు.

***

*రాజసూయయాగ సమయంలో నారదుడు ధర్మరాజుకు తత్త్వసారాన్ని ఇలా వివరించాడు:*

కోపంతో కాని, కోరికతో కాని, స్నేహంతో కాని, మోహంతో కాని, శత్రుత్వంతో కాని, ప్రీతితో కాని, భయంతో కాని ఏ విధంగానైనా కానీ శ్రీహరిని ఏమరకుండా స్మరిస్తున్నట్లయితే సర్వభూతాత్మకుడైన విష్ణుదేవుని సన్నిధానం దొరుకుతుంది.

తుమ్మెద ఒక పురుగును తెచ్చి దాని చుట్టూ ఝుంకారం చేస్తూ తిరుగుతూ ఉంటుంది. ఆ పురుగు తను కూడా తుమ్మెద అని తలచి చివరకి తుమ్మెదగా మారిపోతుంది. అలాగే భయం వల్ల కానీ, భక్తి వల్ల కానీ, స్మరణం వల్ల కానీ, శ్రవణం వల్ల కానీ శ్రీహరి సారూప్యం పొందవచ్చు.

అధికమైన కామంతో గోపికలు, భయంతో కంసుడు, శతృత్వంతో శిశుపాలుడు, అనుబంధంతో యాదవులు, ప్రేమతో పాండవులు, భక్తితో మహర్షులు శ్రీహరి నామస్మరణ చేసి ఆ స్వామి అనురాగానికి

పాత్రులయ్యారు. కాబట్టి ఏ విధంగానైనా నిరంతర స్మరణ వల్ల నరుడు నారాయణుడు అవుతాడు.

శ్రీహరి కథలు వ్యథలు పోగొట్టేవి, సుధలు చిలికించేవి, అనంతమైన సంసార సాగరములు దాటించేవి; దేవతలకు, యక్షులకు, నాగులకు, మానవులకు అందరికీ క్షేమమును కలిగించేవి.

***

*శ్రీహరి యజ్ఞవరాహమూర్తి రూపంలో హిరణ్యాక్షుని సంహరించాడు. పుత్ర శోకంతో కుమిలిపోతున్న తన తల్లిని చూసి హిరణ్యకశిపుడు ఇలా అన్నాడు.*

లోకం ఒక చలి పందిరి లాంటిది. ప్రాణులందరూ దాహం కోసం వచ్చిన బాటసారులు. వాళ్ళు దాహం తీర్చుకోవడానికి వచ్చి వెళ్ళిపోతున్నట్లు, మనం కూడా ఈ సంసారంలోకి వచ్చి మన పని కాగానే వెళ్ళిపోతూ ఉంటాం. ఎప్పుడూ ఒకచోటనే ఉండం. కలుస్తూ ఉంటాం, విడిపోతూ ఉంటాం.

ఈశ్వరుడు సమస్తానికి అధిపతి. సర్వమూ తెలిసినవాడు. సర్వత్రా నిండి యున్నవాడు. ఆద్యంతములు లేనివాడు. ఆత్మస్వరూపుడు.

కదలని చెట్లు కదలాడే నీళ్ళలో కదులునట్లు కనబడు విధంగా, భ్రమతో నిండినటువంటి కళ్ళకు భూమి చంచలంగా తోచిన విధంగా,

భావ వికారాలు లేనట్టి ఆత్మస్వరూపుడైన ఆ భగవంతుడు చలించే మనస్సు కలవాళ్ళకు చంచలుడుగా అనిపిస్తాడు. కానీ ఆ దేవుడు అచంచలుడు.

***

*విప్రబాలుని వేషంలో వచ్చిన యముడు, సుయజ్ఞుని మరణానికి విలపిస్తున్న అతని భార్యా పిల్లలతో ఇలా చెప్పాడు. ( ప్రేతబంధు యమ సంవాదం అనే కథ)*

దేహం ధరించిన ప్రతీవాడూ పుట్టడం గిట్టడం సహజం. మృత్యువును తప్పించకోవడం ఎవరి తరమూ కాదు. ప్రాణి ఎక్కడ నుండి ఇక్కడకు వచ్చాడో మళ్ళీ అక్కడకు పోవడం తప్పనిసరి కదా!

ఈ విశ్వమును సృష్టించేదీ, రక్షించేదీ, నశింపచేసేదీ ఎవడో, బ్రహ్మాండానికి అధిపతి ఎవడో - వాడే లీలా విలాసంగా  ఈ లోకాన్ని రక్షిస్తూ పోషిస్తూ ఉంటాడు.

ధనమును వీథిలో పడేసినా దైవయోగం బాగుంటే సురక్షితంగా ఉంటుంది. గీత బాగుండకపోతే ఇంటిలో భద్రంగా దాచి పెట్టినా మటుమాయమై పోతుంది. అలాగే దుర్బలుడు అడవిలో ఉన్నా భగవంతుని కృప ఉంటే ఆయురారోగ్యాలతో వృద్ధి పొందుతుంటాడు. అది లేనప్పుడు రాజభవనంలో ఉన్న రాజైన మరణిస్తాడు.

పంచభూతాలతో తయారైన ఈ దేహం ఒక భవనం వంటిది. అటువంటి శరీరంలో ఆత్మ పూర్వ కర్మలను బట్టి ప్రవర్తిస్తూ ఉంటుంది. కాలం తీరిపోగానే ఈ భవనం వదలి వెళ్ళిపోతుంది. దేహం అశాశ్వతం. అందులోని ఆత్మ శాశ్వతం. ఆత్మ దేహాన్ని విడిచిపెట్టగానే బంధాలన్నీ తెగిపోతాయి.

ఈ మాయా ప్రపంచం రహస్యం తెలుసుకొన్న మునులు, జ్ఞానులు అశాశ్వతమైన వాటిని గురించి సంతోషించరు, దుఃఖించరు. అజ్ఞానులు, అవివేకులు మాత్రం సంయోగం కలిగితే పొంగిపోతారు. వియోగం కలిగితే కృంగిపోతారు.

***

*హిరణ్యకశిపుని రాజదండానికి భయపడి దాస్యవిముక్తికై ప్రార్థిస్తున్న దేవతలతో శ్రీహరి ఇలా అన్నాడు:*

సాధుపురుషులను బాధించేవాడు, దేవతలను వేధించేవాడు, విప్రులపై క్రోధించేవాడు, వేదాలను నిందించేవాడు, గోవులను ఖండించేవాడు, ధర్మమార్గాన్ని వదిలిపెట్టి నాపై శతృత్వం పూనినవాడు తప్పక పతనమై పోతాడు. ఆ రాక్షసుడు బుద్ధిమంతుడు నా భక్తుడు అయిన ప్రహ్లాదుణ్ణి ఎప్పుడు హింసిస్తాడో, అప్పుడు నేను వానిని సంహరిస్తాను. మీకు శుభం కలుగుతుంది.

***

*ప్రహ్లాదుడు తన తండ్రి హిరణ్యకశిపునితో:*

నాకు నచ్చిన విషయం నారాయణ చరణస్మరణం. ఈ మానవులు అందరూ అజ్ఞానులు, అవివేకులు. వారందరూ సంసారమనే చీకటి నూతిలో నుండి బయట పడలేరు. భ్రమలతో బ్రతుకుతూ ఉంటారు. అంతా భగవంతుని విచిత్రమైన లీలావిలాసం అని తెలుసుకోలేరు.

మందారపుష్పంలోని మకరంద మాధుర్యం అనుభవించే తుమ్మెద ఉమ్మెత్తపూల వైపుకు పోతుందా! స్వచ్ఛమైన ఆకాశగంగా తరంగాలపై విహరించే రాజహంస వాగుల దగ్గర తిరుగుతుందా! లేత మామిడి చిగుళ్ళు తిని పులకించి పాటలు పాడే కోయిల కొండమల్లెల చెంతకు చేరుతుందా! నిండు పండు వెన్నెలలో విహరించే చకోరం మంచుపొరల వైపు మళ్ళుతుందా! నా మనస్సు విష్ణుపాదాలను ధ్యానించడంలోనే ఆనందం పొందుతోంది.

*సఖ్యం, శ్రవణం, దాస్యం, వందనం, అర్చనం, సేవనం, ఆత్మనివేదనం, కీర్తనం, చింతనం అని భక్తి మార్గాలు తొమ్మిది.* ఈ భక్తి మార్గాలను మనస్సుచేత, మాటచేత, క్రియచేత లోకనాయకుడైన శ్రీహరిని నమ్ముకొని మానవుడు ఉత్తముడిగా ఉండటం మంచిది.

లోకంలో గ్రుడ్డివాడికి వెన్నెల విలువ తెలియదు. చెవిటివానికి శంఖధ్వని వినపడదు. మూగవానికి పుస్తక పఠనం సాధ్యపడదు.

బూడిదలో వేసిన హోమద్రవ్యాలు ఉపయోగపడవు. నపుంసకులకు కాంత మీద కోరిక కలగదు. పిసినిగొట్టువానికి సంపద ఉపయోగ పడదు. వరాహానికి సువాసనలు తెలియవు. ఈ విధంగానే హరిభక్తి లేని వారి జీవితాలు కూడా నిస్సారములు, వ్యర్థములు.

హరిని పూజించని చేయి చేయి కాదు, అది కొయ్యతో చేసిన తెడ్డుతో సమానం. నారాయణుణ్ణి కీర్తించని నోరు నోరు కాదు, అది ఢమ ఢమ మ్రోగే ఢక్క మాత్రమే. కేశవుని చూడని కన్నులు కన్నులు కావు, అవి గోడకు ఉండే కన్నాలు. చక్రధారి కథలు వినని చెవులకు ఉపయోగం లేదు. శ్రీపతిని సేవించని శరీరం శరీరం కాదు, వట్టి తోలు తిత్తి మాత్రమే. విష్ణుభక్తి లేని పండితుడు పండితుడు కాదు. అతడు రెండు కాళ్ళ పశువు. ఆ జగన్నాయకుని గూర్చి ఆలోచించని జన్మ జన్మ కాదు, అది క్షణికమైన నీటి బుడగ.

భగవంతుడైన విష్ణువు లేని చోటు విశ్వములో లేదు. సముద్రంలో, భూమి మీద, ఆకాశంలో ఉన్నాడు. అగ్నిలో, వాయువులో ఉన్నాడు. అన్ని దిశలలో ఉన్నాడు. పగటిలో, రాత్రిలో ఉన్నాడు. సూర్యుడిలో, చంద్రుడిలో ఉన్నాడు. ఓంకారంలో, శ్రీకారంలో ఉన్నాడు. అంతటా నిండి ఉన్నాడు. భగవంతుడు ఒకచోట ఉన్నాడని, మరొకచోట లేడని సందేహించ వద్దు. అచ్యుతుడు అన్ని ప్రదేశాలలోనూ ఉంటాడు. అన్ని పదార్థాలలోనూ ఉంటాడు. ఎక్కడ వెదికితే అక్కడ కనపడతాడు.

***

హిరణ్యకశిపుడు ప్రహ్లాదునితో "హరి అన్నిచోట్లా ఉన్నాడని గొంతు చించుకుంటున్నావే అయితే ఈ స్తంభంలో చూపగలవా" అని తన ఖడ్గంతో స్తంభాన్ని బలంగా కొట్టాడు. అప్పుడు దాని నుండి నరసింహస్వామి ఆవిర్భవించాడు.

ఆ నరసింహస్వామి పాదాలు చక్రం, చాపం, నాగలి, వజ్రాయుధం, మీనం వంటి శుభరేఖలతో నిండి వికసించిన పద్మాల వలె ప్రకాశిస్తున్నాయి. ఆ స్వామి పాదాలు కదలుతుంటే ఆ భారానికి భూమిని మోసే *అష్టదిగ్గజాలు, ఆదిశేషుడు, కూర్మ రాజు, కులపర్వతాలు* అణిగి మణిని పోతున్నాయి. ఊరువులు ఐరావతం తొండాలలాగ బలంగా ఉన్నాయి. వక్షస్థలం పెద్ద కొండచరియవలె కఠినంగా విశాలంగా ప్రకాశిస్తున్నది. ఆ స్వామి బాహువులు *శంఖ, చక్ర, గద, ఖడ్గ, కుంత, తోమరాది వివిధ ఆయుధాలతో* నిండి ఉన్నాయి. స్వామి కోరలు తళ తళ మెరుస్తున్నాయి. నోరు, నాశికా రంధ్రాలు మేరు మందర పర్వత గుహలవలె విస్తారంగా ఉన్నాయి. నాలుక ఎర్రగా భయం కలిగిస్తోంది. మోము కోపావేశం చేత చలించి పోతున్నది.

ఆ నరసింహస్వామి ఆకారం ప్రహ్లాదునికి సంతోష కారణంగాను హిరణ్యకశిపునికి సంతాప కారణంగాను ఉంది. అది నరరూపమూ కాదు, సింహరూపమూ కాదు. ఆ ఉగ్రమూర్తి ఒక్కసారి గర్జించి, హూంకరించి, విజృంభించి దూకి దానవేంద్రుణ్ణి ఒడికి పట్టుకున్నాడు. బలవంతంగా తన ఊరువులపై అడ్డంగా పడవేసుకొని, వాడి గోళ్ళతో రొమ్ము చీల్చివేశాడు.

నృసింహస్వామి గోళ్ళు హిరణ్యకశిపుని వక్షఃకవాటాన్ని పగుల కొట్టేటప్పుడు గండ్రగొడ్డళ్ళవలె ప్రకాశించాయి. హృదయపద్మం పెకిలించేటప్పుడు స్వామి గోళ్ళు త్రవ్వుగోలలవలె విరాజిల్లాయి. రక్తనాళాలు త్రెంపివేసేటప్పుడు ఆ గోళ్ళు కొడవళ్ళులాగా దీపించాయి. ప్రేవులు తెగకోసేటప్పుడు ఆ గోళ్ళు రంపాలలాగ రాణించాయి. ఊరువులపై పడిఉన్న ఆ దానవుని తన నఖాలతో సంహరించినప్పుడు ఆ గోళ్ళు విజయాన్ని చాటుతూ శోభించాయి.

***

*హిరణ్యకశిపుని వధించిన తరువాత కూడ ఉగ్రనరసింహస్వామి ఆగ్రహం తగ్గలేదు. దేవతలు, మునులు, ఎవ్వరు కూడా దగ్గరకు వెళ్ళడానికి సాహసించలేక భయకంపితులయ్యారు.*

లోకజననీ! ఇందిరాదేవీ! ఈ ఆపదను తప్పించి నీవే మమ్ములను రక్షించాలి. శ్రీహరికి పట్టపురాణివి. హరిప్రియవు. పతిసేవా విధానం ఎరిగిన సతీమతల్లివి. మా కోరికలు తీర్చే కల్పవల్లివి. నరసింహస్వామిని శాంతపరిచు తల్లీ! అని లక్ష్మీదేవిని దేవతలు ప్రార్థించారు.

***

*ప్రహ్లాదుడు నరసింహస్వామిని స్తుతించుట:*

స్వామీ, నీ సన్నిధికి లక్ష్మీదేవి వచ్చింది. విధాత వచ్చాడు. మహేశ్వరుడు వచ్చాడు. అయినా వారిలో ఏ ఒక్కరికి నీ దివ్యహస్తంతో అభయం ఇవ్వలేదు. బాలుణ్ణి, దానవవంశంలో జన్మించినవాడిని

అయిన నా శిరస్సుపై నీ దివ్యహస్తం ఉంచి దీవించావంటే ఇది చాలా ఆశ్చర్యంగా ఉంది ప్రభూ.

నీ దయ పొందిన బుద్ధిమంతుడు నిష్కాముడై దివ్యసుఖం పొందుతాడు. *మౌనం, వ్రతం, జపం, తపం, స్మరణం, అధ్యయనం, స్వధర్మం, వ్యాఖ్యానం, ఏకాంతవాసం, ఏకాగ్రత* ఇవి మోక్ష హేతువులు. ఈ పదీ ఇంద్రియ నిగ్రహం లేని వాళ్ళకు భోగకారణాలు, విశ్రమించే వాళ్ళకు జీవనోపాయాలు, ఆడంబర పరులకు కాలక్షేప విషయాలు అవుతాయి. ఇలాంటి వారికి ఈ మోక్ష సాధనాలు సఫలం కావు. మనస్సులో భక్తిలేని వానికి తత్త్వజ్ఞానం అర్థం కాదు.

నీ ఆలయ ప్రాంగణంలో నిన్ను చూచి తలవంచి మ్రొక్కనివాడు, నీ వర్ణనలు నాలుకతో పలుకలేనివాడు, నిన్ను మనస్సులో నిత్యమూ ధ్యానించనివాడు, చెవులార నీ సంకీర్తన విననివాడు యోగి అయినా, తపశ్శాలి అయినా, పండితుడైనా, తత్త్వవేత్త అయినా ఎన్నటికీ పరమపదం అందుకోలేడు.

***

*నారదమహర్షి ధర్మరాజుతో:*

“శుభకరమైన శ్రీ నరసింహస్వామి విహారము, హిరణ్యకశిపుని సంహారము, భక్తుడైన ప్రహ్లాదుని సంచారము మంచి మనస్సుతో వినినా, చదివినా ఏ భయమూ కలుగని పుణ్యలోకానికి మానవుడు

చేరుకుంటాడు" అని ధర్మరాజుకు నారద మునీంద్రుడు ప్రహ్లాద చరిత్ర వినిపించాడు.

పరబ్రహ్మ స్వరూపుడైన శ్రీకృష్ణుడు మిత్రుడుగా, బావమరిదిగా, మంత్రిగా, మహాఫలప్రదాతగా నీ గృహంలో విహారం చేయటం నీ భాగ్యం.

***

*శివుడు త్రిపురాసుర సంహారం గావించుట:*

విష్ణుమూర్తి తన సహజశక్తులైన *ధర్మం, జ్ఞానం, విద్య, తపస్సు, విరక్తి, సమృద్ధి, క్రియాశక్తి విశేషాలతో రథం, సారథి, కేతనం, కవచం, ధనుస్సు మొదలైన యుద్ధసామగ్రిని* శంకరునకు సమకూర్చి పెట్టాడు.

పరమేశ్వరుడు కవచం ధరించాడు. పినాకం చేతపట్టాడు. అమ్ములపొది అందుకున్నాడు. రథం అధిరోహించిన త్రినేత్రుడు ఉగ్రరూపంతో గురిచేసి ఒక్కబాణం వింట సంధించి మూడు పురాలను బస్మం చేసి కూల్చేశాడు. ఇలా పరమేశ్వరుడు విశ్వకల్యాణకరమైన త్రిపురాసుర సంహారం చేయటంతో లోకాలన్నీ సంతోషించాయి.

***

*నారదుడు ధర్మరాజుకు సనాతనధర్మం వివరించుట:*

ప్రజలు సత్యం, సంతోషం, సమదృష్టి, వివేకం, శౌచం, క్షమ, దయ, దానం, మార్దవం, మనోనిగ్రహం, మహాత్ముల సేవ, మితభాషిత్వం, ఇంద్రియ జయం, బ్రహ్మచర్యం, ప్రాణులలో పరమాత్మను

చూడడం, సమబుద్ధి, ఉపవాసం, జపం, అహింస, ఆత్మావలోకనం, అన్నోదకాలు పంచి ఇవ్వడం, అసభ్య వాంఛలు, అనర్ధకమైన పనులు విడిచి పెట్టడం, శ్రీమన్నారాయణ స్మరణం, నామ సంకీర్తనం, సేవాభావం, ఆరాధనం, నమస్కృతి, దాస్యం, సఖ్యం, ఆత్మసమర్పణం – అనే *ముప్పది గుణాలు* అలవరచుకోవాలి.

తడవ తడవకు దున్నితే పొలం సారం కోల్పోతుంది. అందులో చల్లిన విత్తనాలు మొలచి ఏపుగా పైకిరావు. హోమకుండంలో ఆపకుండా ఎక్కువగా ఆజ్యం పోస్తే అగ్నికి వేడి తగ్గిపోతుంది. అందులో వేసిన హోమద్రవ్యాలు ఉపయోగం లేకుండా పోతాయి. ఆ విధంగానే నిరంతరం కామకలాపాలతో మునిగినవాని మనస్సు తరువాత నిష్కామమై క్రమంగా విరక్తి పొందుతుంది.

బ్రహ్మచారి చాలా నియమ నిష్ఠలతో నివసించాలి. ఉత్తమ గృహస్థుడు సత్ప్రవర్తనతో గృహస్థాశ్రమ ధర్మాలు నిర్వర్తించాలి. వానప్రస్థాశ్రమం స్వీకరించినవాడు అరణ్యాలకు వెళ్ళి మునివృత్తి అవలంబించాలి. ఋషులు నిర్దేశించిన నియమాలు పాటించిన పుణ్యాత్ముడు మహర్లోకం చేరి సుఖిస్తాడు.

***

*ప్రహ్లాదునికి అజగరుడనే మునీంద్రునికి జరిగిన సంవాద సారాంశాన్ని నారదుడు ధర్మరాజుకు చెప్పుట:*

గృహస్థు కర్మలను చేస్తూ ఫలితాన్ని వాసుదేవునికి అర్పించాలి. సజ్జనులతో స్నేహం చేయాలి. శ్రీహరి దివ్యగాథలను చెప్పించుకొని వీనుల విందుగా వినాలి. పుత్ర మిత్ర కళత్రాదుల కలయికలు కలలవంటివని తెలుసుకోవాలి. దేనిపైనా ఆసక్తి పెంచుకోకుండా, ఆసక్తి ఉన్నవానివలె పురుష ప్రయత్నాలు చెయ్యాలి.

మమకారాలు, బంధాలు పెంచుకోకుండా, అలాగని త్రెంచుకోకుండా; తల్లి తండ్రులకు, బార్యా పిల్లలకు, స్నేహితులకు, చుట్టాలకు ధనమునిచ్చి ఆనందం కలుగచేయాలి. భగవంతుని దయవల్ల సమకూడిన ధనధాన్య సంపదలపై అభిమానం పెంచుకోకుండా అనుభవించాలి. ప్రాప్తమైన ఆహారపదార్థాలను దేవతలకు, ఋషులకు, పితృదేవతలకు, మానవులకు, జీవజంతువులకు సంతర్పణ చేయాలి.

లోకంలో మానవుడు ధనానికి దాసోహమని తండ్రినైనా, గురువులనైనా సంహరిస్తాడు. కాని భార్యకోసం ధనమేమిటి? ప్రాణమైనా ధారపోస్తాడు. అటువంటి భార్య సహాయంతో ధర్మపథంలో నడిస్తే పరమేశ్వరుణ్ణి కూడా గెలవవచ్చు.

కురుక్షేత్రం, గయ, ప్రయాగ, నైమిశారణ్యం, రామేశ్వరం, ప్రభాస తీర్థం, వారణాసి, మధుర, పంపా సరోవరం, బిందు సరోవరం, నారాయణాశ్రమం, సీతారామాశ్రమం, మహేంద్ర పర్వతం, మలయ పర్వతం మున్నగు *తీర్థ క్షేత్రాలు,* విష్ణు భక్తులు నివసించే పుణ్యక్షేత్రాలు శుభాలు కోరే మానవులు తప్పక సేవించాలి.

బ్రహ్మచారి తన ఆశ్రమ నియమాలు మానకూడదు. గృహస్థుడు నిత్య నైమిత్తిక క్రియలు విడవకూడదు. వానప్రస్థుడు జనపదంలో నివసించకూడదు. సన్న్యాసికి స్త్రీల ఆలోచనే రాకూడదు. ఈ విధంగా బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాస ఆశ్రమ విధులు చెప్పబడాయి.

వేదాలు చెప్పిన కర్మకాండ అంతా రెండు విభాగాలు. మొదటిది ప్రవృత్తి మార్గం. రెండవది నివృత్తి మార్గం. ప్రవృత్తి మార్గంలో నడిచేవాడు మంచి కార్యాలు చేసి చనిపోయాక స్వర్గం చేరుకుంటాడు. అక్కడ భోగభాగ్యాలు అనుభవించి, పుణ్యఫలం పూర్తికాగానే భూమిపై మరల జన్మిస్తాడు. నివృత్తి మార్గం ఎన్నుకున్నవాడు ప్రాజ్ఞుడై, ఆత్మజ్ఞానాన్ని గ్రహించి, భక్తియోగాన్ని అనుసరించి జీవన్ముక్తుడవుతాడు;

***

# అష్టమ స్కంధం

*మొసలికి చిక్కిన గజేంద్రుడు భగవంతుని శరణు కోరుట:*

ఈ లోకం ఎవనివల్ల పుట్టుతుందో, ఎవనితో కలిసి ఉంటుందో, ఎవని లోపల లయం అవుతుందో, ఎవడు పరమాత్ముడో, ఎవడు విశ్వానికి మూలకారణమో; ఎవడు పుట్టడము, పెరగడము, గిట్టడము లేకుండా ఉంటాడో; ఎవడు అన్నీ తానేయై ఉంటాడో - అటువంటి ప్రభువైన ఈశ్వరుని నేను శరణు వేడుతున్నాను.

ఒకసారి లోకాలను సృష్టిస్తూ, ఇంకొకసారి తనలో చేర్చుకుంటూ, ఆ రెండూ తానేయై, ఆత్మలకు ఆత్మయైన పరమాత్ముని ధ్యానం చేస్తాను.

ప్రపంచంతో సంబంధాలు వదిలిపెట్టిన మునులు, భగవంతుణ్ణి చూడాలని కోరుకొనేవారు, అన్ని ప్రాణులకు మంచి జరగాలని కోరేవారు, మంచి మనసు కలవారు; పూజలు, వ్రతాలు ఆచరిస్తూ ఎవరి పాదాలను సేవిస్తారో - అటువంటి దేవుడు నాకు ఆధారమగుగాక!

భగవంతుడా! నాలో కొంచెం కూడా శక్తిలేదు. ధైర్యం తగ్గిపోయింది. ప్రాణాలు కదులుతున్నాయి. మూర్ఛ వస్తూ ఉంది. శరీరం నీరసించింది. అలసట కలిగింది. నాకు నీవు తప్ప వేరే దిక్కు లేదు. ఆర్తితో కూడిన నన్ను ఆదుకోవడం న్యాయం. దేవాది దేవా! రా నన్ను కరుణించి కాపాడు స్వామీ!

*వైకుంఠంలో ఉన్న భగవానుడు భయంతో 'కాపాడు కాపాడు' మన్న గజేంద్రుని మొర విన్నాడు. అతనిని కాపాడటానికి వెనువెంటనే బయలుదేరాడు:*

భగవంతుడు భక్తులను బ్రోవడంలో ఆసక్తి కలవాడు. గజరాజు మొరవిని లక్ష్మీదేవితో సరస సల్లాపాలను చాలించాడు. గజేంద్రుని రక్షించాలని నిర్ణయించుకున్నాడు. గజరాజు ప్రాణాలను కాపాడాలనే ఉత్సాహంతో నిండిపోయిన విష్ణువు లక్ష్మీదేవికి చెప్పలేదు. శంఖచక్రాలను చేతిలోనికి తీసుకోలేదు. సేవకుల నెవరినీ పిలువలేదు. గరుడవాహనం సిద్ధపరచుకోలేదు. చెవిలోని తామరదిద్దు వరకు జారిన జుట్టుముడిని సరిచేసుకో లేదు. ప్రణయకోపంతో పట్టుకున్న లక్ష్మీదేవి పైటకొంగును వదలి పెట్టలేదు. ఆకాశమార్గాన్న బయలుదేరాడు.

రాక్షసుల బ్రతుకు తెరువులను తొలగద్రోసేవాడు, నిండు దయతో యోగీంద్రుల మనస్సులలో నివాసంచేసేవాడు, జయశీలుడు, కాంతిమంతుడు, లక్ష్మీనాథుడు, భక్తులను కరుణతో కాపాడేవాడు అయిన విష్ణుదేవుడు ఆకాశమార్గంలో వస్తుండగా దేవతలు చూచారు.

దయాసముద్రుడైన విష్ణువు మొసలిని చంపడానికి తన చక్రాన్ని పంపాడు. ఆ సుదర్శన చక్రం దేవతలను అందరినీ కాపాడేది. భూమండలాన్ని కంపింప చేసే వేగం కలది. తన అగ్ని కణాలతో ఆకాశవలయాన్ని ధిక్కరించేది. బ్రహ్మాండాలన్నిటి కాంతితో నిండినది. ఎదురు లేనిది.

చక్రాయుధం రివ్వు రివ్వున పోయి భయంకరంగా మొసలి తల నరికి వేసింది. ఆ సమయంలో ద్వాదశ రాసులలో ఉండే మకరం సూర్యుడి చాటున దాగింది. నవ నిధులలోని మకరం కుబేరుని వెనుక నక్కింది. సముద్రంలో తిరిగే మకరాలు ఆదికూర్మం వెనుక దాగాయి.

విజయ సూచకంగా విష్ణువు పాంచజన్య శంఖాన్ని ఊదాడు. ఆ శంఖం దయారసానికి సముద్రం వంటిది. గొప్ప శబ్దంతో పంచభూతాలను పటాపంచలు చేయగలది. అపార శక్తివంతమైన కాంతితో ఇంద్రునికి కూడా బయం పుట్టించగలది. దీనుల దుఃఖాన్ని దూరం చేయగలది. శత్రువుల సైన్యాన్ని పారదోలేది.

భక్తుడు తన నిత్యకృత్యాలు నిర్వర్తించుతూ విష్ణువును సేవించాలి. ఈ నియమం పాటిస్తే క్రమంగా పాపాలన్నీ నశించిపోతాయి. దైవబలం ప్రాప్తిస్తుంది. దైవబలం లేనివారికి సుఖసంపదలు నశించిపోతాయి.

***

*గజేంద్రుని కాపాడిన తరువాత విష్ణుమూర్తి లక్ష్మీదేవితో ఇలా చెప్పాడు:*

నన్ను మరువని వారిని నేనెన్నడూ మరువను. నన్ను విడిచి పెట్టిన వారిని నేను విడిచి పెడతాను. ఈ సంగతి తెలుసుకొని ఇతరులకు మొరపెట్టుకోకుండా నన్ను విడువకుండా ప్రార్థించిన వారిని నేను ఎప్పుడూ తప్పక రక్షిస్తాను.

విష్ణుమహిమతో కూడిన గజేంద్రమోక్షం కథ వినేవారికి కీర్తి పెరుగుతుంది. సంతోషం సమకూరుతుంది. మోక్షం సులభమౌతుంది. తెల్లవారుజాముననే లేచి ప్రశాంతమైన మనస్సుతో విష్ణువును, గజరాజును, ఆ సరస్సును, శ్వాతద్వీపాన్ని, త్రిమూర్తులు నివసించే ఆ త్రికూటపర్వత శిఖరాలను గుహలను, సుదర్శన చక్రాన్ని, పాంచజన్య శంఖాన్ని, కాస్తుభమణిని, లక్ష్మీదేవిని, ఆదిశేషుని, గరుడుని, విష్ణు అవతారాలను, విష్ణుభక్తులను తలంచేవారు చనిపోయే సమయంలో నిర్మలమైన విష్ణువు రక్షణ పొందుతారు.

***

*దేవదానవ సంగ్రామంలో ఓడిపోయిన దేవతలతో కలిసివెళ్ళి బ్రహ్మదేవుడు విష్ణువును ప్రార్థించుట:*

చెట్టు మొదలుకు నీళ్ళు పోస్తే చెట్టు మధ్యలోను, కొన కొమ్మలలోనూ చల్లదనం వ్యాపిస్తుంది. అట్లే మొదట నీకు (శ్రీహరికి) మ్రొక్కితే దేవతలు నేను సంతోషిస్తాము.

కుండకు మన్నే ఆధారం. అట్లే సృష్టికి మొదలు, దీని మధ్యభాగము, దీని అంతము నీలోనే కనుపిస్తాయి. సృష్టిలోని మూడు దశలు నీవే.

భూమిలో ఆహారాన్ని, ఆవులో పాలను, కట్టెలలో అగ్నిని కనుగొనే విధంగా ఆత్మజ్ఞానం కలవారు తమ బుద్ధి ద్వారా ఈ విశ్వంలో నిన్ను చూస్తారు.

*విష్ణుమూర్తి బ్రహ్మాది దేవతలతో:*

ఎలుక కోసం పాము పొంచి ఉండే విధంగా బలం సమకూరే దాకా సమయం కోసం నిరీక్షిస్తూ పగవారి బారినుండి శరీరాన్ని దాచుకొని ఉండటం ఉత్తముల లక్షణం.

***

*క్షీరసాగర మథనం:*

విష్ణుదేవుడు దేవతలపై తన ప్రేమను వెల్లడిస్తూ మహా కూర్మంగా మారిపోయాడు. ఆ తాబేలుకు లక్ష ఆమడల వెడల్పైన గట్టి వీపుడిప్ప, బ్రహ్మాండాన్ని సైతం కబళించగల పెద్ద నోరు, అన్నింటిని మ్రింగి అరిగించుకోగల పెద్దనోరు, వెనుదీయకుండా ఉండే కాళ్ళు, కమలాల వంటి కన్నుల జంట ఉన్నాయి.

ఆహా విచిత్రమైన విష్ణులీలలు విష్ణువుకే తెలుసు. దేవతలు గొల్లవారి వలె పాలసముద్రం చిలికారు. విష్ణువు సైతం గొల్ల అయ్యాడు. అమరత్వాన్ని అందించే అమృతాన్ని శ్రీలక్ష్మిని పొందగలిగాడు.

***

*మందర పర్వతం కవ్వంగా చేసి చిలకగా అల్లకల్లోలమైన పాలసముద్రంలో అగ్ని జ్వాలలతో కూడిన హాలాహలమనే మహావిషం పుట్టింది. బ్రహ్మాది దేవతలు కైలాసం వెళ్ళి మహేశ్వరునికి రక్షించమని మొరపెట్టుకున్నారు.*

ఓ పరమేశ్వరా! నీవు పంచభూతాలకు ఆత్మయైనవాడవు. భూతనాథుడవు. అన్ని లోకాలను పాలించేవాడవు. దుఃఖించేవారిని చేరదీసే తండ్రివి. సమస్త సృష్టి స్థితి లయాలకు కర్తవు. బ్రహ్మ, విష్ణువు, శివుడు అనే రూపాలతో ప్రకాశించేవాడవు. బుద్ధిమంతులు ప్రీతితో నిన్ను పూజిస్తారు. సమస్తానికీ ప్రాణం నీవే.

అగ్ని నీ ముఖం. జీవాత్మ పరమాత్మల కలయిక నీ ఆత్మ. కాలం నీ నడక. భూమి నీ పాదం. వాయువు నీ శ్వాస. వరుణుడు నీ నాలుక. దిక్కులు నీ చెవులు. సూర్యుడు నీ దృష్టి. సముద్రాలు నీ గర్భం. ఆకాశం నీ శిరస్సు. పర్వతాలు నీ ఎముకలు. ధర్మశాస్త్రాలు నీ హృదయం. నీ రూపం పరతత్త్వం. నీవు పరంజ్యోతివి.

నుదుటి కంటి మంటలతో యమాదులను నీవు అవలీలగా దహించగలవు. అటువంటి నీకు మన్మథుడు, త్రిపురాసురుడు, దక్షయజ్ఞము, కాలకూట విషమూ మొదలైన వాటి నుండి హాని కలుగుతుందనే సందేహం లేదు. ఓ శంకరా! ముగ్గురు మూర్తులకు, మూడు లోకాలకు, మూడు కాలాలకు నీవే మూలం. మొదట భేదంతో కన్పించినా చివరికి అభేద స్వరూపంతో ఒప్పుతున్న పరబ్రహ్మం నీవే.

ఆ విషజ్వాలలను అవలీలగా పరిగ్రహించు. దయతో ప్రాణికోటిని అనుగ్రహించు. ఓ చంద్రశేఖరా! ఆపదను తొలగించడానికి , ఆనందాన్ని చేకూర్చడానికి, జయాన్ని సంపాదించడానికి, క్రూరులను హతమార్చడానికి నీకే సాధ్యమవుతుంది. నీవే మాకు దిక్కు.

*శివుడు పార్వతీదేవితో:*

ప్రాణభయంతో ఆశ్రయించిన ప్రాణులను కాపాడడం ప్రభువుల కర్తవ్యం. ప్రాణాలు నిమిషంలో నశించిపోయేవి. అందువల్లనే ఉత్తములు ప్రాణుల ప్రాణరక్షణ కోసం తమ ప్రాణాలను సైతం లెక్క చేయరు.

పంచభూతాలకు పరమాప్తుడై పరులకు సహాయం చేయడం కోసం ఎవడు ఇష్టపడతాడో అటువంటి వానికి ఎక్కడా తిరుగు లేదు. పరోపకారమే అన్నిటి కంటె ఉత్తమమైన ధర్మం.

మ్రింగేది విషమని తెలిసీ, మ్రింగేవాడు తన భర్త అని తెలిసీ దానివల్ల మేలు కలుగుతుందనే ఉద్దేశంతో సర్వ మంగళాలకు అధిదేవత అయిన పార్వతీదేవి దానిని త్రాగమని శంకరుడికి చెప్పింది. ఆమె తన మనస్సులో తన మంగళసూత్రాన్ని ఎంతగా నమ్మిందో!

పరమేశ్వరుని ఉదరం సమస్త లోకాలకు నిలయం. అందువల్ల ఆయన ఆ భయంకర విషాగ్నిని లోనికి పోనీయకుండా ఏదో పండ్లరసంలాగా జాగ్రత్తగా గొంతులోనే నిలుపుకున్నాడు. ఇతరులకోసం భగభగమనే విషం మ్రింగటం ఆ త్రినేత్రునికి తప్ప ఇంకెవరికి సాధ్యం.

పరమేశ్వరుడు ప్రంచడమైన ఆ విషాన్ని ఆహ్వానించేటప్పుడు, దానిని సమీపించేటప్పుడు, నోటిలో ఉంచుకొనేటప్పుడు, మ్రింగేటప్పుడు ఆయన శరీరం మీది సర్పహారాలు కదల లేదు. చెమటలు గ్రమ్మ లేదు.

కన్నులు ఎర్రబడలేదు. సిగలోని చంద్రుడు కంద లేదు. వదనం వాడి పోలేదు.

పరమేశ్వరుడి ఉదరం సమస్త లోకాలకు సదనం. అందువల్ల ఆయన ఆ భయంకర విషాగ్నిని లోనికి పోనీయకుండా జాగ్రత్తగా గొంతులోనే ఉండేటట్లు నిలిపి ఉంచాడు.

మెచ్చినపుడు నచ్చినపుడు ఇతరులకు కోరినంత ఈయవచ్చును. అంతేకానీ ఇతరుల కొరకు భగ భగ మండే విషాన్ని మ్రింగటం మూడు కన్నుల శివునికి తప్ప ఇంకెవరికి సాధ్యం.

***

*పాలకడలి నుండి లక్ష్మీదేవి ఆవిర్భావం:*

క్షీరసాగరమధన సమయంలో, పాలసముద్రం నుంచి పుట్టిన లక్ష్మీదేవికి ఇంద్రుడు వెలలేని రత్నాల పీఠం, సముద్రుడు పట్టుబట్టల జత, వరుణుడు వైజయంతీ మాల, విశ్వకర్మ బంగారు అలంకారాలు, సరస్వతి మంచిముత్యాల హారం, బ్రహ్మదేవుడు చేతిలో ధరించే లీలాకమలం, నాగరాజు కర్ణాభరణాలు ఇచ్చి దీవించారు.

లక్ష్మీదేవి నవ్వుతూ ఎవనితో పలుకుతుందో అతడే బ్రహ్మ. ఆమె మెచ్చుకుంటూ అందమైన తన చేతితో ఎవరిని వరిస్తుందో అతడే అన్నిలోకాలకూ అధిపతి. ఆమె ఎల్లప్పుడూ ఏ ఇంటిలో కాపురం చేస్తుందో అది కలకాలం కళకళలాడే వైకుంఠం. ఆమె ఎచ్చట తన చూపు

సారిస్తుందో అది ఇంద్రుడికి, కుబేరునికీ, యమునికీ ఆయువు పట్టు. ఆమె చిరునవ్వు దుఃఖాన్ని తొలగిస్తుంది; సృష్టిని వెలిగించుతుంది.

లక్ష్మీదేవి విష్ణువును మెచ్చుకొన్నది. *"ఇతనిని చేరి సేవించ వచ్చు. స్థిరత్వం కలవాడు. సజ్జనులను కాపాడేవాడు. కామం క్రోధం మొదలైన చెడు గుణాలు లేనివాడు. అందగాడు. చందనం వలె చల్లని వాడు. ఇల్లు సంపదలకు విడిది. సవతులు లేరు. ఇతనే నాకు తగిన భర్త"* అని నిశ్చయించుకొని పూలమాల మెడలో వేసి విష్ణువును వరించింది.

లోకాలకు తండ్రియైన విష్ణువు లోకాలకు తల్లియైన లక్ష్మీదేవిని తన వక్షాన్న చేర్చుకొన్నాడు. అల్లుడైన శ్రీమహావిష్ణువుకు సముద్రుడు కౌస్థుభమనే అమూల్యరత్నాన్ని ఇచ్చాడు. దానిని విష్ణువు తన వక్షాన్న ధరించాడు. అప్పుడు శ్రీవత్సము, కౌస్థుభము, వైజయంతి మాలిక, ముత్యాలహారమూ వాటితో కూడిన సొగసైన విష్ణువు ఎదపై లక్ష్మీదేవి నివసించింది.

***

*విష్ణుమూర్తి మోహినీ అవతారం:*

మోహిని రూపంలో ఉన్న విష్ణువు అందమైన తన వాలుచూపులతో, చిరునవ్వులతో ఆ దానవులను మోహానికి గురిచేసాడు. అందగత్తెల మాటలు తేనెల ఊటలు. వారి ఆలోచనలు

పలువిధాలైన కార్చిచ్చులు. వారితో స్నేహం తోడేళ్ళతో సహవాసం. అటివంటివారిని విశ్వసించడం శ్రేయస్కరం కాదు.

దేవతలు, రాక్షసులు సమానమైన ధైర్యము, శక్తి, బలము, తెలివి, ధనము, ఆత్మ గౌరవమూ కలవారే. కాని వారికి రెండు విధాలైన ఫలితాలు ప్రాప్తించాయి. దేవతలు శుభాలను పొందారు. విష్ణువును శరణు వేడని వారికి శుభాలు ప్రాప్తించవు కదా!

***

*దేవాసుర యద్ధ సమయంలో బలి చక్రవర్తి దేవేంద్రుడితో:-*

అమరేంద్రా! జయములు, అపజయములు, సంపదలు, ఆపదలు, శాశ్వతమైనవి కావు. అవి గాలిలో కదలే దీపాలు. చంద్ర కళలు. కదలాడే మబ్బుల గుంపులు. నీటి కెరటాలు. అందువల్ల విర్రవీగ వద్దు.

***

*మోహినీ అవతారం తరువాత శివుడు విష్ణుమూర్తితో:*

శివుడు విష్ణువుతో:- దేవదేవా! వాసుదేవా! జగదీశ్వరా! సమస్త వస్తువులకూ కారణభూతుడవు నీవే. ఆదిమధ్యాంతాలు లేకుండా లోపల వెలుపల అంతా నిండిన వాడవు నీవు. పరిపూర్ణమైన సత్యం, ఆనందంతో కూడిన జ్ఞానం నీవు. అన్నింటి పుట్టుకకు, మనుగడకు, నాశనానికి కారణం నీవు. మోక్షాన్ని కోరేవారు స్వార్థాన్ని, అహంకారాన్ని విడిచి నీ పాదాలను సేవిస్తారు.

నీవు పరబ్రహ్మమని కొందరు భావిస్తారు. నీవు ధర్మమని కొందరు తలుస్తారు. నీవు ప్రకృతి పురుషుల కంటె వేరని కొందరంటారు. నీవు శక్తి స్వరూపుడవని మరికొందరు ధ్యానిస్తారు. అన్నింటిని మించి సాటిలేనివాడవు నీవు. పైకి భేదం కన్పిస్తున్నా నీకు ఈ సృష్టికి భేదం లేనేలేదు. సర్వాత్మకుడపై అన్నిటిలో నీవు చేరి ఉంటావు. ఆలోచిస్తే అన్నీ నీవే.

మాధవా! మహిమతో కూడిన నీ మగ సోయగాన్ని ఎప్పుడూ కన్నులారా చూస్తాము. మోహినిగా రాక్షసులను మోసగించి దేవతలకు అమృతాన్ని పంచి ఇచ్చిన నీ స్త్రీరూపం చూడాలని నా మనస్సు కుతూహల పడుతున్నది. ఆ రూపాన్ని చూపు.

మోహినీరూపాన్ని చూసిన శివుడు కూడా విష్ణు మాయలో చిక్కుకున్నాడు. తరువాత మహానుభావుడైన శివుడు పరమాత్ముని మాయ వల్ల కలిగిన తన మైమరపును గమనించాడు. తన మహిమవల్ల విష్ణుమాయను తెలుసుకొన్నాడు.

మన్మధుని ఓడించవచ్చు. యముని ధిక్కరించవచ్చు. కాని ఆడువారి వాలుచూపుల వాడి బాణాలను గెలవడం త్రిపురాంతకుడైన మహాశివునికి కూడా సాధ్యం కాలేదు.

***

*వామనావతారం:*

*బృహస్పతి బలిచక్రవర్తి చేతిలో ఓడిన దేవేంద్రునితో:*

శత్రువును ఎదిరించి జయించాలి, లేదా వానితో సమానంగా నైనా పోరాడాలి. లేదా రణరంగంలో వీరమరణం పొందాలి. గెలుపు సమానత్వం, మరణం కలగని పక్షంలో ముందుగానే తొలగి వెళ్ళిపోవడం మంచిది.

అన్నమైనా, మజ్జిగైనా, నీళ్ళైనా చివరకు కూరగాయలైనా తమకు ఉన్నంతలో అతిథులకు లేదనకుండా పెట్టాలి. అలా పెట్టకపోతే ధనవంతులైనా వారు దరిద్రులతో సమానం. అతిథులను సంతోషపెడితే విష్ణువు సంతోషపడతాడు. విష్ణువు సంతోషిస్తే సమస్తలోకాలు సంతోషిస్తాయి.

మనువులు, ఋషులు, ఇంద్రులు, దేవతలు విష్ణువు ఆజ్ఞకు లోబడి ఉంటారు. ప్రతి మన్వంతరంలో విష్ణువు అవతరిస్తాడు. అందరూ విష్ణువు అంశతో రూపు దాలుస్తారు. ఆయన సహాయంతో లోకాలను ఏలుతారు. తమతమ కాలాలలో రాజులు లోకాలను పంచుకొని పాలిస్తారు. లోకాలు సుభిక్షంగా ఉంటాయి.

దేవతల తల్లి అదితి *"పయోభక్షణం"* అనే వ్రతం ఆచరించి పండ్రెండు దినాలు యదావిదిగా ఆ భగవంతుని పూజించింది. వ్రతం ముగియగానే విష్ణువు ప్రత్యక్షమైనాడు. ఆయన శంఖాన్ని చక్రాన్ని గదనూ ధరించి, పచ్చని పట్టువస్త్రాన్ని కట్టుకొని ఉన్నాడు.

అచ్యుతా! నీవు భక్తులపాలిటి కల్పవృక్షానివి. పూజించేవారిని బ్రోచేవాడవు. వేదాలకు ఆధారమైనవాడవు. అంతటా నిండి ఉన్నవాడవు. శాశ్వతమైన లీలావిలాసాలు కలవాడవు. ఈ లోకంలో మంచి ఆయుస్సు, మనుగడ, ఇహము, పరము, కలిమి, ధర్మార్థ కామాలు, శత్రుజయము నిన్ను పూజించని వారికి లభించవు కదా!

అదితి గర్భంలో ఆ చిన్నారి శిశువు భూగోళాలను, సముద్రాలను, సమస్త లోకాలను తన కడుపులో ఇమిడించుకొని సన్ననైన చిన్న రూపంతో అందంగా అణగిమణగి ఉన్నాడు.

శ్రావణమాస ద్వాదశి, శ్రవణ నక్షత్రం, అభిజిత్తు లగ్నం, పట్టపగలు సూర్యుడు ఆకాశం నట్టనడుమ ప్రకాశించే సమయంలో గ్రహాలు నక్షత్రాలు ఉచ్ఛదశలో ఉండగా అదితి గర్భం నుండి మహావిష్ణువు వామనరూపంలో అవతరించాడు.

స్వామీ! నీవు ముల్లోకాలను జయింపగలవాడవు. దేవాధిదేవుడవు. సమస్త భువనాలను నీ కడుపులో దాచుకుంటావు. సమస్త జీవులను నీలోనే నిలుపుకుంటావు. సృష్టికర్తలకు నీవు సృష్టికర్తవు.

వామనునికి సూర్యుడు గాయత్రీ మంత్రం ఉపదేశించాడు. బృహస్పతి యజ్ఞోపవీతం, కశ్యపుడు దర్భల మొలత్రాడు, అదితి కౌపీనం, భూదేవి నల్లని జింక చర్మం, చంద్రుడు దండం, ఆకాశం గొడుగు,

బ్రహ్మ కమండలం, సరస్వతీదేవి జపమాల, సప్తర్షులు పవిత్రమైన దర్భలు, కుబేరుడు భిక్షాపాత్ర ఇచ్చారు. పార్వతీదేవి 'అక్షయం' అంటూ భిక్ష పెట్టింది.

తన వక్షస్థలంలో లక్ష్మీదేవిని కలిగినవాడు విష్ణువు. అయినా అతడు ఇంద్రుని కోసం బలిని బిక్షమడగడానికి బయలుదేరాడు. ఇతరులకు మేలు చేసే ఉద్దేశంతో బిచ్చమెత్తడంకూడా గొప్పవారికి ఒక అలంకారమే.

***

*వామనుడు బలిచక్రవర్తితో:*

నేను బ్రహ్మచారిని. నాకు *గొడుగు, జందెము, కమండలం, మొలత్రాడు, యోగదండం* మాత్రం అవసరం. అంతేకాని భూములతో, ధనంతో, ఏనుగులతో, గుఱ్ఱాలతో, స్త్రీలతో నాకు పనిలేదు. నేను కోరినట్లుగా నాకు ఆ మూడడుగుల చోటిస్తే చాలు. అదే నా పాలిటి బ్రహ్మాండం.

సంతోషం కలవాడికి ఎల్లప్పుడు సుఖం కలుగుతుంది. పూటపూటకు దొరికిన దానితో సంతోషపడితే తేజస్సు పెరుగుతుంది. సంతోషం లేకపోతే తేజస్సు తరుగుతుంది. సంతోషం ఉంటేనే మోక్షం దొరుకుతుంది. ఈ జన్మలో సంతోషం లేకపోవడమే మరల పుట్టుకకు కారణం అవుతుంది.

***

*శుక్రాచార్యుడు బలిచక్రవర్తితో:*

దాతకు నాశనం కలిగించే దానం దానమే కాదని పెద్దలు చెప్పుతారు. *ఉత్తముడైన పురుషుడు తన ధనమంతా ఐదుభాగాలు చేసి కామానికి, అర్థానికి, ధర్మానికి, కీర్తికి, ఆశ్రయించినవారికి* సమానంగా పంచాలి. ఆ విధంగా చేసేవాడు ఇహలోకంలోను పరలోకంలోను నిండుగ సుఖపడతాడు.

రైతుకు మంచి పొలము, మంచి విత్తనాలు ఒకేచోట దొరకడం అరుదు. అదే విధంగా దాతకు తగిన ధనము దానిని తీసుకునే ఉత్తముడు దొరికే అదృష్టం అపురూపం

***

*బలిచక్రవర్తి శుక్రాచార్యునితో:*

ఈ వామనుడు చెయ్యి చాచి అడుగుతున్నాడు. ఈ చెయ్యి ఎంత గొప్పది? మొదట లక్ష్మీదేవి కొప్పుపైన, చెక్కిళ్ళపైన, పైటపైన, పాలిండ్లపైన, శరీరంపైన, పాదపద్మాలపైన గౌరవాన్ని పొందేది. అటువంటి గొప్పచెయ్యి ఇప్పుడు క్రిందది కావడమూ, నా చెయ్యి పైది కావడమూ ఎంత అదృష్టము? ఈ రాజ్యం ఏపాటిది? ఈ నా శరీరంకూడా శాశ్వతం కాదు. మేరు పర్వతం తలక్రిందులైనా, సముద్రాలు ఇంకిపోయినా, భూమండలం పొడి అయిపోయినా, మిన్ను విరిగి మీద పడిపోయినా సరే, ఈ దానం ఇవ్వక మానను.

బలిచక్రవర్తి విష్ణువును, దేశకాలాలను తెలుసుకున్నాడు. శుక్రుడి మాటలను తెలుసుకొన్నాడు. తనకు చేటు వాటిల్లుతుందని తెలుసుకున్నాడు. ఐనప్పటికీ ఆ దానం యోగ్యమైనదిగా భావించి ఇచ్చాడు. లోకంలో అతనివంటి మహాదాత ఇంకెవరు ఉన్నారు!

వామనుడు బ్రహ్మాండంగా నిండిపోతున్న ఆ సమయంలో సూర్యబింబం క్రమక్రమంగా అతనికి గొడుగుగా, ఆయన శిరస్సుపై మణిగా, మకర కుండలంగా, కంఠాభరణంగా, బంగారు భుజకీర్తిగా, అటు తర్వాత కాంతులీనే కంకణంగా, మొలలోని గంటగా, మేలైన కాలి అందెగా, చివరకు పాదపీఠంగా ప్రకాశించింది.

విశ్వరూపాన్ని ధరించిన త్రివిక్రముడు ఒక అడుగుతో భూలోకాన్ని, ఇంకొక అడుగుతో స్వర్గలోకాన్ని, మరియొక అడుగుతో పైలోకాలను కప్పివేశాడు. క్రమంగా అన్నిటిని దాటి పోయాడు. ఆ మహారూపం పట్టకపోవడం వలన బ్రహ్మాండభాండం పెటపెటలాడి బ్రద్దలైపోసాగింది. ఆయనతప్ప ఇంకెవ్వరూ కనిపించకుండా పోయారు. ఆ విశ్వరూపుడు మాటలకు, చూపులకు అందనివాడై శోభించాడు.

రాజైనవాడు పెక్కు కోటలు, మంత్రులు, సైన్యాలు, ఆయుధాలు, మంత్రాలు, ఔషదులు ఉన్నప్పటికీ కాలాన్ని గమనించి, ఓర్పుతో ఉపాయంతో యుద్ధం చేయడం మంచిది.

***

*విష్ణుమూర్తి:*

ఎవరిపైన నేను దయ చూపించాలని అనుకుంటానో అటువంటివాని సంపదనంతా అపహరిస్తాను. సంసార సంబంధమైన గొప్ప మైకంతో ఎవడు లోకాన్ని నిందించి నన్ను తిరస్కారిస్తాడో వాడు పలుసార్లు పుట్టి చచ్చి నరకానికిపోతూ ఉంటాడు. ఎవడైతే ధనానికి, వయస్సుకు, రూపానికి, విద్యకు, బలానికి, ఐశ్వర్యానికి, జన్మకు సంబంధించిన గర్వాన్ని విడిచిపెట్టి ఎల్లప్పుడూ నిర్మలంగా ఉంటాడో అటువంటివానిని ప్రీతితో కాపాడుతాను.

బలిచక్రవర్తి బలవంతుడై స్వర్గలోకాన్ని స్వాధీనం చేసుకోగా, విష్ణువు వామనుడుగా వెళ్ళి మూడు అడుగులు దానం తీసుకొని, బలిని బంధించాడు. తరువాత బలికి అమరావతి కంటే అందమైన సుతల లోకాన్ని ఇచ్చాడు. సావర్ణి మన్వంతరంలో బలిచక్రవర్తిని ఇంద్రుడుగా నిలుపుతాడు. బలి చక్రవర్తి, ఇంద్రపదవిని పొందినప్పటికీ అతడు మొదట విష్ణువుకు దానం చేసిన పుణ్యం చెడదు.

***

*తన మనుమడైన బలి చక్రవర్తిని అనుగ్రహించినప్పుడు, ప్రహ్లాదుడు వామన మూర్తితో:*

నీవు అన్నింటిలోనూ ఉంటావు. అందరినీ సమానంగా చూస్తావు. అయినప్పటికీ కొన్ని చోట్ల పక్షపాతాన్ని చూపిస్తావు. భక్తి లేనివారి కోరికలు తీర్చవు. భక్తులైనవారి కోరికలను కల్పవృక్షం వలె నెరవేర్చుతావు.

*శుక్రాచార్యులు వామనావతారంలో ఉన్న శ్రీహరితో:*

విష్ణుదేవా! అన్ని కార్యాలకు అధినాథుడవు నువ్వే. యజ్ఞాలకు అధికారిని నీవే. నీవు సంతోషిస్తే ఏ కార్యాలకూ లోపం కలుగదు. నిన్ను ధ్యానిస్తే  అన్ని దోషాలు తొలగిపోతాయి. నీ ఆజ్ఞకు లోబడి మెలగడమే మానవులకు మేలు.

దేవతల తల్లి అదితికి చిట్ట చివరి కొడుకైన వామనుడు భిక్షమడిగి సంపాదించిన ముల్లోకాలను తన అన్నకే ఇచ్చాడు. బలవంతుడైన తమ్ముని సహాయంతో ఇంద్రునికి ఇంద్రపదవి లభించింది. ఉత్తముడైన తమ్ముడు ఉంటే అన్నగారి కోరికలు నెరవేరకుండా ఉంటాయా?

దేవతలను అందరినీ కన్న అదితి చివరికి అదృష్టం పండేటట్లు వామనునికి జన్మ నిచ్చింది. గంపెడు కొడుకులను కన్నదాని కంటె ఉత్తముడైన ఒక్కనిని కనినా చాలును. వామనుని గొప్ప గుణాలను పూర్తిగా తెలుసుకోవడం ఎవరికీ సాధ్యం కాదు.

***

*మత్స్యావతారం:*

మహావిష్ణువు మత్స్యరూపం ధరించాడు. చిన్న చిన్న రెక్కలు, పెద్ద పెద్ద మీసాలు, పొట్టి తోక, బంగారు రంగు శరీరము, అందమైన మచ్చలు,  చక్కని మొగము, ఒక కొమ్ము, మిరుమిట్లు గొలిపే చూపులూ కలిగి ఆ మహామత్స్యం విరాజిల్లుతున్నది.

భగవంతుడు మత్స్యరూపంలో లక్ష ఆమడల పొడవుకు ఎదిగి సముద్రంలో ప్రవేశించాడు. ఆ పెనుచేప రూపంలో ప్రళయ జలాలలో వేదాల కొరకు వెదకడం మొదలు పెట్టాడు. రెక్కలు చాస్తూ, మీసాలు కదిలించుతూ, మేను పొడవు మెరిపించుతూ, కన్నుల కాంతులు ప్రసరిస్తూ, ఒళ్ళు విరుచుకుంటూ, తళతళలాడుతూ ఆ సాగర గర్భంలో విహరించాడు.

***

*సత్యవ్రతుడు మత్స్యావతారంలో ఉన్న విష్ణుమూర్తితో:*

ఓ లక్ష్మీపతీ! సూర్యుడు కన్నులుగా నీవు ప్రాణులను చూస్తుంటావు. జ్ఞానం లేనివాడికి, చెడు బుద్ధి కలవానికీ కూడా తండ్రివి నీవే. కాబట్టి కన్నులున్నవాడు లేనివాడికి దారి చూపించిన విధంగా మమ్ములను ఉద్ధరించు. నీవే గురువుపై మంచి దారి చూపించు. అగ్నితో చేరడం వలన బంగారానికి మెరుగు కలుగుతుంది. ఆ విధంగానే నిన్ను పూజించే నీ భక్తులకు పాపాలు నాశనమై మోక్షం లభిస్తుంది.

ప్రళయ సముద్రంలో మైమరచి నిద్రించిన బ్రహ్మదేవుడి ముఖాల నుండి వెలువడిన వేదాలను దొంగలించిన దుష్టరాక్షసుడైన హయగ్రీవుని సంహరించి; సత్యవ్రతునకు బ్రహ్మ స్వరూపాన్ని తెలిపి, మత్స్యావతారంతో సముద్రంలో మునుగుతూ తేలుతూ సంచారం చేసిన, మహావిష్ణువుకు నమస్కరిస్తున్నాను.

***

# నవమ స్కంధం

*విష్ణుభక్తుడు అంబరీషుడు:*

అంబరీషుని మనస్సు శ్రీహరి పాదాల మీదనే, మాటలు హరి సంకీర్తన మందే, చేతులు విష్ణు మందిరాలను శుభ్రపరచడమందే, చెవులు హరి కథలు వినడమందే, చూపులు గోవిందుని రూపాన్ని తనివితీర తీరా చూడడం మీదే, తల కేశవునికి నమస్కరించడమందే, పాదాలు విష్ణు దేవాలయాలను చుట్టి రావడమందే, చెలిమి విష్ణు భక్తుల పాదాలయందే, నాలుక పవిత్ర తులసీ దళాలయందే నిమగ్నమై ఉండేవి.

భగవంతుని భక్తుడైన అంబరీషుడు “హరి” అని తలచేవాడు. “హరి” అని చూచేవాడు, “హరి” అని తాకేవాడు. “హరి” అంటూ రుచి చూచేవాడు. గొప్పవాడైన అంబరీషుని కొనియాడ సాధ్యమా?

***

*తరుముతున్న సుదర్శన చక్రం బారినుండి రక్షించమని ప్రార్థించిన దుర్వాసునితో బ్రహ్మదేవుడు ఇలా చెప్పాడు:*

రెండు పరార్థముల ప్రమాణంగల ఈ కాలాన్ని కాలస్వరూపుడైన విభుడు ఎవడైతే మిక్కిల ప్రీతితో సృష్టిస్తాడో; కాలం పరిపూర్తి అయ్యాక ఎవడైతే తన కనుకొనల్లో ఎర్రదనం వచ్చిన వెంటనే బ్రహ్మలోకాన్ని ఇతర లోకాలను బూడిద చేస్తాడో అటువంటి శ్రీహరి యొక్క సుదర్శన చక్రం అగ్ని జ్వాలలకు అడ్డు పడగలిగిన శక్తి కలిగినవాడు మరొకరున్నాడా?

***

*దుర్వాసునితో శివుడు ఇలా అన్నాడు:*

ఆ శ్రీహరిలో వేలకొలది బ్రహ్మాండాలు నియమంతో పుట్టుతుంటాయి, గిట్టుతుంటాయి. నేను, బ్రహ్మ, నారదుడు, సనత్కుమారుడు, కపిలుడు, మరీచి, ప్రహ్లాదుడు, దేవలుడు, పరతత్త్వం తెలిసిన అందరూ ఎవని మాయ తెలుసుకోవడానికి అశక్తులము అవుతున్నామో అటువంటి సర్వేశ్వరుని చక్రాన్ని నిర్వీర్యం చేయడం మాకు సాధ్యం కాదు.

***

*విష్ణుమూర్తి దుర్వాసునితో:*

మహర్షీ, బుద్ధిమంతులైన సాధువులు నా హృదయాన్ని కొల్లగొట్టుకొని పోతూ ఉంటారు. పవిత్రమైన భక్తి అనే తీగలతో మదించిన ఏనుగులాగ నేర్పుగా నన్ను కట్టిపడవేస్తారు. ఆ బంధాలకు చిక్కిన నేను భక్తుల మీద ప్రేమతో వారిని వదలి వెళ్ళలేను. అంతేగాక తన దేహాన్ని, జీవితాన్ని, కుటుంబాన్ని, సంపదలను, అన్నింటినీ వదలి నన్నే నమ్ముకున్నవారు ఎలాంటివారైనా నేను వారిని వదలిపెట్టను.

***

*అంబరీషుడు చక్రాయుధంతో:*

ఆయుధశ్రేష్టమా! నీవు విష్ణుమూర్తికి సన్నిహితిడివి. నీవే అగ్నివి. నీవే సూర్యుడివి. నీవే చంద్రుడివి. నీవే నీరు, నీవే నేల, నీవే ఆకాశం, నీవే గాలి. సమస్త ప్రాణులు, ఇంద్రియాలు నీవే. నీవే బ్రహ్మం,

నీవే సర్వాత్మ, నీవే కాలం. శ్రీహరిచే వదలబడిన నీవు విజృంభిస్తే ఆ సంగతి ముందే పసిగట్టి ఎలాగూ చావు తప్పదని ముందుగానే గ్రహించిన రాక్షస సమూహాలు, దేహంలోని ప్రాణవాయువులు వదులుతారు. రాత్రి కలలో చూస్తే చాలు, రాక్షసులు మరణిస్తారు. నీకు నమస్కరిస్తున్నాను. నీవు ఈ దుర్వాసమునిని క్షమించి కాపాడు.

***

*గంగావతరణ: కపిలముని ఆగ్రహానికి సగరకుమారులు ఆహుతయ్యారు. వారి ఉత్తమగతి ప్రాప్తికి ఆ వంశజుడు దిలీపుని కుమారుడైన భగీరథుడు గంగను ప్రార్థించాడు:*

విష్ణుపాదాలను సోకి పవిత్రమైన జలం కలిగి ఆకాశంనుండి భూమి మీదకు ఉరికే గంగను శివుడు తన శిరస్సుపై ధరించాడు. ఆ మహానది శివుని జటాజూట రంధ్రాల నుండి దూకి, నేలపై ఉరికింది. గొప్ప ప్రవాహంతో పొంగి పొర్లింది. పరుగులు తీసే ప్రాయంలో ఉన్న దూడ వెంట పరుగెత్తే కామధేనువులాగ ముందుకు సాగింది. తల్లిలాగ అన్నింటిని కడుపులో దాచుకుంటూ, దేవతలాగ భక్తుల కోర్కెలను తీరుస్తూ ఆ గంగానది భగీరథుని వెంట ప్రవహించింది.

ఆ విధంగా గంగానది అనేక దేశాలను దాటి సాగర చక్రవర్తి కుమారుల బూడిదరాసులను ముంచి ప్రవహించింది. వారందరు గంగా జలంతో పవిత్రులై స్వర్గాన్ని పొందారు.

గొప్ప తపోనిష్ఠకలవాడై శివుని మెప్పించి ఆకాశగంగను అవని మీదకు తెచ్చి అఖండమైన తల కీర్తిలతను కలకాలం విలసిల్లేటట్లు చేసి పితృకార్యాన్ని నెరవేర్చినవాడు, తన వంశానికి వాటిల్లిన కష్టాన్ని తొలగించినవాడు నిత్యమంగళకరుడూ అయిన దిలీపుని కుమారుడు భగీరథుడు సామాన్యుడా?

***

*శ్రీరామావతార చరిత్ర:*

సాధ్వి అయిన కౌసల్యకు శ్రీరాముడు నారాయణ అంశతో జన్మించాడు. చిన్నతనంలోనే తండ్రి ఆజ్ఞతో విశ్వామిత్రుడి వెంట వెళ్ళి రాక్షసులను సంహరించి యాగాన్ని కాపాడాడు. శివధనస్సును విరిచి జనకుని కుమార్తె సీతను ప్రీతితో పరిణయ మాడాడు. గండ్రగొడ్డలి కలిగిన గండరగండడు, రణరంగంలో వీరభయంకరుడు అయిన పరశురాముణ్ణి భంగ పరిచాడు.

శ్రీరామచంద్రుడు సీత కొరకు వానరసేనతో లంకానగరం బయలుదేరాడు. తన ఎదుట లవణ సముద్రాన్ని చూసాడు. తనకు దారి యిమ్మని కోరాడు. కాని సముద్రం దారి ఇవ్వక ఆకాశానికి తాకేటట్టు ఉప్పొంగింది. శ్రీరాముడు రెట్టించిన కోపంతో విల్లంబులు అందుకున్నాడు. సముద్రుడు నదులతో కలిసి రూపుగొని రామచంద్రుని పాదాలను శరణుజొచ్చి ఈ విధంగా స్తుతించాడు:

ఓ గుణనిధీ! నీ కోపానికి నేనెంతటి వాడిని? నీవు లోకాలకు ప్రభువు. ఈ లోకాలు ఎల్లప్పుడు నీ కడుపులో పుడుతుంటాయి, మనుతుంటాయి, నశించిపోతుంటాయి, ఇది సత్యం. ప్రజాపతులను రజోగుణంచేత, దేవతల సమూహాన్ని సత్త్వగుణంచేత, ప్రాణికోటిని తమోగుణంచేత జన్మింపజేసే గుణాతీతుడవు నీవు.

ఓ రామా! నాపై సేతువు కట్టు. లంకను చుట్టుముట్టు. నీ బాణాగ్నిచేత రాక్షసుల తలలు నేలపడేటట్టు కొట్టు. మంగళకరంగా నీ ఇల్లాలిని చేపట్టు. నేను శ్రీహరికి మామను. శ్రీదేవికి తండ్రిని. నీ కీర్తిలతకు ఉనికిపట్టుగా నాపై వారధి కట్టి సముద్రాన్ని దాటు.

వారధి కట్టి సముద్రాన్ని దాటి లంకలో ప్రవేశించిన వానర సైన్యం ప్రాకారాలు త్రవ్వి, అగడ్తలు పూడ్చి, కోట గోడలు పగలగొట్టి, యంత్రాలను చెరచి, గోపురాలను నేలకూల్చి, మకరతోరణాలు మట్టిపాలుచేసి, భవనాలను కూల్చి కల్లోలపరిచారు.

ఆ యుద్ధంలో రామచంద్రుడు కుంభకర్ణుణ్ణి ఖండించాడు. లక్ష్మణుడు మేఘనాదుణ్ణి నేలకూల్చాడు. సూర్యుడు ఉదయపర్వతాన్ని ఎక్కినట్లుగా రామచంద్రుడు దేవేంద్రుడు పంపిన దివ్యరథాన్ని ఎక్కి రావణుడిపైకి ప్రళయాగ్ని సమానమైన బాణం ప్రయోగించాడు. ఆ బాణం రావణుని హృదయాన్ని దూసుకుపోగా నెత్తురు కక్కుతూ నేలకూలాడు.

ఇతరుల భార్యలను, ధనాన్ని కోరేవారు క్షణిక సుఖాలకోసం దేనికైనా తెగిస్తారు. వాళ్ళు వాటిని పాపమని భావించరు. మంచి చెడ్డలని ఆలోచించరు. అలాంటివారికి ఇహపరాలు ఉండవు.

సుగ్రీవుడు, విభీషణుడు రెండు ప్రక్కలా వింజామరలు వీయగా, హనుమంతుడు తెల్ల గొడుగు పట్టగా, భరతుడు భక్తితో పాదుకలను పట్టుకొని రాగా, శత్రుఘ్నుడు విల్లంబులను తేగా, లక్ష్మణుడు దారి చూపుతూ ముందు నడవగా, సీత జలపాత్రను తీసుకొని వెంట నడువగా, అంగదుడు కాంచన ఖడ్గాన్ని ధరింపగా, జాంబవంతుడు బంగారు డాలునిపట్టి సేవింపగా, సమస్త గ్రహాలు కొలుస్తున్న పూర్ణచంద్రునిలాగా ఆ రామచంద్రుడు, పుష్పక విమానాన్ని ఎక్కి ప్రకాశించాడు. అందులో ప్రయాణించి అయోధ్యానగరంలో ప్రవేశించాడు.

భగవంతుడైన రామభద్రుడు ప్రీతితో, సర్వదేవమయుడైన తనగూర్చి తానే యాగాలను చేశాడు. హోతకు తూర్పుదిక్కును, సామగానం చేసేవానికి ఉత్తరదిక్కును, బ్రహ్మకు దక్షణదిక్కును, అధ్వర్యునికి పడమటదిక్కును, మిగిలిన భాగాన్ని ఆచార్యులకు ఇచ్చివేశాడు. కట్టుబట్టలు, ఇల్లాలి తాళిబొట్టు తప్ప మిగిలిన అన్ని ఆభరణాలనూ, సమస్త సంపదలనూ బ్రహ్మవేత్తలైన మునులకు వినయంతో దానం చేశాడు. శ్రీరాముడి దానగుణం ఏమని పొగడగలం.

రామచంద్రుని దానశీలానికి మెచ్చిన మునులు తమకు దానంచేసిన భూములను తిరిగి యిచ్చి వేసి ఇలా అన్నారు.

“రామచంద్రా! ఋషులమైన మాకు ఈ భూము లెందుకు? నీవు అన్ని లోకాలచే పూజింపబడే శ్రీహరివి. నీ దయ అనే క్రాంతులను మాపై ప్రసరింపజేసి మా మనస్సులోకి అజ్ఞానాంధకారాన్ని తొలగించు”.

ఆదిదేవుడైన శ్రీరామచంద్రమూర్తికి సముద్రంపై సేతువు కట్టడం, రాక్షసులను చంపడంఎంత పని? వానరుల సాయం ఏపాటిది? ఇతరులకు తన లీలలను చూపాడంతే.

లవణసముద్రపు అహంకారం అణచినవాడికి, దిక్పాలకుల కిరీటమణికాంతులలో ప్రకాశించేవాడు, దివ్యకీర్తికలవాడు, వేయి సూర్యుల కాంతి పుణికిపుచ్చుకున్నవాడు, అమృతంవలె తియ్యగా మాట్లాడేవాడు, సాధువులను పోషించేవాడు, దశరథరాజు కుమారుడు, రాక్షసరాజుని చంపినవాడూ అయిన శ్రీరాముడిని నేను వినమ్రుడనై ప్రార్థిస్తున్నాను.

నల్లనివాడు, పద్మాలవంటి కన్నులు కలవాడు, గొప్పవిల్లును బాణాలను ధరించినవాడు, విశాలమైన రొమ్ము కలవాడు, మేలు చేకూర్చేవాడు, అన్ని దిక్కుల కీర్తిని వెదజల్లేవాడు అయిన రఘుకుల తిలకుడు మా కోరికలు తీర్పుగాక!

*శ్రీరామనామ సంస్మరణాలు సద్గతులకు ఏకాంత మార్గాలు. గొప్ప పుణ్యాలకు ఆలవాలాలు. ఇప్పుడూ ఇంతకు ముందూ చేసిన పాపాలకు పరిహారాలు.*

సీతాదేవి హృదయాన్ని దోచుకున్నవాడా, తండ్రిమాట జవదాటక కొండకోనల్లో తిరిగినవాడా, జనుల కోరికలు తీర్చడంలో కల్పవృక్షం వంటివాడా, జనకుడు మొదలైన రాజర్షులను అతిశయించిన ప్రవర్తన కలవాడా, లోకరక్షణ కోసం సంచరించేవాడా, శత్రువుల సమూహాన్ని దండించేవాడా, సుగుణాలను ఉద్యానవనంలో విహరించేవాడా, అందగత్తెల అభిమానాన్ని అపహరించేవాడా, పుణ్యాత్ములను పోషించేవాడా, గురువుల హృదయాలకు సంతోషం కలిగించేవాడా, ఎల్లప్పుడూ సత్యాన్ని పలికేవాడా ఓ శ్రీరామచంద్రా నీకు వందనం.

***

*బ్రహ్మజ్ఞాని అయిన నిమి వశిష్ఠుని శాపం వల్ల ప్రాణాలు వదిలాడు. తనను బ్రతికించడానికి మునులు సత్రయాగం చేసారు. అయినా బ్రతకటానికి ఇష్టపడని నిమి ఇలా అన్నాడు.*

మోసంచేత కలత పొందునది, మమతాహంకారాలకు మూలమైనది, ఎడతెగని సుఖదుఃఖాలచేత పీడింపబడేది, అనిత్యమైనది అయిన ఈ శరీరబంధం ఎందుకు? వివేకవంతులు సర్వేశ్వరుడైన శ్రీహరిని సేవిస్తూ మరణభయం కలిగిన ఈ శరీర బంధాన్ని స్వీకరించరు.

***

*పరశురామ చరిత్ర:*

*కార్తవీర్యార్జునుడిని ఓడించి చంపి కామధేనువును తిరిగి తీసుకువచ్చిన తన కుమారుడు పరశురామునితో, జమదగ్ని మహర్షి:*

అందరు దేవతలూ తమ అంశలను రాశిగా చేసి రాజును పుట్టిస్తారు. రాజంటే పెక్కుమంది దేవతల స్వరూపం. అటువంటి రాజును పంతం పట్టి వెళ్ళి ఎందుకు చంపావు?

క్షమ మన ధర్మము. అదే మన మనుగడకు మూలం. క్షమ కలిగి ఉండడం వల్లే మనలను సర్వేశ్వరుడు బ్రహ్మపదంలో నిలిపాడు. క్షమ కలిగి ఉంటే సంపద కలుగుతుంది. క్షమ ఉంటే విద్య అబ్బుతుంది. క్షమ ఉంటే సుఖములన్ని కలుగుతాయి. క్షమ కలిగి ఉంటే దయామయుడైన శ్రీహరి సంతోషిస్తాడు.

పరశురాముడు శమంతపంచకంలో రాజుల రక్తాలతో తొమ్మిది మడుగులు చేసి, తండ్రి తలను తెచ్చి శరీరంతో చేర్చి తానే సర్వమయుడు అయిన దేవుడు కావడంవల్ల తనను గూర్చి తానే యజ్ఞం చేశాడు. దిక్కులను, దిశలను ఋత్విజులకు, సదస్సులకు దానం ఇచ్చాడు. యజ్ఞం పూర్తయాక సరస్వతీ నదీ జలాల్లో అవభృథస్నానం చేసి పాపాలను పోగొట్టుకొని మబ్బు విడిచిన సూర్యుడులాగా ప్రకాశించాడు.

వంశోద్ధారకుడైన కొడుకువల్ల జమదగ్ని సంకల్ప శరీరం పొంది ఆకాశంలోనే సప్తర్షిమండలంలో ఏడవ ఋషిగా వెలిగాడు. ఐహిక బంధాల నుండి బయటపడి శాంతచిత్తుడైన పరశురాముడు ఈనాటికీ మహేంద్ర పర్వతంపై తేజోవంతుడై ఉన్నాడు. వచ్చే మన్వంతరంలో పరశురాముడు సప్తర్షులలో ఒకడిగా వెలుగొందుతాడు.

***

*యయాతి తన భార్య దేవయానితో:*

ఆశ అనే తీగెకు అవధి లేదు. అంతు చూడాలని అనుకున్నా కన్పించదు. తత్త్వం తెలిసినవాళ్ళు ఆ ఆశకు అంతు చూడగలిగితే సంతోషంతో సంసారాన్ని త్యజించగలరు. నగలు, బంగారం, ధనం, ధాన్యం, పశువులు, ఎన్ని  రకాల సంపదలు ఉన్నా ఆశ అనే త్రాడుని ఖండించలేవు. ఇంకా ఏదో కొరత ఉండనే ఉంటుంది.

***

పరమయోగికైనా సరే బలవంతములైన ఇంద్రియాలు కీడు కలిగిస్తాయి. అందుకే తల్లీ కూతుళ్ళయినా, అక్క చెల్లెళ్ళు అయినా సరే వాళ్ళతో కలిసి మగవాడు ఒకే మంచంపై కూర్చోనకూడదు. ముక్తి కోరేవాడు మూర్ఖుడై సంచరిస్తూ కలతపడి చెడిపోకుండా స్త్రీలతో సాంగత్యాన్ని వదలుకోవాలి.

***

యయాతి గొప్ప జ్ఞానంతో అరిషడ్వర్గాలను అణచివేసి రెక్కలు వచ్చిన పక్షి వెంటనే గూడును వదలినట్లుగా సంసార విముక్తుడయ్యాడు. ఉత్తమగతిని పొంది వాసుదేవ పరబ్రహ్మంలో లీనమయ్యాడు.

***

*యదువంశం:*

*భగవంతుడైన విష్ణుమూర్తి మానవరూపాన్ని పొంది ఆ వంశంలో పుట్టినందువల్ల యయాతి పెద్దకొడుకైన యదుమహారాజు వంశాన్ని గురించి విన్నా , చదివినా నరుడు జీవన్ముక్తు డవుతాడు.*

కార్తవీర్యార్జునుడు శ్రీహరి అంశతో పుట్టిన దత్తాత్రేయుని సేవించి యోగవిద్యను, అణిమాది సిద్ధులను పొందాడు. కార్తవీర్యార్జునుని వేయి మంది కుమారులలో, పరశురాముడి బారి నుండి తప్పించుకొని అయిదు మంది మాత్రం బ్రతికారు. *వారి వంశాలకు చెందిన వారే వృష్ణులని, మాధవులని, యాదవులని పేరు పొందారు.*

ఈ లోకంలో ఎప్పుడు ధర్మం నశించి అధర్మం అతిశయిస్తుందో, అప్పుడు విశ్వేశుడైన శ్రీహరి తాను సర్వవ్యాపకుడై ఉన్నా తనను తానే సృష్టించుకుంటాడు. పరమాత్మ, ఈశ్వరుడు, ఆత్మస్వరూపుడు అయిన శ్రీహరి తన మాయచేతనే జన్మకర్మలను పరిగ్రహిస్తాడు.

శ్రీహరి బలరామునితో బాటు యాదవ వంశంలో జన్మించి గొప్ప కార్యాలు చేసి నరుల దుఃఖాన్ని, అజ్ఞానాన్ని నశింపజేసి, భూభాగాన్ని తొలగించి, అన్ని దిక్కుల కీర్తులను వెదజల్లి ప్రకాశించాడు.

మంగళకరమైన ఆ శ్రీహరి కీర్తి గంగామృతం వంటిది. దాన్ని వీనుల విందుగా కొంతైనా త్రాగితే సమస్త కలుషములు నశిస్తాయి. గొప్ప కాంతితో విలసిల్లే శ్రీహరి ముఖాన్ని చూస్తూ స్త్రీపురుషులు తమకు రెప్పపాటున్నందుకు విచారిస్తారు.

నగుమోము, సన్నటి నడుము, నల్లటి దేహము, లక్ష్మీదేవికి ఆటపట్టయిన రొమ్ము, గొప్ప భుజాలు, కుండలాలతో ఒప్పారే చెవులు మదపుటేనుగులా మందగమనం, నీలవర్ణ కుంతలాలు, దయారసం పలికే చూపులూ కలిగిన ఆ శ్రీమహావిష్ణువు నేను రెప్పమూసినా, తెరిచినా కన్నుల పండుగగా కనిపించు గాక!

***

# దశమ స్కంధము

*ప్రార్థన:*

శ్రీరామచంద్రా, నీవు శివుని విల్లు విరిచినవాడవు. ప్రకాశిస్తున్న రఘువంశానికి అలంకార మైనవాడవు. కార్తీకపూర్ణిమ నాటి చంద్రుని వెన్నెల వంటి కీర్తితో విశ్వమంతటా వ్యాపించినవాడవు. నీవు ప్రజలను ఆనందపరుచు రాజువు. అటువంటి నీకు నమస్కారము.

***

*పరీక్షిత్తు శుకమహర్షితో ఇలా అన్నాడు:*

శ్రీహరి స్తోత్రం సంసార బాధలకు ఔషదం. చెవులకు మనస్సుకు ఆనందం. మోక్షం కావాలనుకునేవారికి సరియైన మార్గం. అటువంటి హరిస్తోత్రం విని 'ఇక చాలు' అనే మూర్ఖుడు ఎవరైనా ఉంటాడా? పురుషోత్తముడైన విష్ణువు పురుషరూపంతోను కాలరూపంతోను జీవులందరి లోపల బయటా కూడా ఉంటాడు. అలా ఉండి జనన మరణాలను సంసార బంధాలను మోక్షాన్ని ప్రసాదిస్తూ ఉంటాడు.

***

*శుకుడు పరీక్షిత్తుతో:*

విష్ణు పాదాల నుండి పుట్టిన గంగాజలం వలె విష్ణు కథా ప్రసంగం కూడా విష్ణు కథల యందు ఆసక్తి కలవారిని, ఆ కథలు చెప్పేవారిని, వినేవారిని పునీతులను చేస్తుంది.

ఈ ప్రపంచం అంతా ఏ మాయచేత మోహం చెందుతూ ఉంటుందో, ఆ యోగమాయ విష్ణువు ఆజ్ఞచేత తన అంశతో కార్యనిర్వహణ కోసం భూమి పైన జన్మిస్తుంది.

ఏ మథురానగరంలో శ్రీమన్నారాయణుడు విలాసంగా విహరించాడో ఆ మథురానగరం పూర్వకాలంలో యాదవ ప్రభువులు అందరకూ మొదట రాజధానిగా ఉండేది.

***

*ఆకాశవాణి మాటలు విని దేవకిని చంపబోయిన కంసునితో వసుదేవుడు ఇలా అన్నాడు:*

జన్మనెత్తినవారికి ఆ శరీరంతోబాటే మృత్యువు కూడా పుట్టి ఉంటుంది. నేడో రేపే నూరేళ్ళకో మృత్యువు తప్పదు. మరణం అంటే పంచభూతాత్మకమైన శరీరం తిరిగి పంచ భూతాలలో కలిసి పోవడమే. శరీరం ధరించిన జీవుడు తన కర్మ ననుసరించి మరొక దేహం ఏర్పాటు చేసుకొని మరీ ఉన్న శరీరం విడిచిపెడతాడు.

మనం మెలకువ ఉన్నప్పుడు చూచినవి, విన్నవి, ఆలోచించినవి అయిన పనులు మనకు కలలో చక్కగా కనపడినట్లు, మానవుడు శరీరం విడవగానే కర్మవాసనలన్ని ఆ జీవి వెంట వస్తాయి. పూర్వ కర్మల ననుసరించి, మనస్సు అనేకవికారాలు చెందుతూ ఇంద్రియాలనే మార్గాల వెంట అతి వేగంగా సంచరిస్తూ ఉంటుంది. ఎన్ని శరీరాలు ధరించినా తన కర్మలు మాత్రం ఎక్కడకు పోవు.

చంద్రబింబం, సూర్యబింబం మొదలైనవి నీటికుండలు మొదలైనవాటిలో ప్రతిఫలిస్తూ గాలికి కదులుతూ ఉంటాయి. అలాగే ప్రాణి తన కర్మలచేత నిర్మించుకున్న శరీరాల్లో ఆసక్తి చెంది సంచరిస్తూ ఉంటాడు.

మంచిగాని, చెడుగాని ఎవరైనా తాను చేసుకున్న కర్మల ఫలితంగానే వస్తుంది. బ్రహ్మ అంత వాడికైనా తన కర్మలే తన అనుభవానికి కర్తలు. మనం మన కర్మలు అనుసరించి ప్రవర్తిస్తూ ఇతరులలో దోషాలు వెదకడం ఎందుకు?

***

*వసుదేవుడు తనలో తాను ఇలా అనుకున్నాడు*

మానవులకు పిరికితనం పనికిరాదు. ఎప్పుడైనా కాలమే వాస్తవం అనే వివేకం వదలరాదు. ఆత్మబలంతో గట్టిగా నిలబడి తన బుద్ధి ఎంతవరకూ ప్రసరిస్తుందో అంతవరకూ ఉపాయం ఆలోచించి ఆచరిస్తూ ఉండాలి.

అడవిలో పుట్టిన దావాగ్ని ప్రక్కనున్న చెట్లను విడిచి, ఎగసి ఎక్కడో దూరాన ఉన్న చెట్లను దహించి వేస్తుంది. అలాగే కర్మ ననుసరించి జన్మ, మృత్యువు అనే వాని కారణాలు దూర దూరంగా పోతూ ఉంటాయి. ఇంత తెలిసి కూడా తొట్రుబాటు పడటమెందుకు?

ఈ లోకంలో రాజులు రాజ్యకాంక్షతో తమ జీవితాలను కాపాడుకోవడానికి ఎవరినైనా చంపుతారు. తల్లిదండ్రులు,

అన్నదమ్ములు, స్నేహితులు, బంధువులు ఎవరైనా వారు లెక్కచేయరు.

***

*సర్వేశ్వరుడైన హరి యోగమాయతో "దేవకి కడుపులో ఉన్న శేషుడి తేజస్సును రోహిణి గర్భాన ప్రవేశపెట్టి, నందుని బార్య యశోదకు బిడ్డగా పుట్టు" అని చెప్పి ఇంకా ఇలా అన్నాడు:*

కల్యాణమయీ, నీవు ఎన్నోరకాల సంపదలకు నిలయమని, ఏ కోరికనైనా తీర్చగలవనీ మానవులు నిన్ను భక్తితో పూజిస్తారు. నీకు కానుకలు, బలులు ఇస్తారు. నిన్ను *దుర్గ, భద్రకాళి, విజయ, వైష్ణవి, కుముద, చండిక, కృష్ణ, మాధవి, కన్యక, మాయ, నారాయణి, ఈశాన, శారద, అంబిక - అనే పదునాలుగు నామాలతో పిలుస్తారు.*

రోహిణీదేవి గర్భాన్న ఒక కుమారుడు పుట్టాడు. ఒక గర్భం నుండి తీసి ఇంకొక గర్భంలో ప్రవేశ పెట్టడం వలన పుట్టినవాడు కాబట్టి *'సంకర్షణుడు' అని, చాలా బలవంతుడు కాబట్టి 'బలభద్రుడు' అని,* అందరినీ ఆనందింప జేసేవాడు కాబట్టి *'రాముడు' అని* అతనికి పేర్లు వచ్చాయి.

విష్ణుదేవుని తేజస్సు తనలో ప్రవేశించగా దేవకీదేవి కొత్త కాంతితో దేదీప్యమానంగా ప్రకాశించింది. ఎంతో బరువైన బ్రహ్మాండ భాండాలెన్నో తన కడుపులో దాచుకొన్న విష్ణువు భూమి

నుద్ధరించడానికి దేవకీదేవి కడుపులో ఉదయసూర్యుని లాగ వృద్ధిపొందాడు.

విష్ణువుతో సంభవించిన శత్రుత్వం కారణంగా కంసునికి విష్ణువు తప్ప ఇతర విషయం అంటూ ఏమీ లేకుండా పోయింది. తిరుగుతున్నా, భోజనం చేస్తున్నా, త్రాగుతున్నా, నడుస్తున్నా, కూర్చున్నా, లేచినా ఎల్లప్పుడూ విష్ణువును స్మరించ సాగాడు. క్రోధంతో వేడెక్కిన అతనికి అంతా విష్ణుమయంగా కనపడడం మొదలెట్టింది. చెవులకు ఏ శబ్దం వినబడినా, కనుల కేది కనిపించినా, శరీరానికి ఏది తగిలినా, ముక్కుకు ఏ వాసన సోకినా, మనస్సుకి ఎటువంటి ఆలోచన వచ్చినా దానికి కారణం విష్ణువేమోనని ఉలిక్కి పడుతున్నాడు.

***

*బ్రహ్మాది దేవతలు, దేవకీ గర్భస్థుడైన శ్రీకృష్ణుని ఇలా స్తుతించారు:*

జీవులకందరికీ ఈశ్వరుడవు నీవు. ఈ సృష్టిలో *'సంసారం'* అనే వృక్షానికి *'ప్రకృతి'* అనేది పాదు వంటిది. *'సుఖదుఃఖాలు'* రెండూ దాని ఫలాలు. *సత్త్వము, రజస్సు, తమస్సు* అనే మూడు గుణాలు దానికి వేళ్ళు. ధర్మము, అర్థము, కామము, మోక్షము అనే నాలుగు పురుషార్థాలు రసాలు. *శబ్దం, స్పర్శం, రూపం, రుచి, వాసన* అనే ఇంద్రియాలు ఐదూ దానికి గ్రహించే విధానాలు. *కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు* అనే ఆరు దాని స్వభావాలు. *రసం, రక్తం, మాంసం, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రము* ఆ వృక్షానికి గల ఏడు పొరలు.

*పంచ భూతాలు, బుద్ధి, మనస్సు, అహంకారం* అనే ఎనిమిది ఆ వృక్షానికి కొమ్మలు. *కన్నులు, చెవులు, ముక్కుపుటాలు, నోరు, మల మూత్ర ద్వారాలు* అనే తొమ్మిది ఆ వృక్షానికి గల తొమ్మిది రంధ్రాలు. *ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము అనే పంచ ప్రాణాలు; నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము అనే ఉపప్రాణాలూ* - మొత్తం పది ప్రాణాలు అనే ఆకులు ధరించి ఉంటుంది ఆ సంసారవృక్షం.

జీవుడు, ఈశ్వరుడు అనే రెండు పక్షులు ఆ వృక్షం పై నివసిస్తూ ఉంటాయి. అటువంటి అద్భుతమైన సంసారవృక్షాన్ని పుట్టించడానికి, రక్షించడానికి, మళ్ళీ లయం చేయడానికి, ప్రభువు నీవు ఒక్కడివే.

నీవు నిత్యమూ ఎన్ని శరీరాలు అవసరమైతే అన్ని శరీరాలు ధరిస్తూ లోకాలకు క్షేమం కలుగజేస్తూ ఉంటావు. ఆ శరీరాలతో నీవు మంచివారి కందరికి శుభములు చేకూరుస్తూ, దుష్టులకు శిక్ష విధిస్తూ ఉంటావు. నీవు ఎన్నో అవతారాలెత్తి దయాదాక్షిణ్యాలు మొదలైన గుణాలతో, లోకాలను రక్షించావు. మహా మత్స్య రూపుడవై, కూర్మ మూర్తివై, వరాహ రూపుడవై, నరసింహుడవై, వామనమూర్తివై, హయగ్రీవుడవై, పరశురాముడివై, శ్రీరామచంద్రుడవై, లోకాలను రక్షించిన నీకు మేము నమస్కరిస్తున్నాము. ఈ భూమి భారాన్ని తగ్గించ వలసిందిగా నిన్ను ప్రార్థిస్తున్నాను.

బ్రహ్మాది దేవతలు దేవకీదేవిని చూసి ఇలా అన్నారు. తల్లీ, నీ గర్భంలో పురుషోత్తముడు ఉన్నాడు. రేపు పుట్టబోతున్నాడు. కంసుని వలన నీకు ఏమాత్రం బయం లేదు. ఈ నాటి నుండి అందరికీ క్షేమం కలుగుతుంది. యాదవులందరూ సంతోషంతో ఉంటారు.

***

*శ్రీకృష్ణావతార ఘట్టము:*

దేవకీదేవి ప్రసవించడానికి వేదన పడుతుంటే దుష్టుల మనస్సుల్లో ఏదో తెలియని ఆవేదన మొదలైంది. మంచివారికి కష్టాలు తొలగి సూచనలు కనిపించాయి. సముద్రాలు ఉప్పొంగాయి. మేఘాలు గర్జించాయి. దిక్కుల్ని దివ్యకాంతులతో నిండిపోయాయి. చల్లనిగాలి కమ్మని వాసనలతో వీచింది. దేవతలు పుష్పవర్షాలు కురిపించారు.

విష్ణువును ప్రసవించిన దేవకీదేవి శరీరం మెరుపుతీగలాగ ప్రకాశించింది. ఆ సమయంలో గ్రహాలన్నీ అత్యంత శుభస్థానాలలో ఉన్నాయి. ఆ బాలుడు వసుదేవునికి దివ్యరూపంలో దర్శనమిచ్చాడు. నీలమేఘువర్ణ శరీరం, తామర రేకులవంటి కన్నులు, విశాలమైన వక్షస్థలం, నాలుగు బాహువులలో గద, శంఖం, చక్రం, పద్మం ధరించి ఉన్నాడు. ఆ బాలుని చూచిన వసుదేవుడు పులకించి పోయాడు. పరమాత్మగా గ్రహించాడు. భక్తితో సాష్టాంగ నమస్కారం చేసాడు.

***

*వసుదేవుడు పరమాత్మను తలుచుకొని ఇలా అనుకున్నాడు:*

నీ మాయను చక్కగా నీ నుండి వెలువరిచి సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలుగా విస్తరింప చేస్తావు. ఆ మూడు గుణాలతోనూ జగత్తులన్నీ సృష్టి అవుతాయి. త్రిగుణాలు నీలో నిండి ఉంటాయి కనుక సృష్టిలో నీవు ప్రవేశించడం ఉండదు. అలా అని ప్రవేశించక పోవడమూ ఉండదు.

సృష్టి అంతా నీలో ఉన్నది గనుక సర్వమునకు ఆత్మ అయినవాడవు నీవు. నీ చేత తయారైన వస్తువులతో సర్వమునందు నిండి ఉన్న నీకు లోపల, బయట, మధ్య ఉండే మార్పులు అనేవి లేవు. కనుకనే నీవు సర్వేశ్వరుడవు. ఆత్మ నుండే శరీరం, మనస్సు, మొదలైనవి పుట్టుకు వస్తాయి. వాటిని ఆత్మ కంటె వేరు అనుకునేవాడు మూర్ఖుడు. కనుక విశ్వమంతా నీవే. నీవు కానిది వేరుగా ఏమీ లేదు.

నీ వల్లనే పుట్టిన జగత్తు నీవల్లనే వృద్ధి పొంది నీయందే లభ్యమవుతుంది. నీవు ఎర్రని రంగుతో కూడి ఉన్నప్పుడు రజోగుణరూపుడవై సృష్టి చేస్తావు. తెల్లని రంగుతో కూడి ఉన్నప్పుడు సత్త్వగుణ రూపుడవై ఈ సృష్టిని రక్షిస్తావు. నల్లని రంగుతో కూడి ఉన్నప్పుడు తమోగుణ రూపుడవై సృష్టినంతటినీ లయం చేస్తావు. ఇవన్నీ నువ్వు ధరించే పాత్రలు.

***

*దేవకీదేవి తను జన్మనిచ్చిన ఆ బాలుని వంక చూసి ఇలా అనుకుంది:*

విశ్వేశ్వరా, ఈ విశ్వాన్ని అంతటినీ నీ లీలతో ప్రవర్తింపజేస్తూ ఉంటావు. ఈ శాశ్వతము, అనంతము అయిన కాలమంతా నీవు నడిపించే మాయ. ఈ జగత్తులకు మేలుచేకూర్చే నిన్ను కోరి ఆరాధించేవాడు వివేకవంతుడు. వాడే సమస్త సుఖాలను, శాశ్వత మృత్యుంజయత్వాన్నీ పొందినవాడు. లక్ష్మీదేవికి భర్తైన నిన్ను సేవించేవాడికి భయం అంటే ఏమిటో తెలియదు. ఈ భౌతికమైన కన్నులతో నీ దివ్యరూపాన్ని చూడడం కష్టంగా ఉంది. సర్వానికి ఆధారమైన ఈ స్వస్వరూపాన్ని ఉపహరించుకో. ఓ దేవా, నీకిదే నమస్కారం. సృష్టి అంతా ప్రళయంలో లీనమైనప్పుడు ఈ సమస్త విశ్వాన్ని నీ కడుపులో దాచుకున్న సమర్థుడవైన మహానటుడవు. అటువంటి పరమపురుషుడవు నా కడుపున పుట్టడం నీమాయ కాక మరేమిటి?

***

హరి మాయవల్ల వసుదేవుని కాళ్ళకు ఉన్న ఇనుప గొలుసుల అతుకులు ఊడిపోయాయి. చేతి సంకెళ్ళు తెగి పడ్డాయి. ద్వారాలు వాటంతట అవే తెరుచుకున్నాయి. వసుదేవుడు నెమ్మదిగా పురిటింటినుంచి బయటకు వచ్చి ద్వారాలు ఒక్కొక్కటి దాటుతూ ఉంటే వెనుక నుండి ఆదిశేషువు ద్వారాలు మూస్తూ వెనువెంటనే వచ్చాడు. పడగలు విప్పి ఆ బాలుడికి గొడుగులా పట్టి నడిచాడు.

అలా వెళ్తూ ఉండగా అతని దారికి యమునానది అడ్డు వచ్చింది. పరవళ్ళు తొక్కుతూ ప్రవహిస్తున్న యమునానది వసుదేవునికి దారి ఇచ్చింది.

***

*కంసుడు దేవకీవసుదేవులతో:*

తమతమ కర్మలు జీవులను వెనుకనుండి తోస్తూ నడిపిస్తుంటాయి. తమ కర్మల ఫలితంగానే జీవులు తమకు అనుకూలమైన శరీరంతో ఒక్కచోట జన్మిస్తారు. వేరువేరు చోట్ల నుండి వచ్చినవారు ఒకచోట జీవించి, ఎవరి దారిని వారు వెళ్ళిపోతారు. ఒకచోట ఉన్నప్పుడు కలిసిన స్నేహాలను అక్కడ వదిలి వెళ్ళిపోతారు.

ఎవడు చంపేవాడు? ఎవడు చనిపోయేవాడు? మీ బిడ్డలను నేను చంపినవాడనూ కాదు, వారు చంపబడినవారూ కాదు. శత్రువులను తాను బాధ పెట్టాననీ, శత్రువుల వల్ల తాను బాధలు పడ్డాననీ అమాయకుడైనవాడు అనుకుంటాడు. సత్యం తెలిసి ఆలోచిస్తే ఆత్మకు స్నేహం, విరోధం ఏమున్నాయి? వాటి మధ్య సంబంధం కేవలం కర్మల బంధం మాత్రమే.

***

*దేవకీ వసుదేవులను బంధవిముక్తులను చేసి దిగులుగా తన మందిరానికి వెళ్ళిన కంసునితో మంత్రులు ఇలా అన్నారు:*

శత్రువులు దెబ్బ తిన్నారనుకొని రాజు విచ్చలవిడిగా తిరగరాదు. వారు ఎన్నోరకాల వేషాలతో దొంగతనంగా రాగలరు. వారు చచ్చేంతవరకూ రాజైనవాడు వారిని మరచిపోరాదు. విజృంభించిన రోగాలను, శత్రువులను, ఇంద్రియాలను అవి మనలను ఆక్రమించే వరకూ ఊరుకోరాదు. మొదట్లోనే త్రుంచివేయడంలో మెతకతనం పనికిరాదు. ముదిరిన తరువాత జయించడం మన తరంకాదు.

***

*గోపికలు నందుని ఇంటికి వచ్చి చిన్ని కృష్ణుని చూసి సంతోషించారు.*

గోపికలందరూ కలిసి నందుని ఇంటికి వచ్చి ఆ బాలుని తలకు నూనె అంటి, శరీరానికి పసుపు పూశారు. స్నానం చేయించారు. తొట్టిలో పడుకోబెట్టి జోలపాటలు పాడారు.

ప్రళయ సమయంలో ఎన్నోరకాల జగత్తులను నీటిలో ముంచివేసి, తాను ప్రకాశిస్తూ ఉండే ఆ మాయగాడు గోపికల చేతుల్లో జలకాలాడుతూ కేరింతలు కొడుతూ ఆడుకున్నాడు. లోకాలన్నింటిని నిదుర పుచ్చుతూ, తానొక్కడూ మెలుకువగా నుండే ఆ అందగాడు గోపికలు జోకొట్టుతూ ఉంటే నిద్రపోయినట్లు కనులు తెరవకుండా, కదలకుండా పడుకున్నాడు.

కష్టాలు అనేవి తెలియని మహాత్ముడు పశువుల కాపరులయింట బాధలతో పెరగవలసి వచ్చింది. కర్మములు అనేవి లేకుండా తానొక్కడే ప్రకాశించే విష్ణువు జాతక కర్మలు చేయించుకున్నాడు. తానే జగత్తులకు తల్లి తండ్రి అయినవాడు యశోదాదేవి చనుబాల రుచి మరిగాడు. పెరుగుట, తరుగుట యెరుగని పరమాత్మ యశోదమ్మ ఒడిలో పెరగసాగాడు.

ఎన్ని తపస్సులు చేసినా పండని బంగారు పంట వ్రేపల్లెవాడలో కన్నుల పండుగగా పండింది. ఎన్ని శాస్త్రాలు చదువుకున్నా 'ఇలా ఉంటుంది' అని తెలియని పరమార్థం అందాలు చిందే ఆ బాలుని అవయవాలన్నింటిలోనూ వ్యక్తం కాసాగింది.

ఆ చిన్నికృష్ణుడు బాల్య చేష్టలు చేస్తూ క్రొత్తక్రొత్త లీలలు ప్రకటించేటప్పుడు సృష్టికర్తయైన బ్రహ్మదేవుడి వలె వెలుగొందుతాడు. సంతోషం నిండిన చూపులతో నవ్వుతూ ఉన్నప్పుడు శ్రీమహావిష్ణువు వలె కనుపిస్తాడు. కోపం వచ్చి రోషం తెచ్చుకున్న సమయంలో రుద్రునివలె భయం కొలుపుతాడు. సుఖంతో, ఆనందంతో, తన్మయుడై ఉన్న సమయంలో పరబ్రహ్మంలా గోచరిస్తాడు. ఈ విధంగా ఎన్నో రీతులతో నందుని ఇంట బాలకృష్ణుని బాల్యం గడుస్తూ ఉంది.

***

*కంసుడు పంపిన పూతన అనే రాక్షసి శిశువులను చంపడంలో ఆరితేరినది. నందుని ఇంటికి అందమైన యువతివేషం ధరించి వచ్చింది.*

పూతన ఊయలలో నిద్రిస్తున్న బాలకృష్ణునితో "నా చనుబాలు ఒక గ్రుక్కెడు త్రాగి చూడు. అపుడు నీ అందమెలా ఉందో తెలుస్తుంది. అందువల్ల ఇప్పుడున్న నా అందానికి ఫలితం దక్కుతుంది" అని తన చన్ను కుడపడానికి ప్రయత్నించింది.

కృష్ణుడు అప్పుడే మేలుకున్నట్లు నెమ్మదిగా కనులు తెరిచాడు. అప్పుడే విచ్చిన తామరపువ్వులవంటి కన్నులుగల బాలకృష్ణుడు పాలు కుడిచే నెపం మీద రెండు గుక్కలలో పూతన శరీరంలోని సత్తువ అంతా త్రాగేసి, చివరకు పూతను తన లీలతో అవలీలగా సంహరించాడు. మరి పూతన మృత్యువువలె ఎంతోమంది పసిపాపలను చంపింది, మునులను బాధ పెట్టింది.

ఆ బాలుడు సాక్షాత్తు విష్ణువు. విషజంతువులైన నాగులను చీల్చివేసే గరుత్మంతుడు అతని వాహనం. విషాన్ని కంఠంలో ధరించిన శివుడు అతని మిత్రుడు. అటువంటి విష్ణువుకు ఒక రాకాసి చన్నులలోని విషాన్ని లాగివేయడం ఒక గొప్ప విషయమా?

గోపికలు బాలకృష్ణుడికి రక్ష కట్టడం ప్రారంభించారు. "చిన్ని తండ్రీ, నీ పాదాలు బ్రహ్మ, మోకాళ్ళు వాయువు, తొడలు యజ్ఞుడు, నడుము అచ్యుతుడు, కడుపు హయగ్రీవుడు, హృదయం కేశవుడు,

వక్షస్సు ఈశుడు, భుజాలు చతుర్భుజుడు, ముఖము త్రివిక్రముడు, శిరస్సు ఈశ్వరుడు రక్షిస్తారు.”

కృష్ణుడు తనపై కాళ్ళు చేతులు వేసి దగ్గరకు వచ్చి, చనుబాలు త్రాగినంత మాత్రానే అంతటి క్రూర రక్కసి తాటకి పాపాలు పటాపంచలై పోయి, విష్ణువు తల్లివలె పరమగతి పొందింది. ఇక విష్ణువును కన్నతల్లికి, పాలిచ్చి పెంచిన తల్లికి మోక్షమే కాని మళ్ళీ జన్మ ఉంటుందా! హరికి పాలిచ్చిన గోమాతలు కూడా ముక్తిలోకం పొలిమేరల్లో తిరుగుతూ ఉంటాయి.

బాలకృష్ణుని సంస్మరణలు సంసారమనే గొప్ప సముద్రాన్ని దాటించే నావలు. అవి సర్వ పాపాలను పారద్రోలుతాయి. సకల సంపదలను కలుగ చేస్తాయి. ఎవరికైనా మోక్షం కావాలంటే బాలకృష్ణుని సంస్మరణలు మూలాధారాలు.

సజ్జనుడైనవాడు అందరి యెడలా సమబుద్ధితో ఉంటాడు. కనుక రక్షణ అంటూ వేరే లేకపోయినా కష్టాల్లో రక్షింపబడతాడు. దుర్జనుడు పాపపు ఆలోచనలు చేస్తూ ఉండటం వలన, ఎన్ని రక్షణ ఏర్పాట్లు చేసుకున్నా శిక్ష పొంది తీరుతారు.

***

*బలరామకృష్ణుల బాల్యక్రీడలు:*

ఆ బాలకులు నేలపైన ప్రాకుతూ మెల్లగా తలలెత్తి ఆడుతూ ఉంటే ఆదిశేషును పడగెత్తి ఆడినట్లా కనిపిస్తారు. మట్టిలో ఆడుకొని ఒళ్ళంతో మట్టి పులుముకొన్నప్పుడు ఏనుగు గున్నలవలె కనుపిస్తారు. కుప్పించి దూకుతున్నప్పుడు సాటిలేని జవసత్త్వాలతో సింహపు పిల్లలవలె కనుపిస్తారు. రోజురోజుకు వారి ముఖాలలోని తేజస్సు పెరుగుతూ ఉంటే ఉదయించిన సూర్యచంద్రులవలె గోచరిస్తారు. తల్లిపాలు త్రాగి పరవశిస్తున్నప్పుడు యోగీశ్వరులవలె కనబడతారు.

విష్ణువు తనవంక చూడని వారిని ఎన్నడూ చూడడు. అతని చూపులో మూడులోకాలు గిర్రున తిరుగుతూ ఉంటాయి. అంతటి శ్రీమహావిష్ణువు  గోపాలబాలకుడై జనులను కనులెత్తి చూసి గుర్తుపట్ట సాగాడు.

ఆ బాలకృష్ణుడు నెమ్మదిగా నవ్వటం నేర్చాడు. అతడు చిరునవ్వు నవ్వితే దట్టమైన అజ్ఞానం పారిపోయి, జ్ఞానం పుట్టుకు వస్తుంది.

విష్ణువు సహస్ర శీర్షుడు, సహస్రాక్షుడు, సహస్రపాదుడు. అలా వేయి పాదాలు కలిగిన వాడైనా, వామనుడు రెండే రెండు అడుగులతో భూమినీ, ఆకాశాన్ని ఆవరించిన వాడు. అటువంటివాడు ఇప్పుడు బాలకృష్ణుడై తప్పటడుగులు వేయడం నేర్చుకున్నాడు.

ఆటపాటల సమయంలో బాలకృష్ణుడు పరమశివునివలె కనిపించేవాడు. వాని దేహానికి అంటిన మట్టి విభూతి పూతవలె కన్పించేది. ముత్యాల దండ కట్టిన ఉంగరాల జుత్తు ముడి శివుని తలపై ఉండే చంద్రవంకలా కనబడుతుంది. నుదుట పెట్టిన ఎర్రని తిలకం శివుని పాల నేత్రంలా కనబడసాగింది. మెడలోకి ముత్యాలహారాలు శివుని మెడలోకి సర్పంలా కనబడుతున్నాయి. విష్ణువు తాను, శివుడూ ఒకటే అని హెచ్చరించినట్లుగా బాలకృష్ణ అవతారంలో తన లీల చూపించాడు.

సర్వలోకాలకు ప్రభువైన ఆ లీలామానుషధారి తల్లికి తన నోరు తెరిచి చూపించాడు. యశోదాదేవి ఆ పసివాడి నోటిలో సముద్రాలు, పర్వతాలు, అరణ్యాలు వీటితో కూడి భూగోళము, అగ్ని, సూర్యుడు, చంద్రుడు, అష్టదిక్పాలకులు వీరందరితో కూడిన బ్రహ్మాండం మొత్తాన్ని చూచింది. ఆమె విభ్రాంతురాలైంది.

మత్స్యావతారం ధరించి నీటిలో జొరబడతావు. కూర్మావతారం ధరించి వీపు మీద కొండ నెత్తుతావు. వరహావతారం ధరించి భూదేవిని కోరలపై నిలిపి ఆడుకుంటావు. నరసింహావతారంలో స్తంభాలు కదలిస్తావు. పరశురామావతారంలో రాజులను వేటాడుతావు. రామావతారంలో సముద్రానికి వంతెన కడతావు. కృష్ణాతారంలో బలరామునితో కలిసి హరిపై దిగి వస్తావు. నీవు కల్కావతారం ఎందుకు ఎత్తుతావో తెలియదు.

నారాయణునకు లోపల, వెలుపల అనేవి; మొదలు, చివర, మధ్య అనేవి ఏమీ లేవు. ఈ లోకాలన్నిటికీ మొదలు, చివర, లోపల, వెలుపల- అన్నీ ఇతడే. ఇటువంటి నారాయణుణ్ణి కట్టి వేయాలంటే, పరమ భక్తురాలు గనుక యశోదకు సాధ్యమైంది గాని మరొకరికి సాధ్యమవుతుందా?

ఆ లీలా గోపాలబాలుడు లక్ష్మీదేవి కౌగిటిలో చిక్కలేదు. సనక సనందనాదులైన మహాయోగుల హృదయాలలోనూ చిక్కలేదు. అటువంటివాడు లీలగా అవలీలగా తల్లి చేతిలో చిక్కి రోటికి కట్టివేయబడ్డాడు. కన్నతల్లి కష్టం చూడలేక ఆమె కట్టుకున్న త్రాటికే కట్టుబడిపోయాడు.

ప్రియమిత్రుడై మెలిగా శివుడుగానీ, తన వక్షస్థలాన్ని ఆశ్రయించుకున్న లక్ష్మీదేవిగానీ, తన కొడుకని విర్రవీగే బ్రహ్మదేవుడుగానీ శ్రీహరి వలన యశోద పొందిన ఆ అనుగ్రహాన్ని పొందలేకపోయారు.

***

ధనవంతుడు ఎవరినీ లెక్కచేయడు. తన ధర్మాన్ని, శరీరాన్ని, సంసారాన్నీ, నమ్ముకొని ఇతరులను హింసించాలనే చూస్తాడు. దరిద్రుడు కష్టాలు అనుభవిస్తూ కూడా ఇతరులను హింసించడు. వారూ తనవంటివారే కదా అని ఆలోచిస్తాడు. ఇది లోకరీతి. కనుక ధనమదాంధులైన వారికి దారిద్ర్యం చక్కని అంజనం అవుతుంది.

*తనను కీర్తించిన మణిగ్రీవ నలకూబరులతో బాలకృష్ణుడు:*

తమ తమ ధర్మాలు తప్పకుండా అందరియెడల సమత్వంతో నన్ను నమ్మి తిరుగుతూ ఉండేవారు సజ్జనులు. అటువంటివారికి నన్ను చూడగానే సూర్యోదయంతో దట్టమైన చీకటి విరిసి పోయినట్లు బంధం విడిపోయి, మోక్షం లభిస్తుంది.

***

*బకాసురుడు:*

ప్రక్క ప్రక్కనే ఉండే బ్రహ్మాండాల నన్నింటిని తనలోనుండి పుట్టిస్తూ మళ్ళీ మ్రింగివేస్తూ, ఆడిస్తూ ఉండే క్రీడామయుడైన కృష్ణుడు బకాసురునిచేత మ్రింగుడు పడ్డాడు. రాకాసి కొంగ గొంతును దాటి లోపలికి పోకుండా నిప్పుముద్దలాగా ఆ అసురుని కంఠానికి అడ్డుపడ్డాడు.

మహాయోగులు కూడా ఏ పరమ పురుషుని పాదపద్మాల ధూళి కొంచెం కూడా చూడలేరో అటువంటి కృష్ణునితో గోపబాలురు కలిసి ఆడుకున్నారు. అతన్ని కౌగలించుకుంటూ, అతనితో చెట్టాపట్టాలు వేసుకుంటూ, హాస్యాలాడుతూ, మీదపడుతూ, కలిసి ఆడుకుంటూ ప్రేమిస్తున్నారు. ఆ గోపబాలుర భాగ్యం ఎంతగొప్పదో!

యోగులకు బ్రహ్మానందస్వరూపుడు, భక్తులకు ఆరాధ్యదైవమూ అయిన ఆ శ్రీకృష్ణుడు అజ్ఞానులకు బాలునివలె కనిపించేవాడు. ఆయన ఎవరు ఏ విధంగా భావిస్తే ఆ విధంగా అనుగ్రహించేవాడు. అటువంటి

పరమాత్మ సాన్నిధ్యాన్ని పొందిన గోపాలుర వంటి పుణ్యాత్ములు మరెక్కడైనా ఉన్నారా?

***

*గోపబాలురను మ్రింగిన అఘాసురుడనే మహాసర్పాన్ని వధించి కృష్ణుడు వారిని కాపాడుట:*

గోపబాలుర మనస్సులన్నీ ఎప్పుడూ కృష్ణుని చుట్టూ తిరుగుతాయి. వారు తమను తాము కృష్ణుడికి సమర్పించుకున్నారు. కనుక మహాసర్పం మ్రింగినా ధైర్యంగా ఉన్నారు. కృష్ణుడు సర్వమూ చూడగలవాడు. ఆ కొండచిలువ నాలుకతో వారిని చిందర వందర చేసి కొద్ది కొద్దిగా మ్రింగడానికి ప్రయత్నిస్తుంటే కృష్ణుడు కంఠద్వారం చేరి, తన శరీరాన్ని విపరీతంగా పెంచాడు. ఇక ఆ పాముకు ఊపిరి ఆడక తల బ్రద్దలై ప్రాణాలు వదిలింది.

గోపబాలురను లేగ దూడలతో సహా తన కరుణ అనే అమృతవర్షంతో రక్షించాడు. స్వార్థపరులైన దేవతల కోసం మంచివాడైన బలిచక్రవర్తిని ధిక్కరించి, బ్రహ్మాండమంతా ఆవరించిన వామనమూర్తి గదా విష్ణువు. అమాయకులైన గోపబాలుర కొరకు పాపిష్టి పాము గొంతుక పగిలేటట్లు వ్యాపించడంలో ఆశ్చర్యం ఏముంది?

అంతటి పాపిష్టి పాము కృష్ణుని స్పర్శతో ప్రాణం వదలగానే కృష్ణునిలో ఐక్యమయ్యింది. శ్రీహరి రూపాన్ని ఒక్కసారి మనస్సులో తలుచుకుంటే ఎంతటి పాపాత్ముడినైనా శ్రీహరి తనలోనికి స్వీకరిస్తాడు.

అటువంటి తనసే మ్రింగిన రాక్షసులని తనలోనికి స్వీకరించడంలో ఆశ్చర్యం ఏముంది?

***

*శ్రీకృష్ణుడు బ్రహ్మకు తానే అన్నిటియందు అన్ని రూపాల్లో ఉండటం అనే తన లీలను చూపాడు:*

యజ్ఞఫలాన్ని భుజించే శ్రీహరి గోపబాలురతో కలిసి బాల్యక్రీడలలో చెలరేగుతూ ఊరగాయ ముక్కలతో చల్ది ఆరగిస్తుంటే దేవతలందరూ నివ్వెరపోయి నోళ్ళు తెరచుకొని చూస్తున్నారు.

శ్రీహరి మోహం అంటనివాడు. కాని తాను జగత్తులన్నిటినీ మోహింపజేయగల నేర్పరి. అటువంటి విష్ణువును మోహింప చేద్దామనుకొని మోహపడిన బ్రహ్మ తానే మోహితుడై పోయాడు.

పగటివేళ మిణుగురు పురుగుల కాంతి తేలిపోతుంది. రాత్రివేళ మంచు చీకటిలో కలిసిపోయి మాయమవుతుంది. అలాగే విష్ణువు మాయకు పుట్టినిల్లు. అటువంటి విష్ణువుపై ఇతరుల మాయలు పనిచేస్తాయా? ఆ మాయలు పసచెడి విడిపోతాయి. అది ప్రయోగించినవారి గౌరవాన్ని కూడా చెడగొట్టేస్తాయి.

భక్తి అనేది సర్వశుభాలనూ వర్షిస్తుంది. అటువంటి శక్తిని వదలిపెట్టి కేవలం జ్ఞానం కోసం తపస్సు చెయ్యటం వ్యర్థం. ఎంత ఎక్కువగా కూడబెట్టినా బియ్యం పైన ఉండే ఊక వలన ఏమి లాభం.

ఆకాశంలో మెరిసే తారలను మంచు తుంపరలను భూమి మీద దూకి కణాలను అయినా లెక్క పెట్టడం సాధ్యం కావచ్చు కాని భూభాగాన్ని తగ్గించడానికి అవతరించిన నీ మనోహరమైన గుణాలను ఎంతటి పండితులైనా రక్షింపలేరు. నీవు అన్ని లెక్కలకు పైనున్నవాడవు.

ప్రభూ, కడుపులో ఉన్న పాపడు కాలితో తన్ని బాధపెట్టినా తల్లి కోపగించదు కదా! సూక్ష్మము, స్థూలము అయిన కారణరూపము, కార్యరూపము అయిన  ఈ సృష్టి అంతా నీ కడుపులోనిదే కదా! మరి నేను నీ బిడ్డను కాక మరెవ్వడను?

కమలముల వంటి కన్నులు గల కృష్ణా, భక్తితో నిన్ను స్మరించనంత కాలము ఎవరికైనా శరీరం-కారాగారము; మోహము-సంకెళ్ళు; రాగద్వేషాదులు-శత్రువ్యూహాలూ అవుతాయి.

నీవు త్రిమూర్తులకు మూలమైన ఆదినారాయణుడవు. అన్ని భూతములు, జీవరాశులు వస్తూ పోతూ ఉంటే నీవు సాక్షిగా ఉంటావు. నీవు వాటన్నింటికీ అధిష్ఠానమైన ఈశ్వరుడవు. నీ నిజమైన రూపం ఇది అది అనడానికి వీలులేదు. నీవు ఎన్నో రూపాలు, కాంతులు కలవాడవు. నీ మాయా ప్రభావంతో ఏ విధంగానైనా ఉండగలవు.

బుద్ధిమంతులైనవారు శ్రీహరిపాదము అనే నావను ఆధారంగా చేసుకొని, సంసారం అనే సముద్రాన్ని ఒక లేగదూడ ఒక అడుగును

అంగ వేసి దాటినంత తేలికగా దాటి, ఆపద అనే స్థితిని పొందకుండా, అమృత స్థితిని పొందుతారు. అంటే తనలోని 'నేను' అనే ఆత్మకి మరణం లేదని గ్రహిస్తారు.

***

*గార్ధబాకారంలో వచ్చిన ధేనుకాసురుని బలరాముడు వధించుట:*

దారపు పోగులు మూలపధార్థమై ఉండగా, వాటి ఆధారంతో వస్త్రం అల్లిక చేయబడుతుంది. ఆ విధంగా పరమేశ్వరుని రూపము ఈ జగత్తుకు మూల పధార్థము కాగా, ఈ సృష్టి అంతా అతనియందు అల్లిక చేయబడుతూ ఉన్నది. అటువంటి స్వామి ఒక రాక్షసుని చంపగలగడంలో ఆశ్చర్యం ఏముంది?

***

*కాళీయమర్ధనం తరువాత కాళీయుని భార్యలు శ్రీకృష్ణుని స్తుతించి తమ భర్త ప్రాణాలు రక్షించమని వేడుకున్నారు:*

ఈ కాళీయుడు పూర్వజన్మలో ఎటువంటి తపస్సు చేశాడో? ఎటువంటి మంచి చేశాడో? ఎటువంటి మహానుభావులకు ఏనాడు దగ్గరగా వెళ్ళని నీవు ఈ కాళీయుని పడగలపైన నాట్యం చేశావంటే అదెంతటి భాగ్యమో?

పూర్వం స్త్రీలందరిలోనూ ఉత్తమురాలైన లక్ష్మీదేవి, ఎంతోకాలం తపస్సుచేసి, పట్టుదలతో వ్రతాలు చేసి గొప్ప తేజస్సుతో వెలుగొందే నీ పాదధూళిలో ఒక్క కణాన్ని తాకే అర్హత సంపాదించుకుంది.

అటువంటిది ఈ కాళీయుడు ఏతపస్సు చేయకుండానే నీ పాదాల పవిత్ర స్పర్శకు నోచుకున్నాడు. ఇది ఎంతటి అద్భుతం!

అతి పవిత్రమైన నీ పాదరేణువుల స్పర్శ పొందిన ధన్యులు చక్రవర్తి పదవికే కాదు వరుణుని పదవికి, దేవేంద్ర పదవికి, బ్రహ్మ పదవికి కూడా ఇష్టపడరు. అటువంటి పాదరేణువుల స్పర్శ ఏ జన్మలోనూ ఎవరూ పొందలేనిది ఆ సర్పరాజు కాళీయుడు పొందాడు. ఏ జన్మలో ఎంతటి పుణ్యం చేశాడో?

***

*శరత్కాలపు రోజులలో శ్రీకృష్ణుడు హాయిగా ఆలమందలతో కూడి బృందావనంలో పశువులను మేపాడు:*

ఆ గోపాలసార్వభౌముడు పిల్లనగ్రోవి చేతబూని బ్రహ్మగాంధర్వగీతి ఆలపించాడు. కుడిచేతి కోమలమైన వ్రేళ్ళ నైపుణ్యం షడ్జస్వరానికి ధ్వని రహస్యాలు నేర్పింది. ఎడమ కాలిమీద అడ్డంగా సాచి ఉంచిన కుడికాలిగోళ్ళ కాంతి భూమిపై ఆవరించింది. సిగలోన నెమలి పించము, మెడలోని వైజయంతీమాల మిలమిల మెరిసాయి. ఆయన మొహం విశ్వాన్ని మోహింపజేసే సోయగంతో అలరారింది. పారవశ్యంతో శ్రీకృష్ణుడు పిల్లనగ్రోవి రంధ్రాలను మోవిసుధచే పూరిస్తూ మురళి వాయించాడు. ఆ పిల్లనగ్రోవి పాటవిని గొల్లభామలు సిగ్గులు విడిచి గుంపులుగా కూడి తమలోతాము ముద్దు ముచ్చటలకు ఉపక్రమించారు. ఆ భామలు శ్రీకృష్ణుణ్ణి మనస్సులోనే మాటిమాటికి కౌగలించుకున్నారు.

*గోపికా వస్త్రాపహరణము:*

వలువలు దొంగిలించిన శ్రీకృష్ణుడు పిల్లవానిలాగా తోటిపిల్లలతో కూడి, పరిహాసానికి ఆడువారి చీరలు అపహరించి, ఒక కడిమిచెట్టును ఎక్కాడు. అతడు అలా ఎక్కగానే ఆ చెట్టు వృక్షజన్మం వల్ల కలిగిన దుఃఖాన్ని వెంటనే పోగొట్టుకుంది.

కృష్ణా ఇదేమి పని! మత్స్యావతారంలో జలరాశిలో విలసిల్లిన వాడివి, కూర్మావతారంలో కొండను మూపున నిలిపినవాడివి, వరాహావతారంలో భూదేవిని పైకెత్తినవాడివి, నరసింహావతారములో నీ భక్తుడైన బాలుడిని రక్షించినవాడివి, వటరూపంలో బలిచక్రవర్తిని అణచినవాడివి, పరశురామావతారంలో దుష్టులైన రాజులను సంహరించినవాడివి, రామావతారంలో తండ్రి యానతి తలదాల్చినవాడివి, గుణవంతుడివి అయిన నీవు ఇలా మా చీరలు దొంగిలించడం న్యాయమా! వాటిని మాకివ్వు – అని గోపికలు వేడుకున్నారు.

శ్రీకృష్ణుడు దయార్ధహృదయుడు, భక్తజనపరిపాలకుడు. అందుకనే చలిగాలికి వణుకుతున్నవారు, ఒయ్యారంగా వంగి వందనం కావించినవారు అయిన ఆ భామలకు వలువ లొసగినాడు.

***

*గొడుగులవలె నీడనిస్తున్న చెట్లను చూసి గోపబాలురు ఇలా అన్నారు:*

ఈ చెట్లను చూడండి. ఎవ్వరికీ కీడుచేయవు. ఎవరి జోలికి పోకుండా ఏకాంతంగా ఉంటాయి. ఎండ, వాన, గాలి, మంచుల బారినుండి ఆశ్రితులను కాపాడుతూ ఉంటాయి. కోరినవారికి తమ గంధము, జిగురు, తేనె, ఆకులు, కాయలు, పళ్ళు, వేళ్ళు, కొమ్మలు ఇచ్చి మేలు చేస్తాయి.

***

*మునిపత్నులు కాళిందీ నదీతీరంలో ఒక అశోకవృక్షం క్రింద సేదతీరుతున్న దేవకీనందనుని సందర్శించారు:*

ఆ గోకుల విహారి ఒక మిత్రుని భుజంపై చేయివేసి రెండవ చేతితో విలాసంగా పద్మాన్ని తిప్పుతున్నాడు. ఆయన నున్నని చెక్కిళ్ళపై ముంగురులు చిందులు వేస్తున్నాయి. ఆయన తలచుట్టూ గుబురైన నెమలి పింఛపు దండ ధరించాడు. చెవి సందున కలువపువ్వు పెట్టుకున్నాడు. పూలు చేర్చిన వనమాల మెడలో ధరించాడు. ఆయన జగములను సమ్మోహపరిచే నటవేషంలో విరాజిల్లుతున్నాడు. అట్టి లీలామానుష విగ్రహుణ్ణి ఆ బ్రాహ్మణస్త్రీలు కన్నుల కరువు తీరేటట్లు చూసారు. ఆధ్యాత్మికము ఆధిభౌతికము ఆధిదైవికము అనే తాపత్రయాలు ఉపశమింపగా, హృదయాలలో అతనిని కౌగలించుకున్నారు. వాసుదేవుడు వారు తెచ్చిన ఆహారాన్ని ఆరగించాడు.

యాగములు, మంత్రము, తంత్రము, ద్రవ్యము, కాలము, దేశము, దేవతలు, అగ్ని ఏ పరమేశ్వరమయమో అట్టి ఆ పరమేశ్వరుడు మానవ రూపంలో శ్రీకృష్ణుడుగా అవతరించాడు. రమానాథుడు, అన్నింటికి కర్త, భూమండలాన్ని ఉద్ధరించువాడు, రాక్షసరాజులను సంహరించువాడు అయిన నందనందనునకు ఇవే వందనాలు.

***

*శ్రీకృష్ణుడు గోవర్ధనపర్వతమునెత్తుట:*

ఆదివరాహమూర్తియై భూదేవిని పైకెత్తిన అచ్యుతుడు, ఒక ఏనుగు తామరమొగ్గను పైకెత్తినట్లు ముల్లోకాలకు సంతోషం సమకూర్చడానికి అవలీలగా ఒక్క హస్తంతో గోవర్ధనగిరిని గొడుగులా పైకెత్తాడు.

బ్రహ్మాండాలను బంతులవలె ఎగురవేసే గోవిందుడికి ఒక కొండను పెల్లగించి పైకెత్తడం ఓ చిన్నపని కాక అదేమైనా పెద్ద ఘనకార్యమా?

శ్రీకృష్ణుడు ధరించిన గోవర్ధనగిరి అనే గొడుగు దేవేంద్రుడి దురహంకారాన్ని పోగొడుతూ ప్రజలను రంజిస్తూ ప్రకాశించింది. ఆ కొండ గొడుగునకు పురుషోత్తముని భుజాదండమే కఱ్ఱ.

దేవేంద్రుడు అదితితోనూ మునీశ్వరులతోనూ కూడినవాడై కామధేనువు పాలతో, ఐరావతం తన తొండం నిండా తెచ్చిన మందాకినీ

నదీజలాలతో, దుష్టులను శిక్షించేవాడు, సాధువులను రక్షించేవాడు అయిన పుండరీకాక్షుణ్ణి అభిషేకించాడు.

దయాస్వభావుడైన ఆ పరమేశ్వరుడు మాయకు అతీతమై, జ్యోతిస్స్వరూపమై, సత్యమై, జ్ఞానానందమయ పరబ్రహ్మమై, పుణ్యాత్ములు త్రిగుణరాహిత్యమున దర్శించే శాశ్వతమైన తన లోకాన్ని కరుణామయ హృదయంతో గోపకు లందరికీ చూపించాడు.

చుట్టరికంతోనైనా, విరోధంతోనైనా, కామంతోనైనా, సంతోషంతోనైనా, ప్రాణభయంతోనైనా, భక్తితోనైనా శ్రీహరి ధ్యానంలో ఉండే జనులు ముక్తిని పొందుతారు.

***

*గోపభామినులు బృందావనంలో శ్రీకృష్ణుని వెతుకుతూ ఇలా అంటున్నారు:*

నల్లనివాడు, పద్మములవంటి కన్నులుగలవాడు, కరుణారసము చిందించేవాడు, సిగపై వ్యాపించిన నెమలిపురి కలవాడు, చిరునవ్వు చిందే మొహము గలవాడు అయిన ఒకానొక కుర్రవాడు, మానినుల మానధనం దోచి తెచ్చినాడు. ఓ మల్లెతీగలారా! మీ పొదలమాటున లేడుగదా! ఉన్నట్లయితే చెప్పండమ్మా!

ఓ భూదేవీ! వరహావతారం ధరించినప్పుడు నిన్ను కౌగిట జేర్చుకొన్నాడు. త్రివిక్రమ స్వరూపధరుడై నిన్ను కొలిచాడు.

ఇప్పుడు కృష్ణుడై నీ పై అడుగు లుంచాడు. పూర్వజన్మలలో నీ వెట్టి నోములు నోచావో!

***

*శ్రీకృష్ణుడు గోపికలతో:*

ప్రత్యక్షంగా నన్ను దర్శిస్తే అంతతో గర్వించి నన్ను సేవించరని, నన్ను కొలిచేవారికి నా రూపం చూపించను. దరిద్రుడు తనకున్న డబ్బు పోయినపుడు తదేక చింతలో మునిగినట్లు నేను కనపడకుండా ఉంటేనే నన్ను కోరేవారు నా రూపాన్ని ధ్యానిస్తూ ఉంటారు.

***

*రాసక్రీడ:*

భగవంతుడైన శ్రీకృష్ణుడు అక్కడ ఎందరు గోపవధువులు వున్నారో, అందరికీ తానందరై ఆత్మారాముడై నప్పటికీ; బాలుడు తన ప్రతిబింబాలతో ఆడుకునేటట్లు రాసలీల సాగించాడు. నందకుమారుడు కలిసిమెలిసి నవ్వుతూ, చూస్తూ, సల్లాపాలు కలుపుతూ మెలిగినాడని ఆ భామలందరూ తమ పూర్వజన్మ పుణ్యాలను పొగుకున్నారు.

***

*శ్రీకృష్ణుని మధురానగర ప్రవేశము:*

బలరామకృష్ణులు తన పట్టణానికి రావడము, తన అనుచరులను వధించడము తెలిసిన కంసునికి మనసు కలకబారింది. నిద్ర పట్టలేదు. కాలమృత్యువు సమీపించగా అతని బుద్ధి కలత

చెందింది. విషం మ్రింగినట్లు, మృతులైనవారిని కౌగలించుకున్నట్లు, దిశమొలతో ఉన్నట్లు, తలపై నూనె పడ్డట్లు, గాడిదపై నెక్కినట్లు కలలు కన్నాడు.మరియు ఎర్రని పూలదండలు ధరించి ఏకాకియై ఎక్కడికో వెళ్తున్నట్లు కూడా కలగన్నాడు.

ఎంతటి పండితుడైనా ఏదైనా సభకు వెళితే, సభలోనివారు చేసే తప్పిదాలను తెలిసి ఉపేక్షించినా, ఆ దోషాలు తెలుసుకోలేకపోయినా, తెలిసి కూడా న్యాయ విరుద్ధంగా పలికినా పాపం అనుభవించి తీరుతాడు.

పక్షులకు ప్రభువైన గరుత్మంతుడు పామును పట్టే రీతిగా శ్రీకృష్ణుడు కంసుని జుట్టుముడి పట్టుకున్నాడు. ప్రళయకాలంలో నక్షత్రాల మాదిరి అతని కిరీటంలోని మణులు జలజల నేల రాలాయి.

సమర్థుడై ఉండికూడా తన దేహముతో, ధనముతో తల్లితండ్రులకు ఎవడు సేవ చేయడో అట్టివాడు కష్టుడు, దుష్టుడు. వాడు చచ్చి పరలోకాన తన మాంసం తానే తింటాడు.

ఎవడైతే తలితండ్రులను, వయోవృద్ధులను, చిన్న బిడ్డలను, గురువులను, సాధువులను, ఇల్లాలు మొదలైనవారిని సమర్థుడై ఉండికూడా పోషించక దీనాలాపము లాడుతారో అట్టివాడు ఈ భూమిపై బ్రతికియూ చచ్చిన వాడితో సమానము.

***

*బలరామకృష్ణుల గురుకులవాసం:*

బలరామ కృష్ణులు అవంతీ పట్టణ వాస్తవ్యుడైన సాందీపని అనే పండితోత్తముని స్వచ్ఛమైన మనస్సుతో, సత్ప్రవర్తనతో, ప్రగాఢమైన భక్తితో సేవించారు. సాందీపని సంతోషించి వారికి నాలుగు వేదములు, వేదాంగములు, ధర్మశాస్త్రాలు, న్యాయశాస్త్రము, తర్కశాస్త్రము, రాజనీతి మొదలైనవాటిని తేటతెల్లంగా బోధించాడు.

రామకృష్ణులు మిక్కిల నేర్పరు లైనందున అరవైనాలుగు కళలనూ అరవై నాలుగు రోజులలో చక్కగా ఒక్కొక్కనా డొక్కొక్క కళ వంతున నేర్చుకున్నారు. గురువులకు గురువులయినవారూ, లోక గురువులూ అయిన రామకృష్ణులు గురుశిష్యన్యాయంతో ఉత్తముడైన సాందీపనిని సేవించారు.

***

*శ్రీకృష్ణుడు ఉద్ధవునితో:*

ఉద్ధవా! ప్రణయమూర్తులైన గోపికలు నా ఆగమనాన్ని ఎదురుచూస్తూ నా మీద వ్యామోహంతో అన్నీ మరచిపోయి ఎంత దుఃఖపడుతున్నారో! లోకధర్మాలను వదలిపెట్టి నాయెడ చూపు నిలిపేవారికి నేను లోబడి దయతో వారిని కాపాడుతాను. ఆశ్రయించినవారిని ఆదుకోవడం నా స్వభావ సిద్ధమైన గుణం.

రామకృష్ణులు సామాన్య మానవులా! మోక్షమునకు అధినేత యైన శ్రీమహావిష్ణువు భూభారాన్ని తొలగించుటకై రామకృష్ణుల

రూపాల్లో భూమి మీద అవతరించాడు. ఏ మానవుడైతే జ్ఞానాన్ని పొంది, ప్రాణ ప్రయాణ కాలంలో, సర్వమునకు ప్రభువైన ఆ భగవంతుణ్ణి సంస్మరిస్తాడో అతడు ముక్తిరూపమైన నిత్యత్వాన్ని పొందుతాడు.

జీవి పలుజన్మము లెత్తి తుదకు పుణ్యకార్యాలు ఫలితంగా భూమిపై పూర్ణదేహంతో మానవుడిగా పుడతాడు. కాని మూర్ఖత్వంతో నీ పాదభక్తి లేనివాడై, మేక గడ్డిమీద ఆశతో వెళ్ళి నూతిలో పడ్డట్టుగా, సంసార సుఖాల్లో మునిగిపోయి  కామసుఖాలు అనుభవిస్తాడే కాని నిన్ను అన్వేషించడు. నీ అనుగ్రహం కలిగినప్పుడే జీవికి సంసారబంధాలు వదలిపోతాయి.

ఈశ్వరా! జ్ఞానహీనుడు మనస్సును బంధించి, గొప్ప భోగములను విడనాడి, ఇంద్రియములను అణచివేసి, తపస్సు చేసి ఇంద్రపదవిని కోరుకుంటాడే కాని నీ అమృతస్థానాన్ని కోరడు.

అచ్యుతా! నీ అనుగ్రహం ఎప్పుడు కలుగుతుందో అప్పుడే సంసారబంధాలలో చిక్కుకున్న జీవికి ఆ బంధాలు తొలగిపోతాయి. సంసార నివృత్తి కలిగినప్పుడు సత్పురుషులతో సహవాసం లభిస్తుంది. సత్సంగం చేత భక్తి సిద్ధిస్తుంది. నీ యందు నెలకొన్న భక్తి వల్ల ముక్తి చేకూరుతుంది.

***

*ముచికుందుడు శ్రీకృష్ణుని దర్శించుట:*

కాలం మహా బలవంతుల కంటె బలమైనది. భగవంతుడే కాలస్వరూపుడు. అతడు జనులను కాలానికి లోబరుస్తాడు. ఎంత గొప్పవారైనా కాలాన్ని దాటలేదు.

కమలముల వంటి కన్నులు గలవాడు, వైజయంతి అనే వనమాలతో విలసిల్లువాడు, పున్నమి చంద్రబింబం వలె అందమైనవాడు, మకరకుడలాల కాంతితో నిండిన చెక్కిళ్లు కలవాడు, కౌస్తుభమణితో అలంకరింపబడినవాడు, ఉన్నత దేహం కలవాడు, శ్రీవత్సమనే పుట్టుమచ్చతో ఒప్పుతున్న వక్షస్థలం కలవాడు, సింహపు నడుము వంటి నడుము కలవాడు, చిరునవ్వు చిందువాడు, బంగారు రంగు పట్టు వస్త్రములు ధరించినవాడు, నాలుగు చేతులు గలవాడు అయిన శ్రీకృష్ణుని ముచికందుడు చూచాడు.

అచ్యుతా! నీ అనుగ్రహం ఎప్పుడు కలుగుతుందో అప్పుడే సంసారంలో పరిభ్రమిస్తున్న పురుషుడికి సంసారబంధాలు వదలిపోతాయి. సంసార నివృత్తి కలిగినప్పుడు సత్పురుషులతో సహవాసం లభిస్తుంది. సత్సంగంచేత భక్తి సిద్ధిస్తుంది. నాయందు నెలకొన్న భక్తివల్ల ముక్తి చేకూరుతుంది.

***

ప్రద్యుమ్నుడు

శ్రీకృష్ణుడి కుమారుడగు ప్రద్యుమ్నుడు యమధర్మరాజులా భయంకరరూపము ధరించి పదునైన తన ఖడ్గంతో శంబరుని శిరస్సు ఖండించాడు. చిగురాకు కత్తితోనే ప్రపంచాన్ని జయింపగల సమర్ధునికి ఉక్కు కత్తితో శత్రువు శిరస్సు నరకడం ఏమంత గొప్ప పని.

మేఘము వలె నీలవర్ణం, ఆజానుబాహువులు, చంద్రుని బోలిన మొహం, నల్లని ఉంగరాల ముంగురులు, విశాల వక్షస్థలం, సన్నని నడుము, కలువరేకుల వంటి కన్నులు గల ప్రద్యుమ్నుని అచ్చటి స్త్రీలు ఏమరుపాటుగా చూసి శ్రీకృష్ణుడని భ్రమించారు. ప్రద్యుమ్నుని చూచి అతని తల్లులు శ్రీకృష్ణుని గాంచినట్లే భావించి కరిగిపోదురట.

***

*శమంతకమణి:*

భయకంపితుడైన జాంబవంతుడు శ్రీకృష్ణుని ఈ విధంగా స్తుతించాడు: దేవా! నీవు పురాణపురుషుడవు, జగన్నాయకుడవు, విష్ణుడవు, ప్రభవిష్ణుడవు అని నేను తెలుసుకున్నాను. సర్వప్రాణులకూ ప్రాణము, ప్రతాపము, ధైర్యము, బలము నీవే. ఈ ప్రపంచం సృష్టికి, స్థితికి నాశనానికీ ఎవరు కారకులో వారి సృష్టి స్థితి లయాలకు నీవు కారకుడవు. ఆత్మస్వరూపవుడవు.

***

*జాంబవంతుడు శ్రీకృష్ణునితో:*

బాణాగ్నిచే సముద్రాన్ని ఇంకించి సేతువు కట్టినవాడవు. తామర పువ్వులు త్రెంచే ఏనుగులాగా రావణాసురుని శిరస్సులు త్రెంచినవాడవు. అచంద్రార్కమైన లంకారాజ్యానికి విభీషణుని రాజుగా చేసినవాడవు. కరుణాసముద్రుడవు. నన్నేలిన లోకనాథుడవు నీవే కదా, మహాత్మా! పొరపడి నీ కపచారం చేశాను. నన్ను మన్నించు.

***

*శ్రీకృష్ణుని భార్యలు:*

మహానుభావుడైన శ్రీకృష్ణుడు ఒక శుభముహూర్తాన పదహారువేల భవనాలలోనున్న పదహారువేల మంది రాకుమార్తెలను, పదహారువేల రూపాలతో, పదహారువేల రీతులతో శోభిస్తూ శాస్త్రోక్తంగా వివాహమాడాడు.

ఎక్కువమంది భార్యలున్నప్పుడు పురుషుడు సవతి పోరాటంతో సతమతమై ఆనందంగా జీవించలేడు. కాని శ్రీకృష్ణుడు పదహారువేల తరుణుల పట్ల సమానభావాన్ని ప్రదర్శించడంలో తన సామర్థ్యాన్ని చూపించాడు. ఎక్కువ తక్కువలు లేకుండా భార్యలందరకూ అన్ని విధాలుగా కన్పించి ఉత్తమమైన గృహస్థధర్మాన్ని పాటిస్తూ ఆనందించాడు.

***

*రుక్మిణీదేవి శ్రీకృష్ణుని స్తుతించుట:*

వర్షాకాలంలో మేఘం నుండి వెలువడే వాన చినుకులను ఆస్వాదించే చాతకపక్షి బురదగుంటలోని నీటికోసం వెళుతుందా? పండిన మామిడి పండ్ల రసాన్ని త్రాగే చిలుక ఉమ్మెత్తలను కోరుకుంటుందా? మేఘగర్జనకు పురి విప్పినాట్యంచేసే నెమలి ఈలపురుగు ధ్వనికి స్పందిస్తుందా? ఏనుగు కుంభస్థలంలోని మాంసాన్ని భుజించే సింహం కుక్క మాంసం కోసం కక్కుర్తి పడుతుందా? ఓ భక్తమందారా! నీ పాదద్వయాన్ని కోరి ఆశ్రయించి ఆనందించే హృదయం మరొకదానిని ఎందుకు అభిలషిస్తుంది?

ఓ దేవా! సకల చరాచర ప్రపంచానికి ఆధీశ్వరుడవైన నిన్ను భూలోకమందు, వైకుంఠంలోను, అన్ని ప్రదేశాల్లోను నేను అభిమతాలైన కామరూపాలతో సేవిస్తాను. ఓ పద్మనాభా! సకల జగదంతర్యామివి నీవు. అటువంటి నీ పాదపద్మాల మీద నా బుద్ధి అనురాగంతో ప్రసరించేటట్లు చెయ్యి.

***

*బాణాసురుడు శివుని స్తుతించుట:*

ఓ దేవా! నీవు జగన్నాథుడవు. పరిశుద్ధ చరిత్రుడవు. పార్వతీపతివి. భక్తసంరక్షకుడవు. రాక్షసాంతకుడవు. త్రిశూలధారివి. నాగభూషణుడవు. చంద్రశేఖరుడవు. సర్వలోకేశ్వరుడవు. హాలాహల భక్షకుడవు. పరమ పవిత్రుడవు.

***

*బాణాసురునిపై శ్రీకృష్ణుని దండయాత్ర:*

శ్రీకృష్ణుడు హారములు, కిరీటము, కేయూరములు, కంకణములు, అంగుళీయకములు, నూపురములు మొదలైన ఆభరణములు ధరించాడు. శంఖ చక్ర గదాయుధాలను దాల్చాడు. చందనం పూసిన వక్షస్థలంపై కౌస్తుభ రత్న కాంతులు ప్రసరించుతుండగా శైబ్యము, సుగ్రీవము, మేఘపుష్పకము, వలాహకము అనే గుఱ్ఱాలు కట్టిన రథాన్ని సిద్ధం చేసి దారుకుడు తీసుకొని రాగా శ్రీకృష్ణుడు ఆ రథాన్ని అధిరోహించాడు.

రాక్షసులనే అరణ్యాలను అగ్ని వలె కాల్చివేసేది, ఆశ్రిత జన రక్షణ గావించేది, దేవేంద్రాది దేవతలచే సేవింపబడేది అయిన సుదర్శన చక్రాన్ని శ్రీకృష్ణుడు బాణాసురునిపై  ప్రయోగించాడు.

ప్రచండ సూర్యమండలంలా శోభిస్తూ, పదివేల కోట్ల వజ్రాయుధాల జ్వాలలతో శత్రువుల గర్వాంధకారాన్ని నివారిస్తూ, సమస్త దేవతల స్తుతులను అందుకుంటూ, దానవులకు శోకం కలిగించేది, సజ్జనులకు ఆనందం కలిగించేది అయిన సుదర్శన చక్రం బాణాసురుని వేయిచేతులలో నాల్గింటిని మాత్రం వదలి తక్కినవానిని తోటమాలి అరటి స్తంభాలను నరికివేసినట్లు ధ్వంసం చేసింది.

***

*పరమేశ్వరుడు వాసుదేవుని ఇలా స్తుతించాడు:*

వాసుదేవా! నీవు బ్రహ్మ స్వరూపుడవు. జ్యోతిర్మయుడవు. అవ్యయుడవు. అనంతుడవు. అచ్యుతుడవు. ఆదిమధ్యాంత శూన్యుడవు. విశ్వంభరుడవు. నీవు సమస్త జగత్తులో సంచరిస్తూ ఉంటావు. సమస్త జగత్తు నీలో లీనమై ఉంటుంది. సృష్టి స్థితి లయకారకుడవు. నిన్ను బ్రహ్మాది దేవతలు, మహా మునీంద్రులు, నేనూ భుజిస్తూంటాము.

భయంకరమైనది, శత్రువులను హతంగావించేది, సూర్యకాంతిని ధిక్కరించే కాంతి గలిగినది, అన్నివైపులా పయనించగలిగినది, దేవేంద్రాది దేవతలతో సేవించబడేది, ఆశ్రిత రక్షణ గావించేది, ప్రళయకాలంలోని పరమేశ్వరుని ఫాలనేత్రం నుండి వెలువడిన జ్వాలామాలికవలె భయంకరమైనదీ అయిన చక్రాయుధాన్ని శ్రీకృష్ణుడు బాణాసురునిపై ప్రయోగించాడు.

***

*నారదుడు శ్రీకృష్ణుని మహిమ తెలుసుకొనుట:*

శ్రీకృష్ణుడు తన కిరీటంలోని మణులు తాకేటట్లు మునిశ్రేష్ఠుడైన నారదుని పాదపద్మాలకు నమస్కారం చేసి తన సింహాసనంపై కూర్చుండబెట్టాడు. తన చరణకమల తీర్థంతో సర్వలోకాలను పవిత్రం చేసే లోక గురువు ఐన శ్రీకృష్ణుడు నారదుని పాదతీర్థం తన తలపై చల్లుకున్నాడు.

పదహారు వేల స్త్రీల నివాసంలోనూ, ఏ స్త్రీ ఇల్లూ తప్పిపోకుండా తన మాయాప్రభావంతో ఉన్న మహాపురుషుడైన శ్రీకృష్ణుణ్ణి, నారదుడు దర్శించాడు. మనుష్య రూపంలో మహానందాన్ని అనుభవిస్తున్న శ్రీకృష్ణుడి యోగమాయా ప్రభావాన్ని పరీక్షించి చూచి పరమ భాగవతుడైన నారదుడు చాలా సంతోషించాడు.

“ముల్లోకాలలో మహేంద్రాది దేవతలు, బ్రహ్మర్షులు కూడా నీ మాయను తెలుసుకోలేరు. నీ భక్తి అనే అమృతంలోని తీయదనాన్ని రుచి చూచిన పుణ్యాత్ములు మాత్రమే నీ తత్త్వాన్ని తెలుసుకోగలరు” అని పలికి నారదుడు సెలవు తీసుకున్నాడు.

***

*శ్రీకృష్ణుని నిత్యకార్యక్రమ వైభవం:*

మనోహరమైన మృదంగ వేణు వీణా గాన రవాలను ఆలకించుతూ అరుణోదయ సమయాన శ్రీకృష్ణుడు మేలుకొన్నాడు. పరబ్రహ్మ స్వరూపమైన తనను తానే ధ్యానించుకుంటూ కన్నులు తెరచి శయ్యను దిగాడు. ఆయన కన్ను తెరవగానే పగవారి కళ్ళు మూతలు పడ్డాయి.

ఆ నందనందనుడు చందనకర్పూరాది పరిమళాలతో గుమగుమలాడే కాంచన కలశ జలాలతో స్నానం చేశాడు. మృదువైన దుస్తులు ధరించి మకరకుండల హారకేయూరాది భూషణాలను అలంకరించుకున్నాడు. పచ్చకర్పూరం, కస్తూరి, మంచిగంధం కలిపిన

పైపూతను స్వీకరించాడు. అనురాగ సముద్రంలా అలరారుతున్న శ్రీకృష్ణుడు తన అందాన్ని అద్దంలో చూచుకొన్నాడు.

సాత్యకితోను, మిత్రుడైన ఉద్ధవునితోను కలిసి సారథి తెచ్చిన బంగారు రథాన్ని అధిరోహించిన శ్రీకృష్ణుడు వెలుగులు వెదజల్లుతూ తూర్పున ఉదయించే సూర్యునిలా ప్రకాశించాడు.

తానలంకరించుకున్న మణిమయాలైన ఆభరణాల కాంతులు నలుదిక్కులా ప్రసరిస్తుండగా, మెలమెల్లగా రథం దిగి, తన పాదముద్రలు భూమిని అలంకరించగా, గంభీరంగా నడుస్తూ మహాసభామధ్య మందున్న నవరత్న ఖచిత సింహాసనంపై ఆసీనుడైనాడు.

శ్రీకృష్ణుడు మహా వైభవంతో, ప్రకాశవంతమైన దేహంతో హితులు, పురోహితులు, రాజులు, మిత్రులు, చుట్టాలు, పెద్దలు, కుమారులు, కవులు, మంత్రులు, సేవకులు అందరూ తనను సేవిస్తుండగా నక్షత్రాల మధ్య విరాజిల్లే చంద్రునిలా ప్రకాశించాడు.

ఓ కృష్ణా! నీకీర్తి దిగంతాలను ప్రకాశింప చేస్తుంది. నీ పాదాల నుండి ప్రభవించిన పవిత్ర జలం పాతాళంలో భోగవతి అనే పేరుతోనూ, భూలోకంలో గంగానది రూపంతోనూ, స్వర్గంలో మందాకినీ నామంతోనూ ప్రవహిస్తూ ముల్లోకాల్లోనూ వెలుగుతుంటుంది.

విశ్వాన్ని కడుపులో ఉంచుకున్న శ్రీకృష్ణుడు యశోదానందులకు ముద్దుల తనయుడయ్యాడు. బ్రహ్మకు కూడా సాధ్యంకాని పరబ్రహ్మ

స్వరూపుడు గోపాల బాలుడయ్యాడు. దేవతలకు అమృతం పంచి ఇచ్చిన పరమాత్మ వెన్న దొంగ అయ్యాడు. వేదశాస్త్రాలు వెదికినా కనపడని నారాయణుడు వ్రేపల్లెలో రోటికి కట్టుపడ్డాడు.

***

*ధర్మరాజు రాజసూయ యాగం:*

*ధర్మరాజు చేసే రాజసూయయాగంలో అగ్రపూజకు శ్రీకృష్ణుడే అర్హుడు అంటూ సహదేవుడు తన అభిప్రాయాన్ని ఇలా అన్నాడు:*

కాలము, దేశము, యజ్ఞము, కర్మము, కర్త, భోక్తలు , దైవము, గురువు, మంత్రము, అగ్ని, హవ్యద్రవ్యాలు, సృష్ట స్థితి లయాలు – సమస్తమూ తానేయై ప్రకాశించే ఏకైక దివ్య స్వరూపుడు కృష్ణపరమాత్మ ఒక్కడే.

పరమేశ్వరుడైన శ్రీకృష్ణుడు కన్ను మూసుకున్నాడంటే ఈ చరాచర ప్రపంచమంతా నశిస్తుంది. కన్నులు విప్పి చూస్తే ఈ లోకాలన్నీ జన్మిస్తాయి. యజ్ఞఫలాన్ని ప్రసాదించే ప్రభువు విష్ణుస్వరూపుడు. సర్వసమర్థుడు.

మధుసూదనుని మీద మాత్సర్యంతో మదోన్మత్తుడై మూడు జన్మలనుండీ ముకుందుని నిందిస్తూ ఎల్లప్పుడూ విష్ణుదేవుని రూపగుణాలను తలుస్తూ ఉండడం వల్ల శిశుపాలుడు సమస్త పాపాల నుండి విముక్తుడై బ్రహ్మరుద్రాదులకు సైతం అందరాని పదవిని పొందాడు.

శ్రీకృష్ణభక్తుడైన ధర్మరాజు రాజసూయం చేయాలనే మనోరథ రూపమైన సముద్రాన్ని కృష్ణుడనే ఓడద్వారా దాటి, మానసిక వ్యథను పోగొట్టుకొని, గొప్ప ఐశ్వర్యంతోను, సంతోషంతోను ప్రకాశించాడు. శ్రీకృష్ణుడి భక్తులకు అసాధ్యమనేది లేదు కదా!

***

*శ్రీకృష్ణుడు శిశుపాలుని మిత్రుడు సాల్వుని వధించుట:*

ఆకాశం అంతా మంటలు వ్యాపించగా, శబ్దం చేత దిగంతాలు వణకగా, సాల్వుడు భయంకరమైన 'శక్తి' అనే ఆయుధాన్ని కృష్ణుడి రథసారది అయిన 'దారుకుని' మీద ప్రయోగించాడు. కాంతివంతమైన నక్షత్రం నుండి తెగిపడే విధంగా దూసుకువచ్చే ఆ శక్త్యాయుధాన్ని శ్రీకృష్ణుడు ఒక్కబాణంతో మార్గమధ్యంలోనే పొడిపొడి చేశాడు.

ఓ పుండరీకాక్షా! మానవులందరూ సంసారమనే దుఃఖ సముద్రంలో మునిగి గట్టు చేరలేక కొట్టుమిట్టాడుతున్న దశలో నిన్ను స్మరించి ఆ దుఃఖాలను పోగొట్టుకుంటారు. సద్గుణాలకు నిధివై దేవతా సమూహానికి ఆధారభూతుడవై పరబ్రహ్మస్వరూపుడవై వెలిగే నిన్ను శోక మోహ భయాదులు అంటలేవు.

శ్రీకృష్ణుడు పదునైన బాణాలు వేసి సాల్వుడి కిరీటాన్ని, ధనస్సునూ, కవచాన్ని ఛేధించి వేశాడు. తన గదాదండాన్ని విసిరి మయునిచే నిర్మించబడిన సాల్వుని 'సౌభక' విమానాన్ని ముక్కలు ముక్కలు చేశాడు. కరవాలంతో వాని చేతిని గదాసహితంగా

ఖండించాడు. ప్రళయకాల కాంతులు వెదజల్లే సుదర్శన చక్రాన్ని ప్రయోగించి సాల్వుని శిరస్సు ఖండించాడు.

***

*కుచేలోపాఖ్యానము:*

కలలో కూడా స్మరించనివాడు విపత్కర పరిస్థితిలో ఒక్కసారి ఆ భక్తజన మందారుడైన శ్రీకృష్ణుని పాదపద్మాలను స్మరిస్తే చాలు. అట్టివానిని కూడా ఆ భగవంతుడు కనికరిస్తాడు. అంతటి మహనీయుడు నిరంతరం భక్తితో తన్ను సేవించే వారికి సమస్త సంపదలు ఇయ్యకుండా ఉంటాడా?

శ్యామలవర్ణం కలవాడు, ప్రకాశించే చెక్కిళ్ళు కలవాడు, కౌస్తుభాన్ని ధరించినవాడు, సౌందర్యమూర్తి, పీతాంబరధారి, అరవిందాక్షుడు, మకరకుండలభూషణుడు, మదురభాషణుడు, చక్రాయుదుడు, గరుడవాహనుడు, ఆదిశేషునిపై శయనించేవాడు, పాలసముద్రంలో విహరించేవాడు, సమస్త లోకాలచేత పూజింపబడేవాడు, దయకు నిలయమైనవాడు అయిన శ్రీకృష్ణుడు కుచేలునికి కనిపించాడు.

***

*శ్రీకృష్ణుడు కుచేలునితో:*

మిత్రమా! నీ విక్కడికి వస్తూ ప్రేమతో నాకేమి బహుమానం తీసుకు వచ్చావు? ఆ పదార్థం ఏదైనా నేను స్వీకరిస్తాను. పత్రమైనా, పుష్పమైనా, జలమైనా, ఫలమైనా సరే నిశ్చల భక్తితో నాకు సమర్పిస్తే దాన్ని మధురాన్నంగా భావించి ఆరగిస్తాను. నాపై భక్తి లేనివాడు మేరుపర్వతమంత పదార్థం ఇచ్చినా అది నాకు అంగీకారం కాదు.

మన శాస్త్రాలు, వాక్కులు, మనస్సులు, ఏ పరంధాముని పాదపద్మ తీర్థంవల్ల పవిత్రము లౌతున్నాయో, ఏ మహాత్ముని పాదస్పర్శకు నోచుకున్న ప్రదేశమంతా ముక్తి దాయక మౌతున్నదో అటువంటి మహానుభావుడు శ్రీకృష్ణుడు.

***

*శ్రీకృష్ణుడు గోపికలతో తన మహాత్యాన్ని ఇలా విశదీకరించాడు:*

నాపై భక్తి గలవారికి మోక్షం సులభ సాధ్యమై ఆనందదాయక మౌతుంది. కేవలం జప తపో దానాది సత్కార్యాల వల్ల ముక్తి కలుగదు. శివ బ్రహ్మ సనక సనందాదుల హృదయాల్లో అంకురించని భక్తి మీలో మొలకెత్తింది. మీ పూర్వజన్మ పుణ్యం పూర్తిగా ఫలించింది. ఇక నరక హేతువులైన జన్మ కర్మలు మీకిక కలుగవు.

సర్వదశల్లోను, సమస్త భూతాల భహిరంతరాల్లోనూ నేనుంటాను. సకల ప్రాణుల కార్యకలాపాలకు పృథివి జలం అగ్ని

వాయువు ఆకాశం అనే పంచభూతాల సంబంధమే కారణం. అటువంటి పంచభూతాలకు ఆధారం నేనే. సర్వమునకు కర్తను నేనే. అట్టి నాకు స్వపర తారతమ్యాలు లేవు.

***

*ధర్మ రాజు శ్రీకృష్ణునితో:*

అచ్యుతా! జాగ్రద్స్వప్ననిద్రావస్థలకు నీవు అతీతుడవు. సర్వవ్యాప్తివి. విశ్వమే నీవు, నీవే విశ్వం. ఈ విశ్వం నీ యందే నిలిచి ఉంటుంది. సృష్టి స్థితి లయాలు నీ సంకల్పంతో నెరవేరుతాయి. నీవు అఖండ జ్ఞాన స్వరూపుడవు. యోగమాయ నీకు లోబడి ఉంటుంది. పాపాన్ని జయించిన యోగులకు నీవు గోచరిస్తావు. నిఖిలలోక అధినాథుడవు, నీరజాక్షుడవు, నిర్వికారుడవు, కృపాసముద్రుడవు అయిన నీకు నమస్కరిస్తున్నాను.

***

*శ్రీకృష్ణుడి సుతలలోక యాత్ర:*

సుతలలోక నివాసియైన బలి చక్రవర్తి పచ్చకర్పూరం వంటి ఆకారం కలిగి నాగలి ధరించిన బలరాముణ్ణీ, నీలమేఘశ్యాముడై చక్రాన్ని ధరించిన శ్రీకృష్ణుణ్ణీ ఆహ్వానించి, సువర్ణ పీఠాలపై కూర్చుండబెట్టి, వారి పాదాలు కడిగి భక్తితో శిరస్సు మీద జల్లుకున్నాడు. బలరామకృష్ణులను సుగంధ ధూపాలతోను, కర్పూర దీపాలతోను, పండ్లూ పాయసాలు మొదలైన నైవేద్యాలతోను, రత్నాభరణాలతోను, పలుచని పట్టుబట్టలతోను సత్కరించాడు.

*బలిచక్రవర్తి శ్రీకృష్ణుడితో:*

అంబుజాక్షా! రాజస తామస గుణాలున్నవారు నిన్ను చూడలేరు. పరమశివ బహ్మేంద్రాది దేవతలు నీ పాదపద్మాలను భక్తితో నమస్కరిస్తారు. బవబంధ పాశాల్ని తెంచుకున్నవాడివి నీవు. నీ చరిత్రము  పరమ పవిత్రము.

దేవా! మహాయోగులు సైతం నీ మాయలకు వశులై నీ విట్టివాడవనీ నీ రూప మిట్టిదనీ తెలుసుకోలేరు. కాగా మా వంటి తామసులు నిన్నెలా తెలుసుకోగలరు? నీ పాదాలు చేరుకొనే మార్గం చూపి సంసార కూపం నుంచి మమ్ముద్ధరించు.

వైరంతో శిశుపాలాది రాజులు, కామం చేత గోపికలు, భక్తితో ఆశ్రితులు నిరంతరం నీ గురించి ఆలోచిస్తూ ఉంటారు. వారు నిన్ను స్మరించుకుంటూ నిన్ను చేరుకునే విధంగా, మహా జ్ఞానులైన దేవతలు సైతం నిన్ను అందుకోలేరు. నీ పాదాలను నిరంతరం ధ్యానించడం వల్లనే నిన్ను చేరుకో గలరు గాని శాస్త్రాలు పల్లె వేయడం వల్ల కాదు.

సంసార సాగరాన్ని దాట గలిగాను. ముక్తి సాధనాన్ని చూడ గలిగాను. నీ కరుణకి పాత్రుడనయ్యాను. నా పాపం అంతరించింది. శివబ్రహ్మలకు కానరాని మహాత్మా! నీవు నా మందిరానికి విచ్చేశావు. నేను ధన్యుణ్ణయ్యాను.

***

*శ్రుతిగీతలు:*

తీవ్రమైన వేసవి ఎండచేత బాధపడే బాటసారి చన్నీళ్ళ స్నానం చేసి సేద తీర్చుకొనే విధంగా నిన్ను పూజించే మహాత్ములు సంసార మనే దుర్భర తాపాన్ని నేర్పుతో తొలగించుకుంటారు. ఇదికాక ముసలితనము, మరణము అనే వాటిని కూడా క్రమంగా పోగొట్టుకుంటారని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు.

సమస్త ప్రాణులకు అధీశ్వరుడు నీవే అని తెలిసిన కొందరు నీ పాదపద్మాలను సదా సేవిస్తూ పరమానందం చెందుతారు. మరి కొందరు నీ పాదపద్మాలను భజింపలేక ఈ లోకంలో పుడుతూ చస్తూ ఉంటారు.

ఈ సృష్టికి పరమాణువులే కారణమని భావించు కణ్వ గౌతమాదులు, ప్రకృతి కారణమని భావించే సాంఖ్యులు, దేహమే మూలమని వాదించే బౌద్ధులు, తమతమ తర్కాలతో వాదించుకుంటూ నిన్ను తెలుసుకోలేరు. నిన్ను సాక్షాత్కరించుకొన్న పరమయోగులకు ఈ సృష్టిలో నీవు తప్ప తక్కిన సమస్త పదార్థాలు అసత్యా లనిపిస్తాయి.

గురు పాదపద్మాలను సేవించనివారు జననమరణ పరంపరలు అనే సముద్రంలో మునిగిపోతారు. నిరంతరం సతీ సుతుల మీద, గృహ క్షేత్రాదుల మీద అనురక్తిని పెంచుకొన్నవాడు ఈ సంసారసాగరం నుండి ఎన్నటికీ గట్టెక్కలేడు.

***

*విష్ణు సేవా ప్రాశస్త్యము:*

శివుడు మహాశక్తిసంపన్నుడు. సత్త్వ రజ స్తమో గుణాలతో కూడుకున్నవాడు. కనుక పరమశివుని పూజించేవారు ఐశ్వర్యవంతులౌతారు. శ్రీహరి ఈ మూడు గుణాలకు అతీతుడు. ఎవనిపై శ్రీహరికి అనుగ్రహం కలుగుతుందో వారి సమస్త సంపదలనూ హరించి, భక్తిని పెంచి, ముక్తిని కలిగిస్తాడు.

***

*శ్రీకృష్ణార్జునుల వైకుంఠ సందర్శన:*

నీలమేఘశ్యాముడు, ఆశ్రితజన రక్షకుడు, మునీంద్రుల హృదయాలలో నివసించేవాడు, లక్ష్మీ మనోహరుడు, పీతాంబరధరుడు, హార కేయూర కటక కంకణ కిరీట భూషణుడు, భక్తజన పోషకుడు, కరుణా సముద్రుడు, అయిన ఆదిదేవుడు శ్రీమన్నారాయణుని శ్రీకృషార్జునులు భక్తితో చేతులు జోడించి సంస్తుతించారు.

***

*ద్వారకలో సుఖసంతోషాలతో శ్రీకృష్ణుడు:*

శ్రీకృష్ణుడి పాదపద్మాలను భక్తితో ధ్యానిస్తూ అతనితో సరససల్లాపాలు సాగిస్తూ, ఆ దివ్యమంగళరూపాన్ని దర్శిస్తూ పదహారువేలమంది సుందరీమణులు పరవశించి మరి దేని గురించి ఆలోచించకుండా ఉన్నారు. మూఢాత్ములైనా ఒక్కసారి హరినామ సంకీర్తనం వింటే ముక్తిని పొందుతారు. కాగా ఆ మహనీయుణ్ణి చూస్తూ,

అతణ్ణి కౌగలిస్తూ, అతనితో సంభాషిస్తూ ఆనందంతో మునిగిన అంగనలు ఎంతటి అదృష్టవంతులు!

***

దేవ దానవ సంగ్రామంలో మరణించిన రాక్షసులందరూ ద్వాపర యుగంలో రాజులుగా పుట్టి ప్రజలను బాధలకు గురిచేసారు. ఆ రాక్షసులను చంపడం కోసం విష్ణుమూర్తి దేవతలను యదుకులంలో జన్మించేలాగ చేశాడు. అందుచేత యాదవులు నూటొక్క కులాలుగా ఏర్పడ్డారు.

మహోత్సాహంతో కృష్ణుడు మురళిని మ్రోగిస్తే ఆ గానం విని కృష్ణుణ్ణి సేవించాలనే కాంక్షతో గోపస్త్రీలు పరమానందంతో బృందావన ప్రాంతాలకు పరుగెత్తుకొని వస్తారు. ప్రాజ్ఞులైనవారు ఆ కరుణామూర్తిని పూజించకుండా ఉంటారా?

అశుభాన్ని తొలగించే శ్రీకృష్ణుడి నామాన్ని జపించేవారు, వినేవారు ధన్యాత్ములు. వారు సంసారపరమైన కష్టాలనుంచి విముక్తు లౌతారు. ముల్లోకాలకూ శుభదాయకమైన కృష్ణ కథా సుధా రసాన్ని భక్తితో పానం చేసిన పుణ్యాత్ములు ఈ లోకంలో సుఖాలను పొందుతారు. వారి పాపాలు తొలగిపోయి తుదకు శాశ్వతమైన మోక్షాన్ని పొందుతారు.

***

# ఏకాదశ స్కంధము

బలవంతమైన సైన్యంతో గొప్ప భుజబలం గలవాడైన కృష్ణుడు యుద్ధంలో రాక్షస వీరులను వేగంగా ఖండించాడు. అప్పటికీ భూభారం ఎక్కువగా ఉండటం చేత 'ద్యూతక్రీడ అనే కారణంతో' కౌరవ పాండవ యుద్ధం జరిపించి ఉభయ సైన్యాలలో ఎంతో మందిని హతమార్చాడు.

***

*విశ్వామిత్ర వసిష్ఠ నారద మునులు శ్రీకృష్ణ సందర్శనకు వచ్చుట:*

కౌస్తుభమణి ఆభరణముగా దాల్చినవాడు, కుండలాల కాంతులతో ప్రకాశించే చెంపలుగలవాడు, తెల్లతామరవంటి కన్నులు గలవాడు, మేఘంవలె నల్లనివాడు, అనేక రత్నాలు పొదిగిన కిరీటం దాల్చినవాడు, చేతుల్లో చక్రాది ఆయుధాలు ధరించినవాడు, శ్రీకరమైన పచ్చని పట్టువస్త్రం కట్టుకున్నవాడు, బ్రహ్మాది దేవతలచే సేవింపదగిన చరణకమలాలు కలవాడు, ఆజానుబాహుడు, దుష్టులను శిక్షించి శిష్టులకు సంతోషం కలిగించువాడు, దయకు సముద్రం వంటివాడు అయిన శ్రీకృష్ణుని మహర్షులు అవలోకించారు.

పద్మనాభా! జనులు నిన్ను సేవించని రోజులు వృథాగా జరిగి పోతుంటాయి. నీ దివ్య చరణాలు భవసముద్రం దాటించే తెప్పల వంటివి. పాపాలనే తీగలను హరించేవి. శాస్త్రాలకు అలంకారాలైనవి. ఆర్తజనులకు శరణాలైనవి. నీ నామం అనేక జన్మలను, కర్మలను, రోగాలను నశింపజేసే దివ్యఔషధం.

నీ నామం అనేక జన్మలను, కర్మలను, రోగాలను, నశింపజేసే విశేషమైన మందు. దుష్టాత్ములు దీనిని తెలుసుకోలేరు. ఎవడు నిరంతర నారాయణ పాదపద్మాలను భజింపడో వానికి చావు సమీపంలోనే ఉంటుంది. ఎవరైతే అచ్యుత, అనంత, గోవింద మొదలైన నామాలను ఏకాగ్ర చిత్తంతో స్మరిస్తూ ఉంటారో అటువంటివారు సుఖాశ్రయులై ఉంటారు.

***

*విదేహ ఋషభ సంవాదము:*

మనస్సుతో, వాక్కుతో, కాయంతో చేసే ప్రతీకర్మా "కృష్ణార్పణ" మని పలకటమే సుజ్ఞానమని పరమమునులు అంటారు. గురువును దేవునిగా నమ్మి బుద్ధిమంతుడైన నరుడు కోరికలను కుదించుకొని శ్రీహరిని ధ్యానిస్తూ ఉంటే కైవల్యం సులభంగా ప్రాప్తిస్తుంది.

సర్వభూతమయుడైన పద్మలోచనుడు శంఖం చక్రం దాల్చి తన ఆత్మలో ఉన్నాడనే విశ్వాసం కలిగి ఆ హరి యందు భక్తి ఆసక్తి కలవాడు భాగవతుడు. వర్ణాశ్రమ ధర్మాలు, కర్మలు అనే వాటిలో మునిగిపోక భక్తి మార్గాన్ని ఆశ్రయించి "శ్రీహరి సమస్త జగత్తులోన నిండి యున్నాడు" అన్నవాడే భాగవతుడు.

పరబ్రహ్మమని, పరతత్త్వమని, పరమపదమని, పరమేశ్వరుడని, శ్రీకృష్ణుడనీ వేరు వేరు పేర్లతో శ్రీమన్నారాయణుడే జగత్తు నంతా నిండి ప్రకాశిస్తూ ఉంటాడు.

సూర్యుడు ఉదయించటం, అస్తమించటంతో ప్రతీదినము మానవుల ఆయువు క్షీణిస్తుంటుంది. శరీరంపైనా, బంధువులపైనా "నాది, నావారు" అనే మమకారంతో సంసారమనే చీకటిలో మునిగి, విరక్తి మార్గం తెలియక కోరికలు అనే ఊబిలో కూరుకు పోతారు. కేవలం నారాయణునిపై భక్తిభావం గల సద్గురువులను పూజించి, ఉత్తమమైన భాగవత ధర్మాలు ఆచరించడం వలననే ముక్తిని పొందగలరు.

హరిభక్తులతో స్నేహం చేస్తూ, హరిలీలలు తలచుకుంటూ, కన్నులలో ఆనందబాష్పాలు నిండగా, ఒళ్ళు పులకరించే మానవుడు 'హరిమాయ' ను గెలుస్తాడు.

మోక్షాన్ని కోరేవాడు శాస్త్రం చెప్పిన విధంగా శ్రీహరిని పూజించాలి. పరిశుద్ధమైన దేహంతో భగవంతుని సన్నిధిలో షోడశోపచారాలతో చక్రధరుని ఆరాధించాలి. గంధం, పుష్పం, ధూపం, దీపం, నైవేద్యం సమర్పించి సాష్టాంగదండ ప్రణామాలు చేయాలి.

ఆకాశంలోకి చుక్కలను లెక్కపెట్టవచ్చు. భూమిపై గల మట్టిరేణువులను కూడా లెక్కపెట్టవచ్చు. కాని నారాయణ గుణ విశేషాలను శివ బ్రహ్మలు కూడా వర్ణించ లేరు.

***

*బ్రహ్మాది దేవతలు శ్రీకృష్ణుని వైకుంఠమునకు పిలుచుకై వచ్చుట:*

శ్రీకృష్ణుని చూడడానికి ద్వారకకు వచ్చిన బ్రహ్మారుద్రాది దేవతలు: “యాదవవంశ మనే ఉద్యానవనంలో ప్రకాశించేవాడివి, జనులకు కోరిన వరాలిచ్చే వాడివి అయిన సర్వేశ్వరా! పుట్టుకలేనివాడవై కూడా ఈ భూభారం తగ్గించటంకోసం నీవు పుట్టావు. నీవు జన్మించి ఇప్పటికి నూట ఇరవై అయిదు సంవత్సరాలు గడిచాయి. ఇక వైకుంఠానికి వేంచేయి స్వామీ!” అని ప్రార్థించారు.

శ్రీకృష్ణుడు వాళ్ళతో “యాదవులకు పరస్పరం శత్రుత్వాన్ని కల్పించి వారిని కూడా రూపుమాపి భూభారం తగ్గించి వేసి వస్తాను” అని వారికి వీడ్కోలిపాడు.

***

*ఉద్ధవునితో వాసుదేవుడు ఇలా అన్నాడు:*

బ్రహ్మ మొదలైన దేవతల ప్రార్థన ప్రకారం భూభారాన్ని తొలగించాను. ఇక నేటికి ఏడవరోజు సముద్రుడు ద్వారకానగరాన్ని ముంచి వేస్తాడు. ఈ యాదవజాతి కూడా నాశనమవుతుంది. అంతట కలియుగం వస్తుంది.

కలియుగంలో మానవులు ధర్మం వదిలినవారు, ఆచారం లేనివారు, అన్యాయపరులు, ఈర్ష్యాద్వేషాలు కలవారు, మిక్కిల రోషం

కలవారు, బహురోగాలచేత పీడించబడేవారు, నాస్తికులూ అయి ఒకళ్ళనొకళ్ళు తిట్టుకుంటూ ఉంటారు.

***

ఉద్ధవునితో శ్రీకృష్ణుడు ఇలా చెప్పాడు:

భూమి వల్ల సహనము, వాయువు వల్ల పరోపకారము, ఆకాశం వల్ల కాలం సృష్టించే గుణాలతో సాంగత్యం లేకపోవటము, నీటి వల్ల శుచిగా ఉండటం, అగ్ని వల్ల నిర్మలంగా ఉండటం, సూర్యచంద్రుల వల్ల సర్వసమత్వము నేర్చుకోవాలి.

మోహానికి వశుడై ధనవాంచ అనే ప్రవాహంలో చిక్కుకొని క్రూరమైన భావాలకు లొంగిపోయే మనుష్యుడు దాని నుండి బయటపడటం తెలియక, ధీనుడై శరీరాన్ని శిథిలం చేసుకుంటాడు. మోహాన్ని వదిలిపెట్టి మునులు ఆచరించే మార్గాన్ని అనుసరించే మనుష్యుడు మోక్షలక్ష్మిని పొందుతాడు.

***

*అవధూత - యదు సంవాదము:*

పరధనాలను పరకాంతలను కోరకుండా, ఇతరుల వస్తువులను అపహరించే ఆలోచన చేయకుండా, ఇతరులను నిందించకుండా, ముసలుతనం పైబడి రోగాలు పుట్టకముందే, శరీరం కంపించకముందే, బుద్ధి చంచలస్థితిని పొందకముందే, గొంతులో శ్లేష్మము చేరకముందే, శక్తియుక్తులు సన్నగిల్లకముందే, దృఢమైన భక్తిభావనతో

దానవాంతకుని దివ్యమైన పాదపద్మాలను భజిస్తూ అవ్యయమైన ఆనందాన్ని అనుదినము పొందుతూ ఉండేవాడు భవబంధ విముక్తుడై మోక్షాన్ని పొందుతాడు.

బార్యాపుత్రుల యందు, ధనధాన్యాదుల యందు, అనేక విధముల మమకారమును పెంచుకొను మనుష్యుడు మిక్కిలి భయంకరమైన వియోగముతో కల్గిన దుఃఖముతో కూడినవాడై, తెలివి పోగొట్టుకున్నవాడై, నీతి వివేకము లేనివాడై మానసిక భారముతో మరణము నొందును.

మోహానికి వశుడై ధనవాంచ అనే ప్రవాహంలో చిక్కుకొని క్రూరమైన భావాలకు లొంగిపోయే మనుష్యుడు ఊహాపోహలు తెలియక, ధీనుడై శరీరాన్ని శిథిలం చేసుకుంటాడు.

***

*శ్రీకృష్ణుడు ఉద్ధవునితో:*

పంచేంద్రియములకు కనపడే పదార్ధమంతా అనిత్యం. నిత్యమైనది బ్రహ్మ మొక్కటే. పూర్వకర్మలచేత లభించిన శరీరం కలవాడైన దేహి సంసారమందు మమకారాన్ని వదలి నిశ్చలమైన జ్ఞానం పొంది, వైకుంఠాన్ని చేరుతాడు. కలలో దొరికిన పదార్థం నిజం కానట్లుగా కర్మానుభవం అయినంతవరకే ఈ శరీరం ఉంటుందనే సాంఖ్యయోగ సారాన్ని స్వయంగా నేను సనకసనందాదులకు తెలిపాను. వారి ద్వారా బ్రహ్మ మొదలైన దేవతలు తెలుసుకున్నారు.

నాయందు భక్తి ఆసక్తి కలవారికి ఆతిథ్యము నిచ్చేవాడు; హరిదివ్యనామాలు ధరించేవారికి అన్నము నీళ్ళు ఇచ్చేవాడు, వాసుదేవ భక్తులను చూసి సంతోషించేవాడు - భాగవతుడు. నన్నే తలిచే అటువంటి మానవునకు భుక్తిని ముక్తిని ఇస్తాను.

చరాచరాత్మకమైన ఈ ప్రపంచమంతా నా ఆకారంగా భావించి భూతాలలో ఆధారభూతము, సూక్ష్మములందు జీవుడు, దుర్జయమైన వాటిలో మనస్సు, దేవతలలో బ్రహ్మ, వసువులందు అగ్ని, ఆదిత్యులలో విష్ణువు, రుద్రులందు నీలలోహితుడు, బ్రహ్మలయందు భృగువు, ఋషులందు నారదుడు, ధేనువులందు కామధేనువు, సిద్ధులలో కపిలుడు, దైత్యులలో ప్రహ్లాదుడు, గ్రహాల్లో చంద్రుడు, ఏనుగులలో ఐరావతము, గుర్రములందు ఉచ్ఛైశ్రవము, నాగులలో వాసుకి, మృగములలో సింహము, వర్ణములందు ఓంకారము, ఆశ్రమములందు గృహస్థాశ్రమము, నదులలో గంగ, సముద్రములలో పాలసముద్రము, ఆయుధములలో ధనుస్సు, పర్వతాలలో మేరువు, చెట్లలో అశ్వద్ధము, ఓషధులలో యవలు, వ్రతములలో అహింస, యోగములలో ఆత్మయోగము, స్త్రీలయందు శతరూప, పలుకులందు సత్యము, ఋతువులందు వసంతము, మాసములలో మార్గశిరము, నక్షత్రములలో అభిజిత్తు, యుగములలో కృతయుగము, భగవదాకారములలో వాసుదేవుడు, యక్షులలో కుబేరుడు, వానరులలో ఆంజనేయుడు, రత్నములందు పద్మరాగము,

దానములలో అన్నదానము, తిథులయందు ఏకాదశి – 'ఇవి అన్నీ నా విభూతులుగా తెలుసుకో' అని శ్రీకృష్ణుడు ఉద్ధవునికి చెప్పాడు.

***

*నియమాలు:* మౌనవ్రతం, బ్రహ్మచర్యం, ఓర్పు, జపము, తపము, అతిథి సేవ, పరహితము.

*శమము:* ఇంద్రియాలు వశంలో ఉంచుకోవడం, శత్రువులయందు మిత్రులయందు సమభావం ఉండడం.

*దమము:* చిత్తశుద్ధి కల్గి ఎప్పుడూ తృప్తితో ఉండడం.

*విద్య:* వైష్ణవ భక్తి, మూఢులకు జ్ఞానాన్ని బోధించడం, ప్రాణాయామం, మనో నిర్మలత్వం, కోరికలను వదలడం

*అవిద్య:* శమ దమాది గుణాలు లేకపోవడం. దైవభక్తి లేకపోవడం.

***

గర్భంలో ఉన్నప్పుడు జీవునికి నిండుగా జ్ఞానం ఉంటుంది. కడుపులో నుంచి భూమి మీద పడగానే ఆ జ్ఞానమంతా పోతుంది. కాబట్టి మానవుడు పసివాడిగా గాని, పిల్లవాడిగా గాని, యువకుడుగా గాని, పెద్దవాడైన తర్వాత గాని నన్ను తెలుసుకుంటే కృతార్థు డవుతాడు. సుఖాలను కోరక, మనస్సును నిగ్రహించి, నన్ను స్మరించేవాడు వైకుంఠపదాన్ని పొందుతాడు.

ఈ లోకంలో మనుష్యులకు ధ్యానం నిలబడదు. అందుకని వారు తమ ఆచారం ప్రకారం ఒక ఆకారం కల్పించి ఒక పేరు పెట్టి

పూజిస్తారు. ఈ విధంగా చేసిన దేవతా ప్రతిమలలో నేను ప్రసన్నుడై ఉంటాను. దివ్యమైన వస్త్రాలతో, భూషణాలతో, పూలదండలతో అలంకరించుకొని ఉన్నట్టుగా భావించి నా భక్తులు నన్ను ధ్యానిస్తారు.

***

*శ్రీకృష్ణబలరాములు వైకుంఠమున కరుగుట:*

పరమేశ్వరుడైన కృష్ణుడు ఒక పొద చాటున పడుకొని విశ్రాంతి తీసుకుంటూ ఒక కాలుమీద మరొకకాలు పెట్టి ఆడిస్తూ ఉండగా వేటకు వచ్చిన ఒక బోయవానికి ఆ కదులుతున్న కాలు లేడి చెవిలాగా కన్పించింది. వాడు వేసిన బాణం తగిలి శ్రీకృష్ణుడు "హాహా" అని అరిచాడు.

పరమేశ్వరుడైన కృష్ణుడు నూరు కోట్ల సూర్యుల దివ్య తేజస్సుతో వెడలి నారదుడు మొదలైన మునుల సముదాయము, బ్రహ్మ, రుద్రుడు మొదలైన దేవతలు, జయజయ నినాదాలతో తోడు రాగా తన స్థానమైన వైకుంఠానికి తరలి వెళ్లాడు. ఆయన దేహం జగన్నాథుని రూపంలో సముద్రప్రాంతంలో ఉంది.

నవ్వు ముఖము, చక్కని నడుము, నల్లని దేహము, లక్ష్మీదేవికి నివాసమైన వక్షము, పెద్ద బాహువులు, కుండలాలు ధరించిన అందమైన చెవులు, గజగమనము, నల్లని జుత్తు, దయారసం చెందే చూపు, గలిగిన విష్ణుమూర్తి నేను కనులు మూసినా, తెరచినా ఎప్పుడూ కనపడుగాక.

***

# ద్వాదశ స్కంధము

శ్రీకృష్ణుడు ఈ లోకాన్ని విడిచి వైకుంఠం చేరుకున్న రోజుననే కలి ప్రవేశించాడు. ఈ లోకంలో రోజు రోజుకు ధర్మం తగ్గిపోతుంది. ఏ కులమైనా, ధనవంతుడైనవాడే పాలిస్తాడు. బలం కలవాడిని అందరూ గుణవంతుడుగా పరిగణిస్తారు. ఇంక *'కలిమి-బలిమి'* రెండు ఉంటే లోకంలో వాడే రాజు. పరిపాలకులకు తెలివితేటలు ఉండవు. ధర్మము, సత్యము, దయా ఉండవు. రాజులు ఒకరిపైన ఒకరు వైరం పెంచుకుంటారు.

ఈ విధంగా లోకం ధర్మమార్గాన్ని తప్పినప్పుడు విష్ణుమూర్తి దుష్టశిక్షణ, శిష్టరక్షణ కొరకు శంబల గ్రామంలో 'విష్ణుయశుడు' అనే విప్రునికి తనయుడై జన్మిస్తాడు. అతడే కల్కిరూపంలో వచ్చే అవతారమూర్తి. దేవతా సమూహాలు చూస్తూ ఉండగా 'దేవదత్తము' అనే అశ్వాన్ని అధిరోహించి కల్కిభగవానుడు దుష్టులను సంహరిస్తాడు. నారాయణుడు లోకంలో దుష్టరాజులను సంహరించి, ధర్మాన్ని నిలిపి మరల వైకుంఠానికి వెళ్ళిపోతాడు.

***

యుగ ధర్మం :

*"కలియుగం ఘోరమైన పాపాలకు పుట్టిల్లు".* కాబట్టి ఒక్క క్షణమైనా సరే *"శ్రీ నృసింహా! వాసుదేవా! సంకర్షణా!"* మొదలైన నామాలతో సుస్థిరమైన భక్తితో శ్రీహరిని స్మరించాలి. ఒక్క నిముషం ధ్యానం చేసినప్పటికీ ఉత్తమమైన పావనత్వం కలుగుతుంది.

ఒకే తేజం అనేక రంధ్రాలలో నుండి అనేక తేజములుగా గోచరించినట్లు, ఒకే భగవంతుడు అనేక విధములుగా భావింపబడుతున్నాడు. నగల బేధాన్నిబట్టి అనేకరీతులుగా కనపడినప్పటికీ బంగారాన్ని ఒకే విధంగా భావించినట్లుగానే పరమాత్మను ఒకడిగానే భావించాలి.

సంసారమనే మహాసముద్రాన్ని దాటడానికి "విష్ణు కథ" అనే నావ ఒక్కటే సాధనం. జన్మించిన మానవుల కందరికి మరణించడం కూడా నిత్య సత్యం. జీవులు "నేను చనిపోతాను" అన్న భయాన్ని పూర్తిగా మనస్సు నుండి విడిచిపెట్టాలి. హరి ధ్యానం చేయాలి. దీని వల్ల మరల మానవలోకంలో జన్మించడం జరుగదు. జన్మ అంటూ లేనివాడికి మరణం ఎలా వస్తుంది!

ముసలితనానికి మృతికి ఆశ్రమం శరీరం. కుండలో ఉన్న ఆకాశం కుండ పగిలినప్పుడు మహాకాశంలో కలిసిపోయినట్లుగా, శరీరం నాశనమైనప్పుడు ఈ శరీరంలోని జీవుడు దేవునితో కలిసిపోతాడు. అంటే జీవాత్మ పరమాత్మతో చేరిపోతుంది.

చావు బ్రతుకులు భూమి మీద ఉండే జీవ సముదాయానికి ఎల్లప్పుడూ కలుగుతూనే ఉంటాయి. ఇది సహజం. పుట్టుకతో వచ్చేదే. *రోగం, ఆకలి, దప్పిక, అగ్ని, పాము కాటు, దొంగలవల్ల, మరేదో ఒక కారణంవల్ల చనిపోయే మానవుడు కష్టములతో కుమిలిపోయి తాను పూర్వం చేసిన పాపఫలితాన్ని అనుభవిస్తాడు.*

పురాణాలలో శ్రేష్ఠమైన భాగవతాన్ని శ్రవణం చేసేవారు, పఠనం చేసేవారు, లిఖించేవారు ఆయువు, ఆరోగ్యం, ఐశ్వర్యము కలిగి విష్ణువుతో సాయుజ్యాన్ని పొందుతారు. పుష్కర తీర్థంలో గాని, ద్వారకా పట్టణంలో గాని, మధురానగరంలో గాని ఆదివారం నాడు భక్తి పూర్వకంగా భాగవతాన్ని చదివిన భక్తుడు వెనువెంటనే సంసార సముద్రాన్ని తరిస్తాడు.

***

వేదవ్యాసుడు వేదములు పురాణములను లోకమందు వ్యాప్తి చేయుట:

పరాశరుని కుమారుడైన వ్యాసునికి పైలుడు, సుమంతుడు, జైమిని, వైశంపాయనుడు అని నలుగురు శిష్యులు. ఆ నలుగురూ గురువైన వ్యాసుడు బోధించిన నాలుగు వేదాలను లోకంలో ప్రచారం చేశారు.

మొట్టమొదట బ్రహ్మ హృదయంలో ఒక నాదం పుట్టింది. ఆ నాదాన్ని ఉపాసించడం వలన యోగులు పాపరహితిలై ముక్తిని పొందుతారు. ఆ నాదం నుండి *"ఓంకారం"* పుట్టింది. ఓంకారం

మంత్రాలకూ, ఉపనిషత్తులకూ  మూలం కావడం వలన *"వేదమాత"* అన్న విఖ్యాతి గడించుకుంది. ఓంకారములో *సాత్త్విక, రాజస, తామస* అనే మూడు గుణాలున్నాయి. ఆ విధంగానే *అకారమూ, ఉకారమూ, మకారమూ* అనే మూడు వర్ణాలున్నాయి. అలా మూడు గుణాలతోను, మూడు వర్ణాలతోను *ఓంకార ప్రణవం ప్రకాశిస్తూంది.*

***

*పద్దెనిమిది  పురాణాలలో భాగవత పురాణ ప్రాశస్త్యం:*

నదులలో గంగానది, దేవతలలో బ్రహ్మ, తారకలలో చంద్రుడు, సముద్రాలలో పాలసముద్రం, పర్వతాలలో మేరుపర్వతం, గ్రహాలలో సూర్యుడు, రాక్షసులలో ప్రహ్లాదుడు, సిద్ధులలో కపిలుడు, గుఱ్ఱాలలో ఉచ్చైఃశ్రవం, రత్నాలలో పద్మరాగం, చెట్లలో హరిచందనం, ఋషులలో నారదుడు, ధేనువులలో కామధేనువు, జయింపరాని వాటిలో మనస్సు, రుద్రులలో నీలలోహితుడు, బ్రహ్మలలో భృగువు, శస్త్రాలలో  ధనుస్సు, యజ్ఞాలలో జపయజ్ఞం, వ్రతాల్లో అహింస, సర్పాలలో వాసుకి, మృగాలలో సింహం, ఆశ్రమాలలో గృహస్థాశ్రమం, వర్ణాలలో ఓంకారం, యోగాలలో ఆత్మయోగం, ఋతువులలో వసంత ఋతువు, మాసాల్లో మార్గశీర్షం, యుగాలలో కృతయుగం వలె పద్దెనిమిది పురాణాలలో భాగవత పురాణం ప్రకాశిస్తూ ఉంటుంది.

*శుభం*

# శ్రీరామ నామం సర్వపాపహరం



శ్రీరామ నామం సద్గతులకు ఏకైక మార్గం!

శ్రీరామ నామం సకల పుణ్యాలకు ఆలవాలం!

శ్రీరామ నామం సర్వశుభ కారకం!

శ్రీరామ నామం సర్వపాప నాశకరం!

శ్రీరామ నామస్మరణం మహిమాన్విత మంత్ర జపం!

చతుర్యుగములందు,

త్రికాలములందు,

ముల్లోకములందు

రామనామము కల్పవృక్షము

రామనామము ముక్తి ధామము



శ్రీ కందుల నాగేశ్వరరావు విశాఖపట్నం జిల్లా, సర్వసిద్ధి రాయవరంలో జన్మించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో అనువర్తిత భౌతిక శాస్త్రం (Applied Physics) లో M. Sc (Tech) చేశారు. రక్షణ పరిశోధన అభివృద్ధి సంస్థలో (DRDO) శాస్త్రవేత్తగా పనిచేసి పదవీ విరమణ చేసారు. హైదరాబాద్ లో విశ్రాంత జీవితం గడుపుతూ రచనా వ్యాసంగాన్ని ప్రవృత్తిగా ఎంచుకున్నారు.

వందకు పైగా కవితలు రాసి ఫేస్బుక్, వాట్సాప్ సముదాయాల్లో పోస్ట్ చేశారు. వాటిని 'నా మదిలో మెరిసిన హరివిల్లు' అనే పుస్తక రూపంలో ప్రచురించారు.

భాగవత గ్రంథం నుండి శ్రీహరి అవతార వర్ణనలు, ధర్మసూత్రాలు ఆధారంగా 'భాగవత సూక్తులు' అనే శీర్షికతో నిర్విఘ్నంగా 444 రోజులు సాంఘిక మాధ్యమాలలో పోస్ట్ చేశారు. వీటిని "హరిభక్తి సుధామృతం" అనే ఈ పుస్తకంగా ఇప్పుడు ప్రచురించడం జరిగింది.

"గో తెలుగు.కామ్" అంతర్జాల పత్రికలో 'భాగవత కథలు' అనే శీర్షికతో 32 కథలు, పురాణగాథలు అనే శీర్షికతో 16 శివపార్వతుల కథలు ప్రచురించారు. వీటిని "హరిభక్తి కథామృతం" మరియు "శివ-శక్తి గాథలు" అనే పుస్తకాలుగా ప్రచురణకు సిద్ధం చేసారు. కొన్ని వ్యాసాలు, సాంఘిక కథలు కూడా అంతర్జాల పత్రికల్లో ప్రచురించారు.